# అమ్మ

# అందించిన ఆత్మానుభూతి



రచయిత త్రిలోక అప్పారావు

# అమ్మ

# అందించిన ఆత్మానుభూతి



ఓంకార స్వరూప సుముఖీమ్
శ్రీమాతృప్రేమాకృతీమ్
అర్కక్షేత్రనివాసినీమ్ శుభకరీమ్
జ్ఞానానసూయాంభజే ॥

రచయిత

**టి. త్రిలోక అప్పారావు**

అమ్మ అందించిన ఆత్మానుభూతి

ప్రథమ ప్రచురణ : ది. 17-2-2007

నాన్నగారి ఆరాధనోత్సవ సందర్భము

ప్రతులు : 1500

ప్రచురణ : టి. త్రిలోక అప్పారావు
రైల్వేట్రాక్ రోడ్డు,
గోపాలునివారివీధి, ఆర్.ఆర్.పేట,
పశ్చిమగోదావరి జిల్లా
పిన్ : 534 002.
ఫోన్ : 08812-230975.

మూల్యము : రు. 25-00

డి.టి.పి. : క్షీరసాగర ప్రెస్, ఏలూరు.
సెల్ : 94405 72878

ప్రింటర్స్ : శ్రీ గణేష్ గ్రాఫిక్స్, గుంటూరు.
సెల్ : 98851 79975

కృతి సమర్పణ

జగజ్జనని అనసూయా మాతకు,

నాన్న గారికి.







భక్తితో

రచయిత

**టి. త్రిలోక అప్పారావు**

# విషయ సూచిక


1. ముముక్షుత్వం ... 1
2. దిగివచ్చిన దైవం ... 3
3. ఎవరీ అమ్మ ... 7
4. అమ్మయే రాముడు-రాముడే అమ్మ ... 9
5. అమ్మ నిజరూపమేది ... 13
6. నామపారాయణప్రీత ... 14
7. ఆబ్రహ్మకీటజనని ... 16
8. అమ్మకు అసాధ్యం లేదు ... 17
9. మృతపుత్రుని సజీవ దర్శనం ... 19
10. దుష్ట సంస్కార సంహరణ ... 20
11. కుక్కతో నేర్పించిన యోగాభ్యాసం ... 22
12. తినేవాడికే ఇంత హాయిగా ఉంటే పెట్టేవాడికి ఎంత హాయిగా ఉంటుంది ... 23
13. ఏంచేసినా మీరే చేయాలి ... 24
14. గడ్డ కూడా బిడ్డే ... 26
15. మంచిజన్మ అంటేనో ... 28
16. సన్యాసం వచ్చేదే గాని ఇచ్చేది కాదు ... 29
17. దేవుడంటే ... 31
18. ప్రయత్నం ఉందా లేదా ? ... 32
19. బాధ శరీరానికేగాని మనసుకులాసాగానే ఉంది ... 34
20. మిమ్మల్ని వదలి నేనెక్కడికి పోతాను ... 35
21. నేనుండగా భయమెందుకు ? ... 36

22. పిలిస్తే పలుకుతా ... 38
23. నేనునీకు పెట్టడమంటే
నీచేత ఇతరులకు పెట్టించడానికే ... 39
24. బిడ్డమాట అమ్మ బాట ... 40
25. ద్రస్సూ . . . అద్రస్సూ ... 41
26. మనం అమ్మను వదలినా
అమ్మ మనలను వదలదు ... 42
27. అర్కపురమా . . . బృందావనమా ... 44
28. మాతృశ్రీ అధ్యయన పరిషత్ ... 46
29. ఆనందోత్సవం . . . అమ్మ స్వర్ణోత్సవం ... 48
30. అమ్మ ఏలూరు పర్యటన ... 50
31. నా ఇల్లు పునీతమైన రోజు ... 52
32. పారిశుధ్య పరివారల కాలనీ ... 53
33. వాత్సల్య జలధి ... 54
34. కొల్లేటి విహారయాత్ర ... 55
35. నేను రామకృష్ణ అన్నయ్య ... 56
36. నక్సలైట్లు . . . నాబిడ్డలే ... 57
37. అమ్మ సన్నిధిలో ఆబ్దికాలు ... 59
38. తోడూ నీడా ... 62
39. సంస్కరణ ... 63
40. శిక్ష కాదు - శిక్షణ ... 69
41. కరిగిన మనస్సు ... 72
42. మహోపదేశం ... 73
43. అమ్మే గురువు ... 74

| | | | |
|---|---|---|---|
| 44. | అమ్మ రక్షణ వలయంలో మాకుటుంబం | ... | 75 |
| 45. | ఆపద్భాందవి అమ్మ | ... | 76 |
| 46. | అందరికి అమ్మ ఎలా అవుతుంది | ... | 77 |
| 47. | పెండ్లికానిపెండ్లి - అమ్మ చేసిన పెండ్లి | ... | 78 |
| 48. | కర్తవ్య బోధ | ... | 80 |
| 49. | సంస్థను మీరు చూడండి మీ సమస్తం నేను చూస్తా | ... | 81 |
| 50. | అమ్మ మన దగ్గరకు వస్తుంది | ... | 83 |
| 51. | ఇంటి గుమ్మంలో అమ్మ కాపలా | ... | 84 |
| 52. | పాదముద్రలు | ... | 85 |
| 53. | నేను పూర్ణానంద స్వామి | ... | 87 |
| 54. | నన్ను నేను సాక్షిగా చూచుకున్నాను | ... | 89 |
| 55. | నీ వంటూ ఉంటేగా | ... | 90 |
| 56. | సోహంమంత్రం-కుండలినీయోగసాధన | ... | 91 |
| 57. | శ్వాసమీద నిఘా | ... | 93 |
| 58. | శ్వాసమీద నిఘా దినకర్ గారితో సంభాషణ | ... | 98 |
| 59. | జ్యోతి దర్శనం | ... | 100 |
| 60. | అంతా అదే | ... | 102 |


- ం -


| | | |
|---|---|---|
| అమ్మకోరిక | ... | 105 |
| అమృత సందేశం | ... | 106 |

# అన్నయ్యకు అభినందన

'రవి'
బ్రహ్మాండం రవీంద్రరావు,
విశ్వజననీ పరిషత్ పాట్రన్.

అమ్మయే తల్లి, అమ్మయే తండ్రి, అమ్మయే దైవం, అమ్మయే సర్వస్వం అని భావించి ఆచింతనలో జీవించే అన్నయ్యల రచనలను గూర్చి నన్ను వ్రాయమంటే నాకు భయం పుడుతుంటుంది. నేనేమీ ఆధ్యాత్మిక గ్రంథాలను చదువుకున్నవాడిని కాను. మరి అన్నయ్య ఆత్మీయతతో అడిగిన మాటను కాదననూలేను. నాకున్న అర్హత అమ్మరక్తం పంచుకొని పుట్టిన బిడ్డను కావటమే. అనుభవాలకేమి ? ఎవరి అనుభవాలు వారివి. నా ప్రమేయంలేకుండా నాకు కొన్ని అనుభవాలు ఇచ్చింది అమ్మ ఆ అనుభవాలను ఇంత జిజ్ఞాసతో అప్పారావు అన్నయ్యలాగా గీతా వాక్యాలతో ఉపనిషత్తులతో సమన్వయం చేసే శక్తి నాకులేదు.

అప్పారావు అన్నయ్య జిల్లెళ్ళమూడి మొదటిసారిఎలా వచ్చింది. మళ్లీ రావాలనే కోరిక ఎలా ఉద్భవించింది. వచ్చింతరువాత అమ్మ ఎడల అచంచలమైన విశ్వాసం ఎలా కుదిరింది ? మానవ మనస్తత్వంలో వచ్చే ద్వంద్వ భావాలకు అనుమానాలకు విశ్వాసం కుదిరిన తర్వాత కూడా వచ్చే ఆటంకాలు, వాటిని అధిగమింపచేసే అమ్మ ఇచ్చిన అనుభవాలను చూస్తుంటే "నమ్మి చెడినవాడు లేడు". జిల్లెళ్ళమూడి వచ్చి వృధాగా ఎవరూ పోరు. చూడటమే పొందటం అన్న అమ్మ వాక్యాలు ఈ గ్రంథం అక్షరాక్షరంలోనూ గురుతుకువస్తున్నాయి.

భద్రాద్రి దేవాలయంలో రాముడే అమ్మగా ఎలా అనుభూతమైందీ, సింహాచలంలో జీవితం మీద విరక్తుడై నిస్పృహతో ఉన్నరోజున ఎలా ఆచార్యులవారి రూపంలో అమ్మ ఆదుకున్నదీ ఆయాసన్నివేశాలు చదువుతుంటే ఆనందానుభూతి కలుగుతుంది.

ఇక తన నూనె సరుకు దొంగిలించి అమ్ముకున్న బిపిన్‌కుమార్ బెహరా పట్ల అప్పారావు అన్నయ్య చూపించిన మానవీయదృక్పథంతో హృదయం ద్రవించింది. జిల్లెళ్ళమూడి అన్నయ్యలు అక్కయ్యలలో ఇటువంటి మానవీయసేవాభావం నన్ను ఎప్పుడూ ఆకర్షిస్తుంటుంది. అటువంటి తత్వాన్ని నేను కోరుకుంటాను.

నేను ముందే చెప్పాను అప్పారావన్నయ్య యోగశక్తిని గూర్చి, సాధన గూర్చి, ఆయన పొందిన దర్శనాలను గూర్చి చెప్పేపరిజ్ఞానం నాలో లేదు. అవి చదివి సోదరులలో ఇటువంటి పరిణతి చెందిన సాధకులన్నందుకు అమ్మను అర్థం చేసుకోవడంలో వారి మేధాశక్తిని, జిజ్ఞాసను ప్రశంశించడం తప్ప.

మీకు అన్నంగాని, గుడ్డలుగాని పెట్టడం అంటే మీచేత ఇతరులకు పెట్టించటానికే అన్న అమ్మమాటను, అందరూ అప్పారావు అన్నయ్యలాగా నిర్వర్తించటం కంటే కావలసిందేముంది.

ఈ రెండు మాటలూ నేను వ్రాయటానికి అన్నయ్య గ్రంథమే ప్రేరణ.

ఇటువంటి అనుభవాల మాలలు రావలసిన అవసరం ఉన్నది. జిల్లెళ్ళమూడి వచ్చిన సోదర సోదరీమణులందరికి అనుభవాలున్నాయి. వాటిని కాగితం మీద పెట్టగలిగిన శక్తి కొందరికే ఉంటుంది. ఆలా చేసిన అప్పారావన్నయ్యను అభినందిస్తున్నాను. అమ్మ ఆశీస్సులు ఎప్పుడూ వారి కుటుంబానికి ఉండాలని కోరుకుంటున్నాను.

**రవి.**

బ్రహ్మాండం వసుంధర,
జిల్లెళ్ళమూడి,
20-1-2007

అప్పారావు అన్నయ్య బాల్యంలోనే వారి ఇంటి ఇలవేల్పు అయిన లక్ష్మీనరసింహస్వామి అనుగ్రహాన్ని పరిపూర్ణంగా పొందిన వాడై అమ్మకు చేరువయ్యాడు. అమ్మ కృపాసాగరంలో ముంచబడి అమ్మ ప్రేరణతో అమ్మకు తనకు ఉన్న అనుబంధాన్ని అమ్మ తనకు ఇచ్చిన అనుభవాలను మనకు అందించాలన్న తపనతో అది ఒక మహా యజ్ఞంగా భావించి సుందరమైన కుసుమాల మాలగా కూర్చి అమ్మ పాదపద్మాలపై ఉంచి అర్చించిన అప్పారావన్నయ్యకు, అమ్మ కరుణాదృష్టిని సంపూర్ణంగా పొందుతున్న వారి కుటుంబానికి సదా అమ్మ దివ్య ఆశీస్సులు ఉండాలని అమ్మను ప్రార్థిస్తూ . . .

అమ్మ చరణసేవలో . . .
**వసుంధర.**

# మంగళా శాసనములు

విశ్వబంధుతపోవనం
పెదపులిపాక

స్వామివాసుదేవానందగిరి
10-1-2007

చిరంజీవి త్రిలోక అప్పారావు చిరకాల పరిచితుడు. మీదు మిక్కిలి ఆశ్రమభక్తుడు. ఈయన అమ్మకు అనుంగుబిడ్డ. **"అమ్మ అందించే ఆత్మానుభూతి"** అనే ఈ గ్రంథం రాశిలో కంటే వాశిలో గొప్పది. స్వయంగా ఆయనేచదివి వినిపించగా ఆద్యంతమూ విన్నాను. ఆనందించాను.

అమ్మ అనుగ్రహమెంతటిదో ప్రతిపుటలోను వ్యక్తీకరించబడినది. **" అనుభవము, గురువాక్యము, శాస్త్రము"** ఈ మూడింటి సమన్వయం ఈ పుస్తకంలోని విషయం. గహనమైన విషయాన్ని అలతి అలతి మాటలతో సాధకులకు సమగ్రంగా అందిచబడినది. అందువలన సాధకులకు, యోగాభ్యాసకులకు, ఉపాసకులలకు కూడా పరమ ప్రయోజన కరమైన పుస్తకము. అమ్మ అనుగ్రహంతో ఇటువంటి అనుభవ పూర్వక గ్రంథములు మరిన్ని వీరినుండి వెలువడాలని ఆసిస్తూ ఆశీర్వదిస్తూ మంగళాశాసనములు.

నారాయణ స్మరణలతో . . .

వాసుదేవానందగిరి,

10-1-2007.

ఓం నమ(శ్శ్రీ సీతారామ లక్ష్మణయతీం(ద్రాయ !


**ముత్తీవి సీతారాం**
ముముక్షుజన మహాపీఠాధిపతులు



ఫోన్ : 08671-56270
ముముక్షుజన మహాపీఠము
శ్రీ కృష్ణాశ్రమము
'రసధుని' :
పెదముత్తీవి : కృష్ణా
పిన్ : 521 126


## మంగళాశాసనము !

భగవద్విభూతి చాలా చిత్రమైనది ఎప్పుడు ఎవరి ద్వారా ఏవిధంగా ఆవిష్కరింపబడుతుందో ఎవరికీ అంతుపట్టనంత చిత్రమైనది. తమద్వారా భగవద్విభూతి ఆవిష్కృతమయే అదృష్టానికి పెట్టిపుట్టిన వ్యక్తులకుకూడా, ఆవిష్కృతమయ్యే సమయంలో అవగతం అవుతుందేగాని, అంతకుముందు వారికీ అంతుపట్టదు.

సోదరులు శ్రీ త్రిలోక అప్పారావుగారి ద్వారా వచ్చిన 'భాగవతం' విషయంలో ఈ విషయం మరోమారు నిరూపితమైంది.

సోదరులు శ్రీ త్రిలోక అప్పారావుగారి ద్వారా భాగవతం రావటం ఏమిటి ? అనే ప్రశ్న ఉదయించటం సహజం.

భగవంతునిలోని మాతృతత్వాన్ని తన దివ్యజీవనం ద్వారా వెలార్చిన అవతారమూర్తి అమ్మ - జిల్లెళ్ళమూడి.

అమ్మను భగవంతుడుగా, భగవంతుని అమ్మగా ఆరాధిస్తున్న ఆదర్శసాధకులు శ్రీ త్రిలోక అప్పారావుగారూ. శ్రీ బొప్పూడి రామబ్రహ్మంగారూ శ్రీ బులుసు లక్ష్మీప్రసన్న సత్యనారాయణ శాస్త్రిగారు ఇత్యాదులు.

భగవదవతారములు ఎలా అనంతములో భగవదభిన్నమూర్తులైన మహాపురుషుల అవతారములూ అలాగే అనంతములు. భగవద్భాగవత గుణగాన కీర్తనం చేసే భాగవతమూ అనంతమే!

శ్రీ వేదవ్యాస భగవానునిచేత అనుగ్రహింపబడి, మహాకవి శ్రీ పోతనామాత్య ప్రసాదితమైన శ్రీ మద్భాగవతం కర్ణిక కాగా, భాగవత జనులను అనగ్రహిస్తున్న అనంతదళ భాగవత పద్మంలో శ్రీ త్రిలోక అప్పారావుగారి రచన ఒక దళం.కనుక ఇదీ భాగవతమే !

అమ్మను దర్శించినవారికి ఆ దివ్యస్మృతులు దివ్యానుభవములనూ నెమరువేసుకోవటానికీ, అమ్మను ఇంతవరకూ దర్శించనివారికి దర్శించే ప్రయత్నం చేయటానికీ ఏ మాత్రంఉపయోగపడినా, ఈ రచన సార్ధకమే.

'పాండిత్యభారం' ఏమాత్రం లేకుండా అమ్మ తనకు అనుగ్రహించిన, అనుగ్రహిస్తున్న అనుభవాలు మాత్రమే సాగిన ఈ రచనలోని ప్రత్యక్షరం ద్వారా దివ్యసాన్నిధ్యం అనుభవంలోకి వస్తున్నది.

సోదరులు శ్రీ త్రిలోక అప్పారావుగారూ, శ్రీ అనగాని సౌభాగ్యరావు గారూ. శ్రీ బొప్పూడి రామబ్రహ్మంగారు ఇత్యాదులు ఋత్విక్కులుగా నిర్వహింపబడిన ఈ మహాయజ్ఞఫలం మన అందరిదీ ! ఈ సేవారూపయజ్ఞంలో సహకరించిన అందరినీ అభినందిస్తూ అందరికీ అమ్మ అనుగ్రహం అపారంగా లభించాలని మంగళాశాసనం చేస్తున్నాను.

శ్రీ వ్యయనామ సంవత్సర మాఘ శుద్ధ సప్తమి రథసప్తమి.

సెలవు.

ముత్తీవి సీతారాం.

# అనుబంధం - ఆత్మీయత

బొప్పూడి రామబ్రహ్మం
రిటైర్డ్ జనరల్ మేనేజర్ (ఆంధ్రా బ్యాంక్)
ప్రసిడెంట్ : విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

1974వ సంవత్సరంలో ఆంధ్రా బ్యాంక్ మేనేజరుగా నన్ను ఏలూరు బదిలీ చేశారు. అప్పటికే మాతృశ్రీ మాసపత్రిక చదువుతూ ఉండేవాడిని. ఆ పత్రిక ద్వారా మాతృశ్రీ అధ్యయన పరిషత్ ఏలూరు శాఖ చాలబాగా పనిచేస్తుందని తెలుసుకోగలిగాను. అప్పటికి నాకు ఇంకా అమ్మ దర్శనం కాలేదు. ఏలూరు రాగానే అధ్యయన పరిషత్ అడ్రస్ గురించి అడిగినా తెలియలేదు. ఒక రోజు వ్యాపారం నిమిత్తం రైస్ మిల్లర్స్‌ను కలుసుకుంటూ అప్పారావన్నయ్యగారి రైస్‌మిల్లుకు కూడా వెళ్ళాను. అక్కడ మాతృశ్రీ అధ్యయన పరిషత్ ఏలూరు శాఖ అని బోర్డు ఉన్నది. అప్పారావన్నయ్య కూడా అక్కడే కూర్చుని ఉన్నాడు. అలా యాదృచ్ఛికంగా మాతొలిపరిచయమయింది. అమ్మను గురించి ఏమాత్రం తెలుసుకోవాలనే ఉత్సుకత చూపినా, వారిని తన సొంత ఖర్చులతో జిల్లెళ్ళమూడికి తీసుకువెళ్ళి అమ్మదర్శనం చేయించేవారు అప్పారావన్నయ్య. ఏలూరులో ఉన్నంతకాలం నా సాయంకాలం అడ్రస్ అప్పారావన్నయ్య గారి రైస్ మిల్లే. అమ్మకు సుస్తీగా ఉన్నప్పుడు ఏలూరులో జరిగిన ఏకాహముల నిర్వహణలోనూ సత్సంగాలలోనూ శ్రద్ధగా పాల్గొనడం, అమ్మపేరిట జరిగే ప్రతి కార్యక్రమాలలో అన్నయ్యకు బాసటగా నిలవడంతో మా ఆత్మీయత బలపడింది. నాకు-అన్నయ్య "నీవేనేను-నేనేనీవు" అన్నట్లుగా (ALTER-EGO లాగా) అనిపించేవాడు. నేను ఏలూరు నుండి బదిలీ అయినా మా ఆత్మీయత సాయంత్రపునీడలా ఎదిగింది.

అన్నయ్యకు ఏకష్టం వచ్చినా నాకు ముందుగానే సంకేతాలు అందేవి. ఆయన చెప్పకముందే ఏమిటీ విషయమని ఫోన్ చేసి అడిగేవాడిని. అమ్మచేసిన అనేక విచిత్ర సంఘటనలలో ఇది కూడా ఒకటి.

అన్నయ్య స్వభావం నా జీవిత విధానంపై చాలా మార్పులు తెచ్చింది. అన్నయ్యతో పరిచయమయ్యేనాటికి మా ఇంట్లో ప్రతి శనివారం ఉదయం మాత్రమే పూజ చేసుకునే వాళ్ళము. అన్నయ్య మా శ్రీమతితో మాట్లాడి నచ్చచెప్పి ప్రతిరోజూ ఉదయం దీపారాధన, పూజ, ప్రార్ధన చేసుకునే అలవాటు చేశారు. అంతేకాదు నాకు శ్రీరామ షోడశోపచార పూజావిధానం కూడా నేర్పారు. కొద్దిరోజులు ఇలా గడిచిన తర్వాత మాశ్రీమతికి సాయంకాలం కూడా దీపారాదన చేసే అలవాటు చేశారు. ఇలా మాకే కాదు ఎన్నో కుటుంబాలలో ఈ ప్రక్రియను ప్రోత్సహించారు. అప్పట్లో మేము మాంసాహారము కూడా తినేవాళ్ళము. ఒక సారి మా ఇంట్లో భోజనం చేయమని అన్నయ్యనడిగితే మీ పాత్రలు మాంసాహారముతో వండినవి కనుక పాత్రదోషము ఉంటుంది. అందుచేత నాకు ఇబ్బంది అంటూ సున్నితంగా చెప్పారు. విశేషమేమంటే అమ్మదర్శనమైన కొద్దిరోజుల తరువాత నా శరీరానికి మాంసాహారము సరిపడలేదు.

మా ఇంట్లో మాంసాహారము వండటం, తినడం మానివేశాము. ఒక రోజు మా వంటింట్లో దొంగపడి కేవలం వంటసామానులను మాత్రమే దొందిలించాడు. అమ్మను కలిసినప్పుడు ఈ విషయం చెబితే తానే చేయించానని అంగీకరించింది. అన్నయ్య నేను భోజనం చేయ్యడానికి ఒక పళ్ళెం, గ్లాసు కొని ఇచ్చాడు. దానిలో నేను కనీసం పదిపదిహేను సంవత్సరాలు భోజనం చేశాను. మరల నాకు ఏలూరు 1983లో ఆంధ్రాబ్యాంక్ రీజనల్ మేనేజరుగా బదిలీ అయింది. వారి ఇంటిలో జరిగే ఆదివారపు సత్సంగాల్ని మా ఇంటికి మార్చాను. అన్నయ్యతో ఉన్న అన్ని అనుబంధాల్నీ వ్రాస్తే అదే ఇంకొక గ్రంథం అవుతుంది. అన్నయ్య నిజాయితీ మా అనుబంధాన్ని బాగా పెంచింది. ఈ రోజుల్లో ధనార్జనకు అనేక వక్రమార్గాలు అన్వేషిస్తున్నారు. కాని అన్నయ్య కల్తీచేసి నూనె అమ్మడానికి ఇష్ట పడక సం॥రానికి లక్షలు గడించిపెట్టే నూనె వ్యాపారాన్ని మానేశాడు. మోసం చెయ్యకుండా, అబద్దాలు చెప్పకుండా ఏ వ్యాపారం చేస్తే బాగుంటుందా అని ఆలోచనచేసి రిటైల్ మెడికల్ షాపు పెట్టారు. చివరకు దానిని మానివేశారు. ఎంతమంది తాము నమ్మిన సత్యంకోసం ఆధ్యాత్మిక జీవనం కోసం వ్యాపారం మానివెయ్యగలరు !

అమ్మే సర్వస్వం. అమ్మతో సంప్రదించకుండా ఏపనీ చేయడు. ఎవరితో మాట్లాడినా అమ్మ ప్రసక్తి లేకుండా ఉండదు. చివరికి అమ్మధ్యాసే ధ్యానం అయింది. అన్నయ్యకు.

చదువుకున్నది 8వ తరగతి. లలితాసహస్రనామాలను గురించి 40 రోజులు ఉపన్యాసాలను ఇవ్వడమా! భగవద్గీత సప్తాహాలు జరిపించడమా! ఆశ్చర్యముకదా ! వ్యాపారం మానిన తర్వాత స్వాధ్యాయం సంత్సంగం ధ్యానం అన్నయ్య వ్యాసంగం. జీవితలక్ష్యం సాధించాలన్న తపన, నిజాయితీ, శ్రద్ధ, అన్నయ్యను ఉన్నత స్థితికి తీసుకెళ్ళాయి. వేదాద్రి మహర్షిగారి సులభ కుండలినీ యోగ (ఎస్.కె.వై) సంస్థలో కుండలినీ యోగంలో మాస్టరుగా అర్హత సంపాదించారు. అయినప్పటికీ అమ్మనే నమ్ముకుని ప్రయాణం సాగించారు. ఇప్పటికీ యోగ సాధనలో వచ్చే సందేహాలకు స్వప్నావస్థలో గానీ ధ్యానంలో గానీ అనుభవ పూర్వకంగా అందిస్తూ గురువుగా ముందుకు నడిపిస్తుంది అన్నయ్యను అమ్మ .

ఇక పుస్తకాన్ని గురించి చెప్పేదేముంది ఇందలి ప్రతిమాటా నిజం. తాను అనుభవించే ఆనందాన్ని నలుగురితో పంచుకోవాలనే తపనే ఈ పుస్తకానికి ప్రేరణ. ఈ పుస్తకం సాధకులకు కరదీపిక. అమ్మతో అన్నయ్య అనుబంధాలు అపారం. అందులో కొన్ని మాత్రమే ఈ పుస్తకంలో చెప్పబడ్డాయి మిగతావి మరొక పుస్తకరూపంలో రావాలని ఆశిద్దాం.

అన్నయ్యకు ఆయన కుటుంబానికీ అమ్మఎంతో సన్నిహితంగా ఈ రోజువరకూ ఉంది. తన వాత్సల్యాన్ని కృపనూ విశేషంగా వర్షిస్తుంది.

ఇట్లు
అమ్మసేవలో
రామబ్రహ్మం.

Y.H.RAMAKRISHNA
Sr. Manager Andhra Bank.
Head Office, Saifabad,
HYDERABAD.
Resi. A-301, Aditya Apartments,
Durganagar Cololy, Panjagutta,
HYDRABAD.
☎ : 040-23416218

# అమ్మ అమృతవాక్కులు

శ్రీ త్రిలోక అప్పారావు అన్నయ్యగారు అధ్యాత్మయోగానందాకాశంలో సంచారాలు చేసే యోగి. ఇక అమ్మలగన్నయమ్మ అనసూయమ్మ అవ్యాజకరుణామూర్తి. చిరు వాక్యములతో అధ్యాత్మజ్ఞానయోగం ప్రబోధించే యోగేశ్వరి.
అమ్మ వాక్యాలు అమృత వాక్యాలే !

అమ్మ - అప్పారావు అన్నయ్యల గురుశిష్యానుబంధం అమోఘం. అప్పారావు అన్నయ్య అది తలచుకొని తలచుకొని తన్మయులౌతూ ఉంటారు. అది మార్గదర్శక మార్గాన్వేషకుల అధ్యాత్మ సమాగమం. అప్పారావుగారి అమ్మపై "గురి" నాకు ఆనంద-ఆశ్చర్యాలు కొలుపుతూ ఉంటుంది. గురి కలుగుటయే గురువు లభించుట కదా!. ఈ రచనలో అన్నయ్యగారు లక్ష్మీనరసింహస్వామి యొక్క చమత్కార స్పర్శనుండి ప్రారంభించి అమ్మతో ఆత్మానుభూతివరకు మెట్టుమెట్టుగా స్వీయానుభవములను భావితరాలకు మార్గదర్శకంగా అందిస్తున్నారు.

శ్రీ అప్పారావుగారు ఈ రచనలో మనకందిస్తున్న అమ్మయొక్క అద్భుతమైన తాపత్రయ విముక్తమగు మధురమైన ఆణిముత్యాలు నేను ఆనందిస్తూ ఆస్వాదిస్తూ ఆశ్చర్యపడుతూ ఈ గ్రంథ పరిచయవాక్యాలతో పాఠకులతో పంచుకుంటున్నాను. అమ్మది ఆధ్యాత్మవిద్యలో ఒక విప్లవం. ఇక వినండి!

" తరించటానికి సులభమార్గం ఏమిటమ్మా ?" అని అడిగితే
"సంసారమే తరించటానికి సులభమార్గం నాన్నా !" అని సమాధానము.
"అమ్మా! ఇదంతా దైవ సంకల్పమేనా?" అని అడిగినప్పుడు, "దైవసంకల్పం కాదు నాన్నా! సంకల్పమే దైవం". అని వివరించటమా !
"సత్సంగత్వే నిస్సంగత్వం - నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వేనిశ్చలతత్వం - నిశ్చలతత్వే జీవన్ముక్తి ః"

అని ఆచార్య శంకరులు చెప్పారు. అప్పారావన్నయ్యను చూస్తుంటే ఆయన రచనలు చదువుతుంటే శంకరులు చెప్పిన నిస్సంగత, నిర్మోహత, నిశ్చలత, ముముక్షుత - సాధనాచతుష్టయం వల్ల సాధించాడో అమ్మ కరుణవల్ల పొందాడోగాని అందుకున్నాడనిపిస్తుంది. తృప్తే ముక్తి అన్నది అమ్మ. ఆ తృప్తి అందుకున్నాడని పిస్తుంది. " మృత్యువంటే భయంలేకపోవడమే మృత్యుంజయత్వం" "ముముక్షుత్వమే మోక్షం" అన్నది అమ్మ. ఇవి అప్పారావన్నయ్యలో కనిపిస్తున్నాయి.

అసలు తనలక్షల ఆస్తిని దొంగతనం చేసిన వానిని క్షమించి ఎదురు డబ్బుకట్టి బందికానా నుండి దొంగను విడిపించే ఔదార్య క్షమా గుణం ఎంతమందికి ఉంటుంది. కష్టం వచ్చినపుడుకదా ! మానవుని వ్యక్తిత్వం బయటపడేది.

భగవంతుని కోసం పరితపించడం కూడా భక్తుని లక్షణమే. అమ్మ అనారోగ్యంతో బాధపడుతున్నది నెల్లూరులో. రంగనాయకస్వామి ఆలయానికి వెళ్లి లక్ష్మీదేవిని ప్రార్థించాడు అమ్మ అనారోగ్యం పోవాలని. అమ్మకూడా జగన్మాతయేకదా. స్పందించింది. అలాగే రంగనాయక స్వామినీ అర్థించాడు. ఆయనలో చలనంలేదు. ఆవిషయం అమ్మతో చెప్పితే " ఏం చేసినా మీరేచెయ్యాలి రంగనాయకులేంచేస్తాడురా" అన్నది. అంటే మనలోని ఆర్తి తపన అమ్మ అనారోగ్యాన్ని తగ్గిస్తుందన్నమాట. తపనే తపస్సు అన్నది గదా !

యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరం।
తత్సర్వం తపసా సాధ్యం తపోహి దురతిక్రమం॥

కనుక తపస్సువల్ల ఏదైనా సాధ్యమే. ఇతర ఏమార్గాలవల్ల సాధ్యంకానిది తపస్సువల్ల సాధ్యమే. గనుక అమ్మ ఆరోగ్యంకోసం అప్పారావన్నయ్య తపనతోడ్పడింది. అంతేకాదు ఏదో దొరకని మందుకోసం రామకృష్ణ అన్నయ్య ఫోనుచేస్తే కష్టపడి నిరంతరం అమ్మ స్మరణచేస్తూ సాధించి నెల్లూరు తెచ్చాడు ఆ మందు. అప్పటికే మద్రాసులో ఎక్కడో దొరికిందని డాక్టరు సుబ్బారావుగారు తెప్పించి వాడారు కాని నెమ్మదించలేదు. డాక్టరుగారు నీవే తగ్గించుకోవాలని ప్రార్థిస్తే " అప్పారావు తెచ్చిన మందువాడు తగ్గుతుంది" అన్నది అమ్మ. అదే మందమ్మా నేను మద్రాసు నుండి తెప్పించివాడింది అన్నారు డాక్టరుగారు. అది వాడిచూడు అంది. అప్పారావు అన్నయ్య తెచ్చింది వాడగానే జబ్బుతగ్గింది. అంటే మందు కాదు తగ్గించేది మందుతేవడంలో అప్పారావన్నయ్య పడ్డ ఆతృత ఆవేదన తగ్గించిందన్నమాట.

అమ్మ చూపించే వాత్సల్యానికి అకారణకరుణకు ఎవరి హృదయమైనా కరిగిపోక తప్పదు. ఆనందాశ్రువులు జలజలారాలకతప్పదు. స్వర్ణోత్సవం తరువాత ఏలూరు వచ్చిన అమ్మను ఇంటికి పిలిచే స్థోమత, ఇంటి వైశాల్యం అంగీకరించవని

అప్పారావన్నయ్య ఇంటికి ఆహ్వానించలేదు. అమ్మకు ఆహ్వానమెందుకు ? బిడ్డ యింటికి రావడానికి. నేను మీ ఇంటికి వస్తున్నాను అని చెప్పిమరీ వచ్చింది. గదులు చిన్నవి కావడంతో దొడ్లో ఖాళీస్థలంలో మంచం వేయించుకొని పడుకొని హాయిగా ఉందిరా ఇక్కడ అన్నది. ఇక అప్పారావన్నయ్య ఆనందానికి అవధి ఏముంటుంది ?

ఇక అప్పారావన్నయ్య భక్తి సాధన, యోగసాధన, జ్ఞానసాధనలను గూర్చి ఆలోచిస్తే ఏదైనా అమ్మ ప్రసాదించిందిగానే భావించాడు. "శ్వాసమీద నిఘా - వెయ్యి నాన్నా"! అంటూ అమ్మ చెప్పిన యోగవిద్యను అభ్యసించిన అన్నయ్య కుండలినీ యోగసాధన చేసి ప్రాణశక్తిని షట్చక్రముల ద్వారా సహస్రారానికి చేర్చేసిద్ధిని పొందాడు. అంతేగాక అంగుష్టప్రమాణ పురుషుడైన జ్యోతిని కూడా దర్శించాడు. ఈ రకమైన యోగసాధనలలో అప్పారావన్నయ్య ఆరితేరాడు. ఎపుడు ఏసాధన హాయిగా సాగితే అది చెయినాన్నా! అన్న అమ్మ మాట తనకు మార్గదర్శనం చేస్తూ సాధనలో నడిపించింది అని తెలుసుకున్నాడు. "జ్ఞాన దృష్టిని ఇవ్వమ్మా!" అని అన్నయ్యగారు అడిగితే ముందు అంతా అదే అనుకో తరువాత అదేనని అనిపిస్తుంది. అని సాధనకు నూతన అధ్యాయం తెరలేపటమా!

"సోహమ్" మంత్రం జపించాలని అనుకుంటున్నాను కానీ అది గృహస్తులకు ఉచితం కాదంటున్నారు ఏం చేయమన్నావమ్మా ?అని అన్నయ్యఅడిగితే, "ఎప్పుడు ఏ మంత్రం హాయిగా సాగితే అదే చేసుకో నాన్నా!" అని సందేహాలన్నీ మొదలంటూ త్రెంచివేయటమా! అన్నయ్య అమ్మచేతి అన్నంముద్ద తింటూ పరవసిస్తూ ఉంటే . . . అది చూచి అమ్మ " అన్నం పెట్టేనాకు ఎంత హాయి నాన్నా!" అని చెప్పుతూ " Man's abiding happyness is in giving But next in getting . . . అని ఇవ్వటం లోని ఆనందాన్ని జీవులకు గుర్తు చేయటమా!

ఈ విధంగా పరమాద్భుతమైన తత్వవాక్యాలతో నిండి మనకందించబడుచున్న మన అప్పారావుఅన్నయ్య గారి స్వానుభవపూర్వక రచనాపుస్తకం ఏ ఇంట్లో ఉంటే ఆ ఇంట్లో కర్మ, భక్తి, జ్ఞాన అంతర్ముఖ ప్రాణాయామయోగ కుసుమసౌరభాలు తరతరాలుగా వెల్లి విరియగలవు.

ఏలూరులో ఉద్యోగరీత్యా ఉంటున్న నన్ను మా ఆంధ్రాబ్యాంక్ ఎక్స్-జనరల్ మేనేజర్ శ్రీ రామబ్రహ్మం గారు శ్రీ అప్పారావు అన్నయ్యగారిని 1997 ఫిబ్రవరీలో పరిచయం చేశారు. శ్రీ వసిష్టరామసంవాదము(యోగవాసిష్ఠం) వచన రచనలో నిమగ్నమైన నన్ను అన్నయ్యగారు అనేక సత్సంగ సందర్భాలలో పరిచయం చేసి నాచే భగవద్గీత యోగవాసిష్ఠాది విశేషాలు పలికింపజేశారు. అనేక సార్లు తెల్లవారగానే

మా ఇంటితలుపు తట్టి అమ్మ వాక్యాలలోని పరమార్థాన్ని తాను పలుకుతూ నాచే పలికించేవారు. అమ్మ కృపచేత నాలోరాని విశ్లేషణవాక్యాలు బహిర్గతమై నా బుద్ధికి పదునుపెట్ట సాగటం అన్నయ్య గారు మెచ్చుకోలుగా చప్పట్లు చరచటం! ఆహాఁ! ఏమి భాగ్యం. అది అమ్మ ప్రసాదం. ఈ రచనలోని కొన్ని విశేషాలు. అన్నయ్యగారు "నేను సాక్షినై నా దేహాన్ని తదితర సహజీవులను చూచుకున్నాను" . . . అని 1975లో శ్రీమతి పత్తి కమలమ్మగారి ఇంట్లో జరుగుచున్న ఏకాహం సందర్భంలోని ఒక స్వానుభవాన్ని వల్లించి చెప్పారు.

"రంగస్థలంలో వెలిగే దీపంలాగా స్వయం జ్యోతి ప్రకాశంలో దేహమనోబుద్ధి దృశ్యజగత్తులు ప్రకాశింపజేయబడుచున్నాయి. అని జ్యోతి దర్శనం వర్ణించారు. యోగసాధనంలో ద్యోతకమైన జ్యోతియే ఆత్మజ్యోతి. The Enlightnment of Self ఈ జగత్తు దృశ్యమును ఈ స్వదేశమును, సహజీవుల సమక్ష చమత్కారములను వెలిగిస్తూ తానుతానై వెలుగొందుతోంది. అట్టిస్వయంజ్యోతి స్వరూపానందమే'జ్యోతి దర్శనం'లో మనకు ద్యోతకం కాగలదు.

"శ్వాసమీద నిఘా "క్రమంగా" మనస్సు మీద నిఘా" అయి మనస్సు నిశ్చలాత్మ స్వరూపంగా సంతరించుకోగా . . . " ఆత్మ సంయమయోగం" ఆస్వాదించబడగలదు ఇదే " శ్వాసమీద నిఘా"లోని పాఠ్యాంశసారం. " దర్పణంలోని దృశ్యం చంచలం కానీ దర్పణం నిశ్చలం" వంటి ఆత్మానుభూతికి త్రోవ తీయగలదు.

ఆత్మానందస్వరూపులగు పాఠకమహాశయులారా ! ఆధ్యాత్మవాఙ్మయవనంలో క్రొంగ్రొత్తగా విరిసిన ఈ గురుశిష్య బాంధవ్య నిరూపకమగు అపాప్పరావు అన్నయ్య గారి ఈ స్వానుభవ పుష్పపరిమళాన్ని మనమంతా ఆస్వాదించెదముగాక !
" ఇదంతా అదే! ఇదంతా స్వయంజ్యోతి స్వరూపమే" అన్న జగజ్జనని అనసూయా మాత వాక్యాలు మనందరి హృదయాలలో సర్వదా ప్రతిధ్వనించునుగాక ! ఈ మహత్తర స్వానుభవ పుష్పసుగధం సర్వే సర్వత్రా వెల్లివిరిస్తూ ఆధ్యాత్మికానందం పంచిపెట్టును గాక !

శ్రీ త్రిలోక అప్పారావు గారి ఆధ్యాత్మిక కార్యక్రమములు సర్వదా దిగ్విజయమగుగాక!లోకకల్యాణమగుగాక.

హనుమ రామకృష్ణ

# అక్షర జ్యోతులు

**పొత్తూరి వెంకటేశ్వరరావు**, జర్నలిస్టు, హైదరాబాద్, 15-1-2007

ఉపనయనం రెండవ జన్మనిస్తుందని వాడుక. అదే ద్విజత్వం. ఐతే అదివైదిక సమాజంలో కొందరికే పరిమితం. కాని జిల్లెళ్ళమూడి అమ్మను దర్శించిన అందరికి అది రెండవ జన్మ ప్రారంభం కావడమె. ఇందులో అతిశయోక్తి లేదు. అమ్మను చూచిన ఎవరైనా ఒకసారి అమ్మను చూచినప్పటినుండి తమ జీవితాన్ని సమీక్షించుకుంటే ఇది ముమ్మాటికి నిజమని అంగీకరిస్తారు.

త్రిలోక అప్పారావు గారు నాకంటె కనీసం కొన్ని నెలలముందు అమ్మను దర్శించారు గనుక నాకు అగ్రజులు. అమ్మ అనుగ్రహంతో అనేక అనేక అనుభవాలు పొందిన అద్రుష్టవంతులు.

అమ్మను గురించి చాలా రచనలు వచ్చాయి. పుస్తకాలు డజన్లసంఖ్యలో ఉన్నాయి. ప్రతి పుస్తకం విలక్షణమైనదే విశిష్టమైనదే. అమ్మను చూచిన అందరూ పుస్తకాలు వ్రాస్తే అవి పెద్ద గ్రంథాలయానికి సరిపడేటన్ని అవుతాయి. కాని కొందరికే అలాంటి గ్రంథరచన సంకల్పం కలుగుతుంది. సంకల్పమూ అమ్మదయే. అప్పారావు అన్నయ్య గారికి అమ్మ ఇపుడు అలాంటి సంకల్పాన్ని ప్రసాదించింది.

అమ్మ ఎవరిని ఎప్పుడు ఎందుకు తన సమక్షంలోకి రప్పిస్తుందో ఎవరూ ఇదమిద్ధంగా చెప్పలేరు. ఎవరికి ఎటువంటి అనుభవాలు కలిగాయో వారు తెలియజేస్తేనే లోకానికి తెలుస్తాయి. లోకానికి తెలియవలసిన అనుభవాలు కొన్ని ఉన్నపుడు అమ్మ గ్రంథరచన సంకల్పం కలిగిస్తుందేమో. అప్పారావు అన్నయ్య గారు అమ్మను దర్శించక ముందునుండే అమ్మ ఆయనను గమనిస్తుండేదని ఇపుడు మీచేతులలో ఉన్న పుస్తకం తెలియజేస్తుంది. అన్నయ్య గారి అనుభవాలు మనందరం చదవడం మంచిదనే అమ్మ ఆయనచేత ఈ పుస్తకం వ్రాయించిందని నా దృఢ విశ్వాసం.

అప్పారావు అన్నయ్యగారి ఈ పుస్తకంలోని అక్షరజ్యోతుల వెలుగులో అమ్మ ఉజ్జ్వలంగా మనకు దర్శనమిస్తుంది. చదువుతున్నపుడు ప్రతి పంక్తిలోను అమ్మ మనమనస్సులో సాక్షాత్కరిస్తుంది. ఏ ఆధ్యాత్మిక గ్రంథానికయినా ఇంతకు మించిన ప్రయోజనం ఏమి ఉంటుంది. అన్నయ్య గారికి వందనాలు.

పొత్తూరి వెంకటేశ్వరరావు.

# దివ్యతంతువు - ప్రేమసూత్రము

పురుషోత్తమ పుత్రభార్గవ
పి.యస్.ఆర్.ఆంజనేయప్రసాద్
విశ్వజనని సంపాదకుడు.

ఈ గ్రంథం భక్తునకూ భగవంతునకూ మధ్య పడుగూపేకలాగ అల్లుకుపోయిన ఒక విడదీయరాని అనుభందాన్ని తెలిపే దివ్యతంతువు. కాలచక్రం 60 ఏళ్లకు మళ్ళిమొదటికి వస్తుందట ప్రభవ నుండి మొదలు కావటానికి. ఈ 60 శీర్షికల గ్రంథం ముముక్షుత్వంతో ప్రారంభమై "అంతా అదే" తో సంపూర్ణమౌతుంది. అంటే మానవుడు జన్మించిన తరువాత 'ముముక్షుత్వం' కోసం అన్వేషణ జరపాలనీ, చివరకు దాని పర్యవసానం "అంతా అదే" నని తెలుసుకొని అంతాతానే అనే అనుభూతిలో మిగిలిపోవడమేనని రచయిత ఉద్దేశ్యంకావచ్చు. రచయిత చేసిందికూడ అదేమరి.

పసివయస్సులోనే సంసారభాధ్యతలు నెత్తినపడగా, వచ్చిపడిన మిట్ట పల్లాలకు తట్టుకోలేక ఒడ్డెంకించమని భగవంతుని వెంటపడ్డాడు.
"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థి జ్ఞానీచ భరతర్షభ" (భ॥ గీత. 7/16) అన్న నాలుగురకాలలో భగవంతుని సేవించే అవకాశం నూనూగు మీసాలు రాకముందే అప్పారావు అన్నయ్యకు అవధూతేంద్ర సరస్వతీస్వామి వారు, వారి శిష్యులు రామదాసు స్వామి వారు, ముముక్షుజన పీఠాదిపతులు శ్రీ లక్ష్మణయతీంద్రులు వారు శారదా ప్రియానందగారు, లలితా పీఠాధిపతులు వాసుదేవానందగిరి స్వాములవారు వంటి మహనీయులసేవ చేసుకునే అదృష్టం కలిగింది.

జీవితం జీవనం ఒడిదుడుకులకు లోనైనా మొక్కవోని విశ్వాసం భగవద్భక్తి ఆయనను ఒక ఒడ్డు చేర్చగలిగినవి. "దైవం మానుషరూపేణ అన్న సూక్తి ప్రకారం సింహాచలంలో నరసింహాచార్యులు రూపంలో దైవమే దిగివచ్చినా, భద్రాద్రిలో రాముడే అమ్మగా కనిపించినా, వినిపించినా ఇదిగో ఈ సత్సంగమే ప్రధానకారణమేమో.
"అమ్మా ! ఈ నీపర్యటన దేనికొరకు?" అని ప్రశ్నిస్తే " పిల్లలందరినీ చూచుకోవటానికి. పిల్లలు అమ్మ దగ్గరకు రాలేకపోతే, ఇక అమ్మే పిల్లలదగ్గరకు రావాలి నాన్నా". . . అని సమాధానం వాత్సల్యప్రదర్శనమా!
"నిన్ను చూడటానికి ఇందరు ఎందుకొస్తున్నారు ?" అన్నప్పుడు "ఔను పిల్లలు అమ్మని చూడటానికి రారానాన్నా?"... అని ఎదురు ప్రశ్నించటమా !

"నేను మీ యింటికి వస్తున్నాను నాన్నా !" అని అమ్మ అన్నపుడు, "మాది అద్దె ఇల్లు అమ్మా!" అని అన్నయ్యగారు సిగ్గుపడుతూ ఉంటే "నీవు ఎక్కడ ఉంటే అది నీ ఇల్లే ఈ దేహం అద్దె ఇల్లే ! మరి నీవు అప్పారావేకదా !... అని అక్కుని జేర్చుకోవటమా !

"కళ్ళుమూసుకున్నప్పుడు ఏవేవో కనిపిస్తున్నాయి. ఎందుచేత?" అని ఎవరో అడిగినప్పుడు "కనిపించేదంతా అదే అయినప్పుడు కన్నుమూత లెందుకు నాన్నా?... అని నిర్ధారించటమా!

"స్థితప్రజ్ఞత అనగా కర్తవ్య నిష్ఠ. కర్తృత్వనిష్ఠ కాదు" అని నూతన భాష్యం అందించటమా!

అల్లరల్లరి చేసి వెళ్ళిన నక్సలైట్ సోదరుల గురించి ప్రస్తావిస్తే " కొందరు బిడ్డలు అడిగి తీసుకుంటారు మరికొందరు బిడ్డలు బెదిరించి మరీ తీసుకుంటారు"... అని అందరు బిడ్డలను ఆనందడోలికలలో ముంచివేయటమా!

"ప్రయత్నానికి మునుముందే ఉండి ఉంటున్న 'ప్రేరణ' యేభగవంతుని సంకల్ప చమత్కారం"... అని సర్వకర్మలసాక్షిని కారణకారణుడను గుర్తు చేయటమా !

"ఎవ్వరినీ తిట్టనూవద్దు పొగడనూవద్దు. ఎవ్వరు ఏమి చేసినా, దానికి ప్రేరణ సర్వాంతర్యామియగు పరమాత్మయే. భగవనిర్ణయంలో అందరమూ సాధనవస్తువుల... మని జగదతీతత్వం నేర్పటమా!

"ఈ కష్టాల తొలగించమ్మా"... అని ఎవరో అర్థిస్తూ ఉంటే " కష్టమైనా సుఖమైనా... అంతా అనుగ్రహమే ! జీవితంలోని "ఒడిదుడుకులు కూడా ఆశీర్వాదమే !"... అని నూతన పంథాలో నడిపించటమా !

"నన్ను బాగుచేయి అమ్మా!" అని అప్పారావు అన్నయ్య అభ్యర్థించవస్తే ...

"ఇప్పుడు నీవు బాగానే ఉన్నావు నాన్నా! ఇప్పుడే కాదు. ఎప్పుడు కూడా"... అని అప్రమేయాత్మస్వర్వరూపాన్ని గుర్తుచేయటమా !

"గుడుల కాదునాన్నా ! గుడిశలకు వెళ్దాం, పదండి!" అని అవ్యాజప్రేమకు త్రోవ చూపించటమా !

చిన్నపిల్లల జైలును సందర్శిస్తూ "అమ్మని చూడాలని ఉన్నదా, నాన్నా ఇదిగో చూడండి. నేనే మీ అమ్మను!". అని లాలిస్తూనే డాక్టరు అమలేశ్వరరావు గారి వైపు తిరిగి "తల్లీ-తండ్రీ నీవే అయి ఈ నా పిల్లలను జాగ్రత్తగా చూచుకో నాన్నా"... అని ప్రేమపూర్వకంగా అప్పగించి వెళ్ళటమా !

"అమ్మా ! కనీసం ఈ బాధలకు తట్టుకునే శక్తిని నాకు ఇవ్వమ్మా"... అని అన్నయ్యగారు వినతి చేసుకుంటూ ఉంటే " నేను శక్తిని ఇవ్వటమెందుకు? ఆ శక్తి నీలోనే ఉన్నది. నీ గుర్తింపుకై ఎదురు చూస్తోంది" అన్ని చూపిచెప్పటమా !

అన్నయ్యగారి అర్ధాంగి శ్రీమతి కుసుమాంబ అక్కయ్యకు ఫోన్ చేసి, "నువ్వేమీ భయపడకు నేను ఉన్నాను కదా! అంతా నేను చూచుకుంటానుగా !" అని అభయం ఇవ్వటమా !

"అమ్మా!వీళ్ళు తప్పులు చేస్తున్నా రమ్మా"... అని ఎవరో ఎవరిగురించో ఫిర్యాదు చేస్తే " తల్లిని కదా ! తల్లికి తప్పులే కనిపించవు నాన్నా !" అని సర్దివేయటమా!

మరొక సందర్భంలో ఎవరికో, "చేతులు నీవిగాని, చేతలు నీవి కావునాన్నా"! అని ఒక నాటకంలోని నటునికి ఉండేవిధంగా పాత్రతో నిరహంకారం, అకర్తృత్వం, అభోక్తృత్వం వంటివి నిదుర లేపటుమా!

"ఆత్మసాక్షాత్కారం ప్రసాదించమ్మా"... అని అడగవస్తే " అది ఒకరు ప్రసాదించేది కాదు నాన్నా! కనిపించేదంతా ఆత్మస్వరూపంగా గోచరించటమే ఆత్మసాక్షాత్కారం"... అని మహర్షుల వాక్యాలు హృదయాంతరాలతో ముద్రించటమా!
"పూజాకోటి సమంస్తోత్రం స్తోత్ర కోటిసమంజపః
జపకోటి సమంధ్యానం ధ్యానకోటి సమంలయః"
అన్నారు పెద్దలు. ధ్యానంలో ఏస్థాయికి ఎదిగాడో చూచారు గదా !

ఇక జిజ్ఞాసతో అమ్మను అడిగిన ప్రశ్నలకు అమ్మ చెప్పిన సమాధానాలను తన అనుభవంతో అర్థంచేసుకున్నాడు. అంతా వాడే చేయిస్తున్నాడు, నీవంటూ ఉంటేగా, అనే మాటల సారాంశంతో తనను తాను సాక్షిగా చూచుకోవటం, ఆత్మానుభూతిని పొందటం చివరకు అంతా అదే అనే మంత్రానికి అమ్మ ఇచ్చిన బంగారు గాజుయొక్క మూల తత్వం నిర్వచనం బాగా వంటబట్టి మనది వస్తుదృష్టి అమ్మది తత్వదృష్టి అన్న మాటలలో వేదాంత సర్వస్వాన్ని ఆపోశనం పట్టాడు.

ఇక అమ్మ మహిమలు ఈ గ్రంథం నిండా కోకొల్లలు. అమ్మ రక్షణ వలయంలో ఉన్న అప్పారావన్నయ్య కుటుంబం పోగొట్టుకున్న ధనకనకవస్తువాహనాలను తిరిగి ఎలా పొందింది, అనారోగ్యంలో ఉన్నపుడు తిరిగి ఎలా ఆరోగ్యవంతులైంది వివరించారు. నామపారాయణప్రీత అయిన అమ్మ పిలిస్తే పలుకుతూ ఎలా అండగా వెన్నుకాచి నిలచిందీ మనస్సు విప్పి పరిచారు. భక్తి,సమర్పణభావము, శరణాగతి, జిజ్ఞాస. ఇన్ని ఉన్న అప్పారావన్నయ్య ఈ గ్రంథం వ్రాసి సాధకులకు ఉపకారంచేశాడు.

" నా అనుభవాలను చెప్పగలనే గాని వ్రాయటం చేతకాదు" అన్న అప్పారావన్నయ్య ఆగకుండా చదివించే ఒక రచనా శైలిని పట్టుకున్నాడు. దేనికైనా పట్టుకొమ్మ అమ్మకదా !

నీవు అమ్మ ఆస్థానకవివి గదా ! నీవు రెండు ముక్కలు వ్రాస్తే బాగుంటుంది అని అడిగితే ఏంవ్రాయాలబ్బా ! ఆయన సాధకుడు-నేను కవిని. కవిత్వం ఆద్యాత్మిక సాధనకాకపోతేగదా ! అని నన్ను నేను సంబాళించుకొని అమ్మలోనుండే వచ్చినపుడు ఎందుకు కాదనాలి ? పైగా అమ్మను అర్చించిన పుష్పాలే కదా ! ఈ గ్రంథంనిండా. దానికొక దివ్యతంతువును సమకూర్చటానికి ఈ అక్షరపుష్పాలు ఉపయోగపడితే అంతకన్నా కావలసిందేముంది.

ఈ ప్రేరణ అమ్మదే. అమ్మే మనలను కలిపి ఉంచే దివ్యతంతువు ప్రేమసూత్రము. అమ్మకు నమస్కరిస్తూ అగ్రజుడు అప్పారావన్నయ్యను అభినందిస్తూ ఈ దివ్య తంతువును సమర్పిస్తున్నాను.

# అన్వేషణ - అనుభూతి

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి

చతుర్విధా భజన్తే మాం
జనాస్సుకృతినోర్జున ! ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ ! ॥

ఆర్తితో సేవించే వారు, జిజ్ఞాసువులై అన్వేషించే వారు, ప్రయోజనార్థులై ప్రార్థించే వారు, జ్ఞానులై అర్చించే వారు అని పరమాత్మను ఆరాధించే భక్తులను నాలుగు విధాలుగా వర్గీకరించాడు గీతాచార్యుడు.

చాలాకాలం వరకు నాకు ఈ శ్లోకం ఇలాగే అర్థమైంది. కాని, ఇటీవల నా ఆలోచనలపై కొత్త వెలుగును ప్రసరింపచేసింది అమ్మ. ఆపదలో ఉన్న వారు ఆర్తులై నన్ను చేరి, తమ ఆర్తిని పోగొట్టుకొని, విశ్రాంతిని పొందుతారు. దైవం వల్లతమ ఆర్తి తొలగిపోయింది కనుక, దైవానికి తమకు ఏదో ప్రగాఢమైన అనుబంధం ఉండి ఉంటుందని భావించి, దైవమెవరు? తానెవరు? తమకు దైవానికి గల అనుబంధం ఏమై ఉంటుంది ? ఆ బంధం బంధరాహిత్యానికి ఎలా దారి తీస్తుంది? అని అన్వేషించడం ప్రారంభిస్తారు. ఆ అన్వేషణ సాగుతున్న కొద్దీ పరమాత్ముడి కన్న పరమాప్తుడు తమకు మరొక్కడు లేడని గుర్తించి, తమకోరికలు, అవసరాలు అన్ని అతడికే నివేదిస్తూ, అర్థార్థులవుతారు. క్రమంగా అంతులేని సంతృప్తిని అనుభవిస్తూ " కోరికలు లేని స్థితి" నే కోరికగా చేసుకొని, జ్ఞానులై నాలుగు విధాలు అని కాక, ఒకే భక్తునిలోని నాలుగు దశలు ఇవీ అని అనిపిస్తుంది. అయితే ఈ నాలుగు దశలకూ చెందిన వేర్వేరు భక్తులు సమాజంలో మనకు ఒకే సారి కన్పిస్తూ ఉండటం వల్ల భక్తులు నాలుగు విధాలు అని అనిపిస్తూ ఉంటుంది. ఇదీ అమ్మ ఇచ్చిన వెలుగు. ఈ వెలుగులో మెలగుతున్న భక్తులు మాన్యసోదరులు శ్రీ టి.టి. అప్పారావుగారు.

అమ్మను ఆరాధిస్తున్న అశేష సంతతిలో ఎవరి కారణాలు వారికి ఉండవచ్చు. ఎవరి పద్ధతులు వారివి, ఎవరి అభిరుచులు వారివి కావచ్చు. ఎవరి అనుభవాలు వారివి, ఎవరి అభిప్రాయాలు వారికి కావచ్చు. ప్రారంభదశలో ఎలా

ఉన్నా కాలం గడుస్తున్న కొద్దీ 'అమ్మ'కు చేరువ అవుతున్న కొద్దీ క్రమంగా అంచెలవారీగా జ్ఞాననేత్రం విప్పారుతుంది. అన్వేషణ ఫలిస్తుంది. అనుభూతి లభిస్తుంది.

ఆ అనుభూతి అక్షరమై వెలువడితే, ఒక్కరి అనుభూతి ఎందరికో వెలుగు బాట అవుతుంది. భక్తుల మధురానుభూతులే భగవంతుడి దివ్యలీలలు అని 'భాగవతం' వివరించింది.

శ్రీ అప్పారావు అన్నయ్య అమ్మను ఆశ్రయించి, భౌతిక రూపాన్ని కాక, అమ్మ తత్త్వాన్ని ఎలా అన్వేషించారో, అమృతత్వాన్ని ఎలా అందుకున్నారో వివరించే దివ్య గ్రంథం ఇది.

అమ్మ సేవలో భక్తి మార్గంలో యోగసాధనలో తత్త్వచింతనలో, ఆత్మాన్వేషణలో వివిధ దశల్లో అమ్మ నుండి తాను ఏమి అందుకున్నారో, ఆ మధుర ఫలాల రుచి ఏమిటో, ఎంతటిదో శ్రీ అప్పారావు అన్నయ్య అక్షరాలా ఆవిష్కరించారు ఈ గ్రంథంలో.

ఆ ఆవిష్కరణ కూడా నిర్మాణంగా, నిరహంకారంగా సాగింది. 'అమ్మ'కు సమర్పణమై సమర్చనమైంది. తాను చేస్తున్నాను అని కాక, తన ద్వారా జరుగుతోంది అని అన్నయ్య పొందిన గుర్తింపు ఈ గ్రంథంలో అంతర్లీనంగా దర్శనమిస్తుంది. అది ఆయన పొందిన మేలుకొలుపు. ఆ మాధుర్యాన్ని చవి చూడండి, ఆ దివ్యానందాన్ని మీరు సొంతం చేసుకోండి అని ఈ గ్రంథం మనకు ఇస్తున్న పిలుపు.

అక్షర స్వరూపిణి అయిన అమ్మను ఆరాధించి, అక్షర పరబ్రహ్మయోగాన్ని పొందిన శ్రీ అప్పారావు అన్నయ్య మాన్యులే కాదు, ధన్యులు కూడా.

అన్నయ్యకు ఆత్మీయతా పూర్వక అభినందనలు అన్నయ్యను 'అమృతం' ప్రసాదించి, ఆ అమృతాన్ని అందరికీ పంచడానికి తగిన ప్రేరణ యిచ్చిన 'అమ్మ'కు సాష్టాంగ ప్రణామాలు.

గంటి వెంకట్రావు, వైజాగ్

రిటైర్డ్ సూపరింటెండెంట్, ది.17-1-2007.

కస్టమ్స్ & సెంట్రల్ ఎక్సైజ్.

అప్పారావన్నయ్య అమ్మ బిడ్డలలో ఒక విశిష్టమైన వ్యక్తి. మేమిద్దరము అమ్మ దగ్గర చాలా సార్లు కలుసుకుంటూ ఉండేవారము. కలసినప్పుడల్లా తనకు అమ్మ ఇచ్చిన అనుభవాలను హృదయానికి హత్తుకునేటట్లు చిత్రీకరించేవారు. ఆయన చెబుతూ ఉంటే ఆదృశ్యం కళ్ళకు కట్టినట్లు, అప్పుడే జరుగుతున్నట్లుగా ఉంటుంది. ఆయన ఎప్పుడు చెప్పినా అమ్మ ప్రజన్స్‌ఫీల్ అవుతూ ఉండేవాడిని. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగి అమ్మ సాన్నిధ్యంలో ఉన్నట్లుగా అనుభూతి కలిగేది. ఆయన విశదీకరణశక్తి అనుపమానము. ఆయన జ్ఞాపకశక్తి అసాధారణము. ఆయనతో సంభాషణ ఒక స్పిరిచువల్ ఎక్స్‌పీరియన్స్.

అమ్మ భౌతిక శరీరము వదిలిన తర్వాత మా కలయిక బాగా తగ్గింది. 11-1-2006 శ్రీ శివానందమూర్తిగారి ఆశ్రమానికి అన్నయ్య వచ్చినపుడు మళ్ళీ మేమిద్దరమూ కలుసుకున్నాము. ఆసందర్భంలో అప్పారావన్నయ్య మా ఇంటికి వచ్చి, నాతో అమ్మ అనుభవాలను గురించి రెండు మూడు గంటలు ముచ్చటించారు.

తరువాతనేను నాగపూర్ మారెండవ అమ్మాయిగారింటికి వెళ్ళాను. నాకు అక్కడ అకస్మాత్తుగా వారి అనుభూతులూ, చెప్పే విధానమూ గుర్తు వచ్చింది. ఇటువంటి అపురూపమైన అనుభూతులు అందరికీ తెలియాలనే ఆకాంక్ష ప్రబలమయింది. అన్నయ్యకు ఫోన్ చేసి ఈ విషయం చెప్పాలని మనస్సు ఆరాటపడింది. వెంటనే ఏలూరు ఫోన్ చేశాను. అది 27-2-2006. ఈ రోజు ఉదయమే శ్రీరామబ్రహ్మంగారి తో కలసి హైదరాబాద్ వెళ్లారనీ, అక్కడ నుండి షిరిడీ వెళతారనీ చెప్పారు. అమ్మ ఇచ్ఛ ఏమో తెలియదుగానీ విజయవాడ ఫోన్ చేసి రామబ్రహ్మంగారి సెల్ నంబరు తీసుకునేదాకా మనసు ఆగలేదు.

రామబ్రహ్మంగారి సెల్‌కు ఫోన్ చేశాను. అప్పుడు వారు హైదరాబాద్‌లో ఉన్నారు. అప్పారావన్నయ్య కూడా ప్రక్కనే ఉన్నారు. నేను అప్పారావన్నయ్యతో ఫోన్‌లో ఇలా అన్నాను. అమ్మతో మీ అనుభవాలు చాలా అపురూపమనీ ఈ అనుభవాలు భావితరాలకి తెలియచేయవలసిన భాధ్యత మీకు ఎంతో ఉందని అది మీ బాధ్యత అని ఒక పుస్తకరూపంలో మీ అనుభవాలను అందిస్తే బాగుంటుందని సూచన చేశాను. అన్నయ్య అందుకు సమాధానంగా నేను అమ్మ అనుభవాల్ని చెప్పగలనే గానీ వ్రాయలేను నాకు భాషా పాండిత్యము లేదు అనగా ముందు మీ అనుభవాల్ని కాగితం మీద పెట్టండి తతిమా కార్యక్రమము అంతా అమ్మే చూచుకుంటుంది అని ఉత్సాహపరిచాను.

విశేషమేమిటంటే 28-2-2006 ప్రభాత సమయంలో షిరిడీ సాయి సన్నిధిలో రామబ్రహ్మం అన్నయ్య ఈ గ్రంథానికి శ్రీకారం చుట్టారు. ఇది అంతా అమ్మలీల. ఎప్పుడు ఎవరిచేత ఏ పని చేయించాలో అమ్మచేయిస్తుంది. మనమంతా గడ్డిపోచలం. అమ్మ తన యొక్క ఈ పనికి నన్ను ఉపకరణంగా వాడుకోవడం నాకు అమ్మ ఇచ్చిన ఆశీస్సులు.

ఇట్లు

గంటి వెంకట్రావు.

# సాధ్యసాధన

ఎ. కుసుమాచక్రవర్తి
విశాఖపట్నం

శ్రీ సద్గురు శివానందమూర్తిగారు నుడివినట్లుగా అమ్మ కాలస్వరూపిణి, లయకారిణి. అమ్మ దరిచేరినవారినందరినీ లాలించి, బుజ్జగించి, అన్నం ముద్దలతో జ్ఞానాన్ని కూడా ప్రసాదించే అన్నపూర్ణేశ్వరి అమ్మ. అంతే కాదు జ్ఞానంతోపాటు తనలో లయం చేసుకొని ముక్తిని కూడా ప్రసాదిస్తుంది.

అనేక సాధక బాధకాలకు లోనై, అమ్మ తప్ప వేరే దిక్కులేదని అమ్మదరి చేరిన వారికి కష్టనష్టాలను తట్టుకునే శక్తినిచ్చి వాటి నుండి విముక్తిని కలుగజేసి, జీవిత చరమాంకంలో హాయిగా, తృప్తిగా జీవనం గడిపేలా చేస్తుందనడానికి అప్పారావన్నయ్య జీవితం నిదర్శనం.

అమ్మ దేనికైనా తరుణం రావాలంటుంది కదా! ఇప్పుడు ఆ తరుణ మాసన్నమయింది. అప్పారావన్నయ్యను జాగృతం చేసి యోగ్యతను ప్రసాదించి గ్రంథరచనకు పురికొల్పింది.

ముముక్షుత్వం అన్న శీర్షికలో అన్నయ్యకు చిన్న వయస్సులోనే వైరాగ్యం కలగటం, దిగివచ్చిన దైవంలో వారి ఇలవేల్పు శ్రీ వరాహలక్ష్మి నరసింహస్వామి వారే మానవరూపాన్ని ధరించి స్వయంగా అన్నయ్యకు ఆచార్యులుగా మార్గ నిర్దేశం చేయటం అనూహ్యం.

నేనుండగా భయమెందుకు ? పిలిస్తే పలుకుతా అని అమ్మ అభయమిచ్చిన తీరు అమ్మ ప్రేమానురాగాలకు వాత్సల్యాలకే ప్రతీక. శిక్షకాదు. శిక్షణలో లారీ సరుకుపోయి అప్పారావన్నయ్య అమ్మకు ఫోన్ చేస్తే వాడెన్ని బాధలలో ఉండి ఈ పని చేశాడో అనటంలో తల్లికి బిడ్డమీద ఉండే ప్రేమ అర్థమవుతుంది. మరి నన్నేం చేయమంటావమ్మా అని అన్నయ్య అడిగినపుడు ! నీవు చేసేదేముంది " జరిగేది జరుగుతుంది చూస్తూ ఉండమంది". ఇది అమ్మ ఇచ్చిన మహోపదేశం. అంతేకాదు అది సాక్షిత్వానికి దారి తీస్తుందని అన్నయ్య వ్రాసిన స్వీయ అనుభవాలు సాధకులకు కరదీపిక.

"శ్వాసమీద నిఘా ఉంచు" అని అమ్మ చెప్పినదానిమీద అన్నయ్య చేసిన సాధన చదివిన పుస్తకాలు, కలిసిన మహానుభావులు వారితో చర్చలు అన్నీ కలిపి అన్నయ్యను " యోగపరాకాష్టకు" చేర్చాయి. అప్పారావన్నయ్య అనుష్ఠానం తీరు ప్రశంశనీయం. జ్ఞానులు మనస్సును గమనించడం ద్వారా శ్వాసను నిరోధిస్తారని యోగులు శ్వాసను గమనించడం ద్వారా మనస్సును నిరోధిస్తారని జ్ఞానుల గురించి యోగుల గురించి చక్కటి వివరణ అందిచారు.

సామాన్యుడు కూడా శ్వాసమీద నిఘా అనే సాధన ద్వారా మనస్సును నిరోధించ వచ్చునని స్వీయ అనుభవాలను అందించి సాధకులకు మార్గదర్శకులయ్యారు.

మనస్సు ఎప్పుడూ భూతభవిష్యత్ వర్తమానాలను గురించి ఆలోచిస్తుందని, శ్వాసయెప్పుడూ వర్తమానంలోనే ఉంటుంది గనుక మనస్సును శ్వాసమీద ఉంచితే మనస్సుకూడా వర్తమానానికి వచ్చి నిశ్చలస్థితి కలిగి హృదయమందు నిలకడ చెందుతుందని. చెబుతూ సాధకులకు మార్గం ఎంతో సుగమం చేశాడు అప్పారావన్నయ్య.

విశ్వప్రాణశక్తిని మనం ఎలా తీసుకోవాలో తన స్వీయ అనుభవాలను తెలిపారు. అలాప్రాణశక్తి మనలోకి ఎందుకు ప్రసరించడం లేదో చక్కటి వివరణ కూడా అందించారు. ప్రతి వారు మానసిక ఒత్తిడికి లోనవుతున్న ఈ రోజులలో ఈ సాధన ఎంతైనా అవసరమేకదా !

జ్యోతి దర్శనమైనప్పటి అనుభవం చదువుతుంటే ! అన్నయ్య సాధనలో ఎంత ఎత్తుకు ఎదిగాడో తలచుకుంటే అమ్మ తన బిడ్డలను ఎలా అనుగ్రహిస్తుందో అర్థం అవుతుంది.

అన్నయ్య జీవితంలో అనేక ఎత్తు పల్లాలూ కష్టనష్టాలు అనుభవించిన వాడే. వాటన్నింటినీ తట్టుకునే స్థితినిచ్చి సాధకునిగా స్థితప్రజ్ఞునిగా అమ్మ అన్నయ్య ను మలచిన తీరు మరచిపోలేనిదీ మరపురానిది.

శ్రీ అవధూతేంద్ర సరస్వతి స్వామీజీ శిష్యులైన రామదాసు స్వామీజీతో మొదలైన ఆధ్యాత్మిక ప్రయాణం ఒక్కొక్క మహనీయునిద్వారా ఒక్కొక్క మెట్టు ఎక్కినది. అన్నయ్య ధన్య జీవి.

అన్నయ్యే కాక వారి కుటుంబ సభ్యులు, అన్నయ్య సతీమణి కుసుమాంబ, అందరూ అమ్మను సర్వాంతర్యామిగా నమ్మిన వారే. ఆయన అల్లుడు చక్కా శ్రీమన్నారాయణ గురించి తెలియని వారు లేరంటే అతిశయోక్తి లేదు. అన్నయ్య కుమారుడు కృష్ణబాబు ఒక రోజు జిల్లెళ్ళమూడిలో ఆలయంలో ప్రశాంతంగా ధ్యానం చేసుకుంటుండగా చూచాను. వారి కుటుంబానికి అమ్మ అందించిన ఆధ్యాత్మిక సంపదకు ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి. అన్నయ్య యోగ మార్గంలో తాను పయనిస్తూ తాను నేర్చుకున్నది నలుగురికీ నేర్పుతూ వారందరినీ తీర్చిదిద్దుతున్నాడు. అన్నయ్య లేఖిని నుండి ఇంకా గ్రంథాలు వెలువరించే శక్తి ఇమ్మని అమ్మను కోరుతున్నాను.

అమ్మ చరణసేవలో . . .

**కుసుమా చక్రవర్తి**

## "అప్పారావుగారూ - ఆత్మీయత"

అనగాని సౌభాగ్యరావు బి.ఎ. బి.ఇడి.,

గ్రేడ్-1 తెలుగు పండిట్ (రి)

రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి గ్రహీత.

తాను నమ్మిన దానిని నిర్మొహమాటంగా నిష్కర్షగా చెప్పే సుస్వభావము, తానాచరించుచు పొందే ఆనందాన్ని పదుగురకుపంచాలనే సమున్నత భావం, ప్రారంభించిన కార్యము పట్ల పూర్తి అవగాహన కలిగేవఱకు వెంటాడి తెలిసికోవాలనే జిజ్ఞాస జీవితలక్ష్యమైన బంధవిముక్తిని సాధించాలనే దృఢ సంకల్పం పోతబోసిన మూర్తిమత్వము అప్పారావుగారు. త్యాగము భక్తి యోగము జ్ఞానముల మేలు కలయిక అప్పారావుగారు.

ధర్మము అని తానునమ్మిన దానిని కడదాక సాధించాలనే పట్టుదల గల కార్యదీక్షాపరతంత్రుడు. ఇతరుల కష్టాలు చూచి కరిగిపోయే కరుణాస్వభావుడు. దీనుల యందు క్రియారూపమైన దయార్ద్రహృదయుడు. సహకారగుణంతో శోభించే మంచి మనిషి. స్నేహానికి ఎనలేని విలువనిచ్చే మనిషి.

ఇంతకు ఈ పుస్తకంలోని ప్రతి సంఘటన వాస్తవమే. మా మైత్రీబంధంలో ఎప్పటికప్పుడు నాకు తెలియజేయబడినవే. ఇపుడు పుస్తకరూపందాల్చినవి.

అమ్మ పంచిన అనురాగం అందించిన ఆధ్యాత్మిక అంశాలు, అనుగ్రహించిన అనుభవాలు, తెలియజేసిన యోగరహస్యాలు, ప్రసాదించిన జ్ఞానం కాపాడిన తీరు పరిశీలిస్తే, 'భక్తి-కర్మ-యోగ-జ్ఞాన' మార్గాలలో పయనించే ముముక్షువులైన సాధకులకు ఈ పుస్తకం మార్గనిర్దేశంచేయడమేగాదు గమ్యాన్ని చేర్చుదానికి సహకరించుతుండనడంలో సందేహములేదు.

అమ్మే రాముడుగా రాముడే అమ్మగా తన అనుభవాలు, అమ్మ పట్ల తాను పూర్తి శరణాగతిపొందిన విధానము, బెహరా ఘట్టంలో అపకారికి ఉపకారం అన్న విషయం, దేవుడే దిగి వచ్చి చేయూతనిస్తాడనడానికి సింహాచల అనుభవం. " అంతా అదే" నని తెలియడానికి సాధనలో అధిరోహింపజేసిన సోపానాలు

"శ్వాసపైనిఘా"లో యోగపరాకాష్టలోని రహస్యాలు "నీవంటూ ఉంటేగా" అన్న దానిలోని తత్త్వాంశము "సోహం" చేసికోవచ్చునన్న దానిలో సాధనలోని వైశిష్ట్యం వివరించి బోధించే గ్రంథం. రాశికంటే వాసి గల పుస్తకం.

తన అనుభవములను పెద్దల వాక్యాలతో శాస్త్రముతో సరిచూచుకొన్న తరువాతనే ప్రకటించడమైనది.

ఈ రచనలో నాకూ ఎంతో కొంత పాత్రయున్నది. ప్రతి అంశము ఇరువురము ఆచితూచి ఆలోచించి యధా శక్తిగా వివరించడం జరిగినది. ఇందుకు నేనెంతో ఆనందిస్తున్నాను.

హితుడుగా సన్నిహితుడుగా మీదు మిక్కిలి అగ్రజుడుగా ఈ మహితాత్ముడు లభించడం దైవానుగ్రహము నా పూర్వపుణ్యవిశేషం. 35 సంవత్సరములుగా పొరపొచ్చములు లేని మా మైత్రీ బంధం స్వామికృప.

వాసుదేవ

సెలవు.

మిత్రుడు బుధజన విధేయుడు

అనగాని సౌభాగ్యరావు,

23-1-07

# అంతరంగం

బాల్యంలోనే పితృవియోగంతో కష్టాలు, వ్యాపారంలో నష్టాలుకలిగి ప్రపంచం పట్ల విరక్తుడనై ఇల్లు విడచిన నన్ను మా ఇలవేల్పు సింహాచల నరసింహస్వామి తిరిగి ఇల్లు చేర్చి నన్ను కష్టాలనుండి ఒడ్డెంకించిన తీరు తలచుకుంటే ఈ నాటికీ నేత్రాలు అశ్రుపూరితాలవుతాయి.

అమ్మ పరోక్షంగాను, ప్రత్యక్షంగాను నన్ను చేయిపట్టికొని ముందుకునడిపించినది. ఇది నా పూర్వజన్మ పుణ్యఫలంగా భావిస్తున్నాను. అమ్మ సగుణోపాసన నుండి నన్ను నిర్గుణోపాసనకు చేర్చి సగుణ నిర్గుణములు రెండూ ఒకే దానివే అంటూ చివరకు అంతా అదేనని ప్రబోధించి అది అనుభవమునకు ఎలా తెచ్చుకోవాలో తెలియజెప్పి యోగాభ్యాసం ద్వారా స్వాత్మస్వరూపాన్ని (ఆత్మజ్యోతిని) దర్శింపజేసి జీవన్ముక్తి అంటే ఎట్టిదో కించిదనుభవాన్ని అందించి అనుగ్రహించిన అమ్మను గురించి ఏమిచెప్పగలను ! ఏమి వ్రాయగలను !

ఈ పుస్తకం కేవలం అమ్మ అందించిన అనుభూతి అనుభవము. ''గురువాక్యము-శాస్త్రము-అనుభవము'' సరిచూచుకొన్నాకనే ధైర్యంగా ప్రకటించగలుగుచున్నాను.

నాయీ సాధనలో నాకు కలిగిన సందేహములను నివృత్తి జేసి ముందుకు నడిపిన "వేల్పూరు బాలరమణ స్వామి వారికి పాదాభివందనములు.

ఈ గ్రంథంలోని విషయాలు " కర్మ-భక్తి-యోగ-జ్ఞాన" సాధనలలోని ముముక్షువులకు ఏభూమికలో నున్న వారికైనా ప్రయోజనం కలిగించగలిగితే నా ఈ ప్రయత్నం సఫలీకృతం అయినట్లే.

ఈ రచనా వ్యాసంగంలో కలిగిన సందేహాలను నివృత్తి చేసి వివరాలందించి అభిప్రాయలందచేసిన శ్రీ వై. హెచ్.రామకృష్ణ గారికి శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణగారికి సహకరించిన డాక్టరు సుగుణ,ఝాన్సీ అక్కయ్యలకు కృతజ్ఞుడను. కొండముది శ్రీరామచంద్రమూర్తి అన్నయ్యకు కృతజ్ఞుడను.

మంగళాశాసనములందించిన విశ్వబంధు తపోవనం(పెదపులిపాక) పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవనందగిరి స్వాములవారికి ముముక్షజన

మహాపీఠాధిపతులు (పెదముత్తీవి) సీతారాం గారికి హృదయ పూర్వక నమస్కారములు.

బ్రహ్మాండం రవీంద్రరావు అన్నయ్యకు, వసుంధరక్కయ్యకు, శ్రీయుతులు పొత్తూరి వెంకటేశ్వరావు, బొప్పూడి రామబ్రహ్మం. పి.ఎస్.ఆర్. ఆంజనేయ ప్రసాద్, గంటి వెంకటరావు అన్నయ్య గార్లకు శ్రీమతి కుసుమాచక్రవర్తి అక్కయ్యకు కృతజ్ఞతలు.

అమిత శ్రమకోర్చి నేను ప్రకటించిన విషయాలను వ్రాసిన ఉమామహేశ్వరరావు గారికి కృతజ్ఞుడను.

అనేక వ్రాత ప్రతులలోని విషయాలు నాభావాలకు ఆనుకూల్యత సిద్ధిం చేవరకు తన పనులను మానుకొని విసుగులేకుండా దీనిని ఒక యజ్ఞంగా భావించి శిష్టవ్యావహారిక భాషలో భారం తనపై వేసుకొని రూపకల్పన చేసిన మిత్రుడు అనగాని సౌభాగ్యరావు అన్నయ్యకు ఎంతైనా కృతజ్ఞుడను.

ఈ రచనకు ప్రోత్సహించిన మా అల్లుడు గారు చక్కా శ్రీమన్నారాయణ గారికి నా భార్య కుసుమాంబకు, కుమారుడు కృష్ణబాబును, మాకుటుంబసభ్యులను అభినందిస్తున్నాను.

సకాలంలో డి.టి.పి. చేసి ఇచ్చిన క్షీరసాగర ప్రింటింగ్ ప్రెస్ వారికి మనోజ్ఞంగా ముఖ చిత్రరూపకల్పన చేసి ప్రింటింగ్ భాధ్యతనంతటిని స్వీయ కార్యంగా భావించి గ్రంథాన్ని సకాలంలో అందంగా తీర్చిదిద్ది అందించిన “ శివ” అన్నయ్యకు కృతజ్ఞుడను.

ఈ గ్రంథానికి ప్రేరణ షిరిడి సాయి
వ్రాత ప్రతి నివేదన బాబా సన్నిధిలో రామబ్రహ్మఅన్నయ్య,
ఆవిష్కరణ అమ్మ సన్నిధిలో “ రవి ” అన్నయ్య
ఇది నా అదృష్టం.

ఇట్లు
అమ్మసేవలో . . .
టి.త్రిలోక అప్పారావు,
25-1-07. ఏలూరు



అమ్మ ఏలూరు పర్యటన సందర్భంగా నాన్నగారితో అధ్యయన పరిషత్ ఏలూరు శాఖ

# ముముక్షత్వం

నాకు 11 సంవత్సరముల వయస్సులో పితృవియోగం జరిగింది. 13వ సం॥రములో 8వ తరగతి పూర్తి చేశాను. అంతటితో చదువు ఆగిపోయింది. కుటుంబ భారం ఇంటికి పెద్ద వాడనైన నాపై పడింది. వ్యాపారంలో దెబ్బ తిని అప్పులు పాలయ్యాను. ప్రపంచం యెడల విరాగం కలిగింది. భూతదయ భగవద్భక్తి ఉండేది. ఆస్తిక కుటుంబం అయిన కారణంగా నిత్యానుష్ఠానం ఉండేది సంధ్యా వందనం మొ॥ భగవత్‌గీత చదివేవాణ్ణి. ఈ కష్టములో నుండి ఒడ్డెక్కించమని నిత్యం భగవత్ప్రార్ధన చేసేవాణ్ణి. రామకోటి వ్రాసేవాడిని. భక్తుల కథలు చదివేవాణ్ణి. ఆర్తితో కీర్తించేవాణ్ణి. నిరంతరం ధర్మచింతనతో నియమబద్ధమైన జీవితం గడిపే నాకు జీవితంలో కష్టాలు తట్టుకోలేక ఏమిటీజీవితం అనిపించి తీవ్రమైన మోక్షాపేక్ష ఏర్పడింది.

అవధూతేంద్ర సరస్వతీ స్వామీజీ శిష్యులు బృందావన నివాసి పరమభక్తులు అయిన రామదాస స్వామీజీ వారు మా ఇంటికి తరచూ వస్తూండేవారు. బృందావనాన్ని గురించీ అక్కడ ఉండే సాధుసంతుల గురించీ, ఆశ్రమాలగురించీ చెబుతూ ఉండేవారు. ఆశ్రమాలలో ప్రతిరోజూ సత్సంగములు జరుగుతాయనీ ఇప్పటికీ అక్కడ రాసలీల జరుగుతుందనీ సాధకులకు కావలసిన సదుపాయాలన్నీ ఉచితంగా ఏర్పాటు చేస్తారనీ కూడా చెప్పారు. ఈ విషయాలన్నీ మనస్సులో బాగా ముద్రపడ్డాయి.

మరొక రోజు శాంతి ఆశ్రమం పీఠాధిపతి ఓంకారస్వామి- వారి ఉపన్యాసం విన్నాను. వారికి తోటపల్లి కొండలలోనూ విశాఖపట్నంలోనూ ఆశ్రమాలు ఉన్నాయి.

వారు కూడా మోక్షాపేక్షకలిగినవారికి ఆశ్రమంలో ఉచితంగా అన్ని సదుపాయాల కలగజేసి తగిన శిక్షణ ఇస్తామని చెప్పారు.

ఒక రోజు పూజ పూర్తి చేసుకొని ధ్రువచరిత్ర చదివాను. అయిదు సం॥ల బాలుడు పట్టుదలగా తపస్సు పూర్తి చేసుకొని భగవత్సాక్షాత్కారాన్ని పొందాడుగదా నేనెందుకు పొందగూడదు అనుకుంటూ ఇంట్లో చెప్పకుండా భగవద్గీత-భక్తుల చరిత్ర- జపమాల తీసుకొని ఒక లుంగీ రెండు తుండు గుడ్డలతో బృందావనం వెళ్ళడానికి విజయవాడ చేరాను.

విజయవాడ స్టేషనులో ఒక ఆలోచన వచ్చింది. అక్కడవారుజరిపే సత్సంగాలు శిక్షణ అంతా హిందీలో ఉంటుంది నాకు హిందీ రాదు కదా! ఓంకార స్వామీజీ వారి ఆశ్రమానికి వెళదామని నిర్ణయించుకొని మార్గమధ్యంలో ఉన్న అన్నవరం చేరి వ్రతం చేసుకొని నాకు జన్మ రాహిత్యాన్ని కలుగజేయమని స్వామివారికి నమస్కరించుకున్నాను.

తోటపల్లి శాంతి ఆశ్రమానికి ప్రయాణమయ్యాను. ఇంతలో ఓంకారస్వామి తోటపల్లి ఆశ్రమంలో లేరని విశాఖపట్నంలో ఉన్న శాంతి ఆశ్రమం శాఖలో ఉన్నారనీ తెలిసి విశాఖపట్నం బయలుదేరాను. మార్గమధ్యంలో నా భార్య గుర్తుకువచ్చి కళ్ళనీళ్ళు బొటబొటా కారినాయి. దుఃఖం ఆపుకోలేక పోయాను. అప్పటికి నాకు 24 సం॥రాలు. నా భార్యకు 19 సం॥రాలు. అప్పుడే తప్పటడుగులు వేస్తున్న మా అబ్బాయి కృష్ణబాబు గుర్తుకువచ్చాడు. ఇంటికి వెళితే అప్పులవాళ్ళు బ్రతకనివ్వరని. ఆర్తితో భగవంతుణ్ణి ప్రార్థన చేశాను. తెల్లవారేసరికి విశాఖపట్నం చేరాను. మా ఇలవేల్పు వరాహలక్ష్మీ నరసింహస్వామి. సింహాచలం వెళ్ళి స్వామి దర్శనం చేసుకొని శాంతి ఆశ్రమానికి వెళదామనుకున్నాను.



# దిగివచ్చిన దైవం

మా ఇలవేల్పు సింహాచల వరాహలక్ష్మీనరసింహస్వామి. మా తల్లిదండ్రులు సంతానం కొరకు సింహాచలస్వామిని ఆశ్రయించిన తరువాత కలిగిన సంతానం నేనట. నాకు అక్షరాభ్యాసం,అన్నప్రాశన, చెవులు కుట్టించడం కూడా అక్కడేనట.

సింహాచలం చేరి పుట్టుధారవద్ద స్నానం చేసి ఆలయప్రాంగణంలో ఉదయానుష్ఠానాలు పూర్తి చేసుకున్నాను. ఇంతలో ఒక ఆచార్యస్వామి నా వద్దకు వచ్చి కూర్చున్నారు. ఆయన ఆజానుబాహుడు. ముఖంలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతోంది. తీర్చిదిద్దిన ఊర్ధ్వపుండ్రాలు నిడుపాటికేశములు శరీరం కాంతి వంతంగా ఉంది. మధ్య వయస్కుడనిపించింది. ఆయన కరుణతో కూడిన చూపులతో జాలిగా ఆప్యాయతగా పలకరించారు. అప్పుడు నేను దిన చర్య రాస్తున్నాను.

స్వామి : ఏమిటీ రాస్తున్నావు ?
నేను : దినచర్య.
స్వామి : ఇంటివద్ద చెప్పివచ్చావా నాయినా ?
నేను : (అబద్ధం చెప్పడం ఇష్టంలేక) మీకనవసరం.
స్వామి : ఏమైనా తిన్నావా ?
నేను : లేదు.
స్వామి : నేనీ దేవాలయానికి అధికారిని. నన్ను "నరసింహాచార్యులు" అంటారు. స్వామి ప్రసాదం పెట్టిస్తాను తింటావా ?
నేను : ఆ ... తింటాను.

స్వామి అక్కడకు దగ్గరగా 100 గజాల దూరంలో ఉన్న ప్రసాదాల విక్రయశాలలో కట్టెపొంగలి పులిహోర పొట్లాలు ఇప్పించి దగ్గరుండి ఆప్రసాదం తినిపించారు.

స్వామి : ఇక్కడ నుండి ఎక్కడకు వెళుతున్నావు ?
నేను : శాంతి ఆశ్రమానికి.
స్వామి : ఎందుకు ?
నేను : మోక్షాపేక్షతో వెళుతున్నాను.
స్వామి : నీవేదో కష్టాలలో ఉన్నట్టున్నావు. మా స్వామికి పానకం అంటే చాలా ఇష్టం. నీ కష్టాలు తీరితే మా స్వామికి పానకం చేయిస్తావా ? ఇదేమిటీ ఇట్లా అంటారు కష్టాలు తీరితే అంటారేమిటి ? (కష్టాలు తప్పకుండా తీరతాయి అనుకుని) పానకం చేయించే వెళతానన్నాను. వెంటనే కార్యాలయం దగ్గరకు వెళ్ళాము. రూ. 10-25 పై. అవుతుందన్నారు. ఈ రోజు సమయం అయిపోయింది. ఈ వేళ

రసీదు రాయించుకోండి రేపు పానకం చేయిస్తామన్నారు. రశీదు రాయిస్తాను రసీదు రాయించి మీచేతి కిస్తాను మీరే పానకం చేయించండి అని చెప్పాను.
స్వామి : చేయించి వెళతానని మాట ఇచ్చావు ఉండి చేయించవలసిందే. ఇక్కడ ఉండడానికి ఏర్పాట్లు నేను చేస్తాను అంటూ ఆ మెట్ల ప్రక్కనే ఉన్న తీగల తిమ్మయ్య శ్రేష్ఠి గారి సత్రములోనికి తీసుకొని వెళ్ళారు. అక్కడ ఉండటానికి వసతి ఏర్పాట్లు చేశారు. ఆహారావసరాలు ఏమన్నా ఉంటే వాళ్ళను చూడమని చెప్పారు. వారు సరేనన్నారు. షుమారు ఉదయం 11 గంటలు అవుతుంది సంచి గదిలో పెట్టాను
స్వామి : భోంచేస్తావా ఎదురుగా హోటలున్నది.
నేను : చెయ్యను (హోటల్‌లో చెయ్యడం ఇష్టం లేక)
స్వామి : మధ్యాహ్నం 12 గంటలకు స్వామివారికి మహానివేదన అవుతుంది దానిని అర్చకస్వాములు వాటాల వారీ పంచుకుంటారు. వారికి అయిదణాలు (31 పైసలు) ఇస్తే అన్నం చారూ, పప్పు,కూరా ఇస్తారు. ఒకరు తినేదానికంటే ఎక్కువే ఉంటుంది ఏర్పాటు చేయించుతానన్నారు. క్రిందనే పెరుగమ్ముతారు. అణా ఇచ్చి పెరుగుకొనుక్కో నీకు సరిపోతుంది అనికూడా అన్నారు. రాత్రికి పాలివ్వమని సత్రం వారికి చెప్పారు.
నేను ఆరోజు మధ్యాహ్నం నుండి గదిలో కూర్చుని భక్త విజయం(గ్రంథం) చదువుకుంటున్నాను. సత్రంలో వాళ్ళుకూడా వచ్చి కూర్చున్నారు. ఆ రాత్రికి గ్లాసునిండా పాలిచ్చారు. మరుసటి ఉదయం తెల్లవారు ఝాము 3 గంటలకు లేచి పుట్టుధారవద్ద స్నానం చేసి తిరిగి గది వద్దకు వచ్చి నా అనుష్ఠానం పూర్తిచేసుకున్నాను. ఉదయం 8 గంటలకు స్వామి వారు వచ్చి ఇంటికి ఉత్తరం వ్రాయమని బలవంతం చేశారు. ఏ వేవో సంభాషణలు సాగినయ్ నాకు గుర్తులేదు. శాంతి ఆశ్రమానికి

వెళ్ళడానికి స్వామివారు అంగీకరించలేదు. ఆ రోజు గడిచింది. మరుసటిరోజు నుండి ఏ సమయంలోనైనా నేను దేవాలయంలోకి వెళ్ళుటకు అడ్డుపెట్టవద్దని దేవాలయసిబ్బందిని ఆజ్ఞాపించారు. నేను దేవాలయంలోనికి వెళ్ళి "ఓం నరసింహాయనమః" అనుకుంటూ నామం చేసుకుంటున్నాను. ఒక ఆచార్యస్వామి నా ప్రక్కన వచ్చికూర్చున్నారు. ఇలా కాదు నాయనా అంటూ లక్ష్మీనరసింహకరావలంబ స్తోత్రం చెయ్యమని చెప్పగా రాసుకున్నాను. ఆస్తోత్రం చేస్తూ 4,5 రోజులు గడచినాయి ఆ తర్వాత ఒక రోజున.

స్వామి వారు : "నీవు ఎక్కడికి వెళ్ళినా నీవు చేసుకున్నది నీతోనే వస్తుంది అనుభవించక తప్పదు" అని ఏవేవో చెప్పారు. గుర్తులేదు. తిరిగి

ఇంటికి వెళ్ళమనేవారు లేక ఉత్తరం అయినా వ్రాయమనేవారు. వారికీ నాకూ రోజూ ఇవే సంభాషణలు జరుగుతుండేవి.

ఇంటికి వెళ్ళాలనే కోరిక ఉండేది. కానీ చెప్పకుండా వచ్చినందువల్ల అభిమానం అడ్డువచ్చింది. ఆరోజున బలవంతంగా ఒక మిత్రుడికి లెటర్ వ్రాయించినారు. స్వామి వారు రెండు పూటలా వచ్చి యోగక్షేమాలు తెలుసుకుంటుండేవారు. నచ్చచెప్పి ఇంటికి బయలుదేరదీశారు. తిరుగు ప్రయాణంలో స్వామీ, నేనూ మెట్లు దిగుతున్నాము. ఈ లోపుగా నా ఉత్తరం గుంటూరు చేరి విషయం తెలుసుకుని నా తమ్ముడు పంపగా వచ్చిన మా బంధువూ, మిత్రుడు అయిన నోముల చినరామయ్యగారు మాకు ఎదురయ్యారు. అందరము కలసి క్రిందకు దిగాము.

క్రిందకు దిగగానే స్వామివారు మా ఇంటికి రండి కాస్త ఏమైనా ప్రసాదం తీసుకుని వెళుదురుగాని అని అంటూ వారి ఇంటికి ఆహ్వానించారు. అది ప్రస్తుతము కొండక్రింద ఉన్న మెట్లదారికి ఎదురుగా ఉన్న బిల్డింగుకు వెనుక భాగాన ఉంది. అది పెంకుటిల్లు మండువాలోగిలి. కొంత తడవైన తరువాత పట్టు చీరకట్టుకొని బిళ్ళగోచీ పెట్టుకొని ఒక పెద్దముత్తైదువు బియ్యపురవ్వతో తయారైన ఉప్మాలాంటిది పెట్టారు. స్వామి వారు నీ సమస్య నలభై రోజులలో పరిష్కారమౌతుంది వెళ్ళమని ఆశీర్వదించారు ఇంటికి చేరాను.

నేను ఇల్లు విడచివెళ్ళిన ఈ విషయాన్ని మా ఇంటిలో ఎవ్వరికీ తెలియనివ్వలేదు మా తమ్ముడు. వ్యాపారం పని మీద ఊరెళ్ళాడు అన్నయ్య అని మాత్రమే చెప్పాడు. నా భార్య, మా అమ్మ, ఆ దృష్టితోనే ఉన్నారు. ఇంటికి వెళ్ళిన 4,5 రోజులకు బాకీదార్ల వత్తిడి పెరిగింది. నా ఆస్తులూ అప్పులూ వాళ్ళకు ఇవ్వవలసినవీ, నాకు రావలసినవీ అన్నీ వివరించాను. వ్యవహార పరిష్కారం నిమిత్తం ముగ్గురు పెద్దమనుష్యులను ఎన్నుకుని ఆస్తులన్ని వారికి అప్పగించడం జరిగింది. ఈ విధంగా నా సమస్య పరిష్కారం అయింది.

ఒక నెలరోజులలో ఒక రైస్‌మిల్లులో ఉద్యోగం కూడా వచ్చింది. అలా నాకు భుక్తికి కూడా సమస్యలేకుండా మొత్తం 40 రోజులలో నా సమస్య పరిష్కారమయ్యింది.

కృతజ్ఞతా పూర్వకంగా నరసింహాచార్యులు గారింటికి వెళ్ళి నమస్కరించాలని నేనూ మా అమ్మా సింహాచలం చేరాము. మేము ప్రసాదము తీసుకున్న పెంకుటిల్లు అక్కడలేదు. ఖాళీస్థలం కనుపిస్తున్నది. చుట్టుప్రక్కల వారిని అడిగాము. ఇక్కడ ఇల్లు ఉండాలికదా అని. అసలు ఇక్కడ ఇల్లు ఎప్పుడూ లేదే అని సమాధానం చెప్పారు.

ఆశ్చర్యం వేసింది. ఏమిటీపరమాత్మలీల. అని ఆగలేకపోయాను. ఇంతకూ నాతో ఉన్నది ఎవరూ ? ఊహించుకున్నాను. దుఃఖం ఆగలేదు. వెంటనే కొండపైని సత్రానికి వెళ్ళాము. సత్రముకు చేరిన తర్వాత సత్రంలోని వారికి నాకు ఇలా సంభాషణ జరిగింది.

నేను : నేను గుర్తున్నానా ?

**సత్రము వారు** : అయ్యో మీరు గుర్తెందుకు లేరూ.

నేను : అప్పుడు నన్ను మీ కప్పగించిన వారు ఇప్పుడు ఎక్కడున్నారు?

సత్రము వారు : వారిప్పుడు ఇక్కడే ఉన్నారు. వారు దేవస్థానం అధికారి.

అందరం కలిసి వారి వద్దకు వెళ్ళాము. నేను అప్పుడు చూచిన ఆజానుబాహువైన ఆ స్వామికీ వీరికి ఏవిధమైన పోలికలూ లేవు.

నేను : అయ్యా మీరు నన్నెరుగుదురా ?

వారు లేదు అన్నారు. వీరి పేరు రంగాచారిగారు. నన్ను ఆదరించి ఇంటికి చేర్చిన వారిపేరు నరసింహాచార్యులు గారు. ఆయన 6 అడుగుల ఎత్తుతో పెద్ద గడ్డంతో ఊర్ధ్వపుండ్రాలతో బ్రహ్మతేజస్సుతో ఉన్నారు. కానీ ఇపుడు ఆలయంలో ఉన్నవారు మాత్రం ఎర్రగా 5 1/2 అడుగులు ఎత్తులో ఉన్నారు. సత్రం వారు మాత్రం మిమ్ములను మా కప్పగించింది వీరే అని అంటున్నారు. కానీ ఆలయాధికారి గారు మాత్రం నాకీ విషయమేం తెలియదని చెప్పారు.

ఇంతకూ నాతో వచ్చి నన్ను ఆదరించి రోజూ కొంత సమయం నాతో గడిపి నన్ను ఆశీర్వదించి ఇంటికి పంపిన వ్యక్తి ఎవరు? అప్పటికి నాకర్థమైంది "దైవమే దిగివచ్చాడని".

నా సింహాచల ప్రయాణానికి ముందు నాకు వచ్చిన వైరాగ్యం ఆవేశపూరితం అయినప్పటికీ ఆవేదనాపూర్వకమైన మోక్షేచ్ఛ ఉన్నది కదా. కరుణాసముద్రుడైన ఆ భగవంతుడే మానవరూపం ధరించి మార్గ నిర్దేశం చెయ్యడానికి నా ముందుకు దిగివచ్చాడు.

భగవంతుడు అపార కరుణాసముద్రుడు కదా !

ఈ సన్నివేశం నాకు భగవంతుని యందు విశ్వాసం కలగడానికి పునాది కాగా ఫలితంగా సీతారాముల మంత్రోపదేశం జరిగింది. దాని పూర్ణఫలమే అమ్మచరణకమల సన్నిధిలో నా జీవితం.

✿✿✿

# ఎవరీ అమ్మ

కందుకూరి శివానందమూర్తి గారి ప్రసంగం

12-6-2005న జిల్లెళ్లమూడిలో అమ్మ అనంతోత్సవాలలో శివశ్రీ కందుకూరి శివానందమూర్తి గారి ప్రసంగం వినే అదృష్టం కలిగింది.

వారు సృష్టిని గురించి మాట్లాడుతూ ఈశ్వరుడు తన ఆనందంకోసం సృష్టి చెయ్యలేదు. ఆయనే ఆనందస్వరూపుడు గనుక సృష్టివల్ల ఆయన పొందే ఆనందం ఏముంది ? ఆయితే ఎందుకుచేసినట్లు ? అని ఆయనే ప్రశ్నవేసి చాలాకాలం నుండి అంధకారంలో ఉండే జీవకోటి ప్రకృతిలో ప్రవేశించి జీవపరిణామదశలను దాటి తన వద్దకు రావటానికి ఒక మార్గం కోసం ఈ జగత్తును సృష్టించాడు.

అమ్మ ఎవరు ? ఎందుకు వచ్చింది ? అన్న విషయం ప్రసంగం చేస్తూ ఇలా వివరించారు. అమ్మ త్రిమూర్తులకు కూడా ముందున్న కాలస్వరూపమైన కాళీ రూపం. కాళీ స్వరూపం అంటే సర్వాన్ని తనలో చేర్చుకునేది.

పూర్వజన్మ ఉత్తర జన్మ అంటున్నారు. ఇవన్నీ లేవురా ! కోరుకో ! కోరుకుంటే వచ్చి ఒడిలో పడిపోతావు మళ్ళీ వెనక్కు వెళ్ళవు అంటూ అమ్మ చిన్న చిన్న మాటలతో పరమసత్యాలను ఉపనిషత్ వాక్యాలను చెప్పిందన్నారు.

అమ్మమాటలు మనకు అర్థమయినా కాకపోయినా బుద్ధిలో ప్రవేశించి జీవునికి అర్థమవుతాయి. అంతఃకరణఉన్నజీవునికి అన్వయించే వాక్యాలన్నీ వాడి దాకా చేరుతాయన్నారు.

అమ్మ చిన్నతనంలో జరిగిన ఒక సంఘటనను గుర్తుచేస్తూ ఒక ఎద్దును ముట్టుకొని దాని బాధను చూడలేక " ఇంకా ఉన్నావురా నీవు " అనగానే ఆ ఎద్దు దేహం చాలించింది. ఇతర తల్లులు ఎవరైనా కన్న తరువాత ఇక్కడ వదిలి వెళ్లవలసిందే! కాని ఈ తల్లి ఇక్కడ వదలివెళ్లిన వారిని తనలోనికి తీసుకోవడానికే వచ్చింది.

తపస్సుగాని యోగం గాని త్యాగం గాని ఎటువంటి సాధనా చెయ్యలేకపోయినా తీవ్రమైన మోక్షేచ్ఛగలిగి అమ్మా నేను అశక్తుడను, శరణాగతుడను

అంటే చాలు తన ఒడిలోకి తీసుకుంటుంది. అమ్మ ఒడిలో నిదురించే శిశువుగా మారిపోతాం. అమ్మకూ మనకూ దూరమే ఉండదు.

మాతృవాత్సల్యంతో అమ్మ పెట్టే అన్నపు ముద్దలు ఒక్కొక్క మెతుకు ఒక్కొక్క జన్మకు సరిపడే కర్మలను దగ్ధం చేస్తుంది. ఇక జన్మ పరంపర ఉండదు.

అర్హతలు యేమీలేకపోయినా సాధనలేకపోయినా మోక్షాన్ని ప్రసాదించే స్థానాలు మూడు ఉన్నాయి.

ఆ మూడింటిలో మొదటిది కాశీ . రెండవది ఉజ్జయిని. మూడవది జిల్లెళ్లమూడి క్షేత్రం అని అన్నారు.

ఇది శక్తి క్షేత్రం ముక్తి క్షేత్రం.

అమ్మ నామం చేయండి - అమ్మరూపాన్ని ధారణ చెయ్యండి.

వాత్సల్య స్వరూపిణి అయిన అమ్మచిరునవ్వుతో మిమ్ములను లయం చేసుకొంటుంది. అమ్మ ఎక్కడికి వెళ్లింది? ఎప్పుడు వస్తుంది అని కొందరు అడుగుతుంటారు. అమ్మ ఎక్కడికీ వెళ్లలేదు ఇక్కడే ఉంది. అసలు వెళితేగదా! రావటానికి అంటూ అందరికి అమ్మ అనుగ్రహం కలగాలని ఆశీర్వదించారు.

> దేవుడికి మనతో టచ్ ఉందిగాని
>
> మనకు దేవుడితో టచ్ లేదు
>
> "అమ్మ"

❀❀❀

# అమ్మయే రాముడు రాముడే అమ్మ

నాకు సరిగా జ్ఞాపకం లేదుకాని బహుశ 1957వ సంవత్సరం కావచ్చు. మొదటి సారిగా గుంటూరు నుండి పోలిశెట్టి కుమారస్వామి, తూములూరు వెంకటపిచ్చయ్య గార్లతో కలసి జిల్లెళ్ళమూడి వెళ్లాను.

"సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం
సేవనం మోక్షదాయకం" అనే మాటలు ఎక్కడో విన్నాను.

అందువల్ల అనేకమంది మహాత్ములను దర్శిస్తూ ఉండేవాడిని. ఆ దృష్టితోనే జిల్లెళ్ళమూడి వెళ్ళాను. ప్రత్యేక భావన ఏమీలేదు. అప్పుడు అమ్మ అలంకార హైమ పాకలో ఉన్నట్లు గుర్తు. అమ్మ దర్శనంతో ఒక ప్రత్యేకమైన మనశ్శాంతి ఏర్పడింది. అమ్మను మళ్లీ చూస్తే బాగుండును అనిపించింది. 1961 వరకు అప్పుడప్పుడు వెళ్ళి అమ్మ దర్శనం చేసుకుంటూ ఉండేవాణ్ణి.

శ్రీశ్రీశ్రీ మళయాళస్వామి వారి శిష్యులు, అగరం ఆశ్రమ అధిపతులు అయిన శ్రీ సేగు కృష్ణదాసుగారి వద్ద, " శ్రీరామ మంత్రోపదేశం " పొందాను.

కుటుంబపోషణభారంతో నిత్యంచేసుకొనే సంధ్యావందనం, గాయత్రీమంత్రజప అనుష్ఠానము గీతాపారాయణ మొదలైన ఆధ్యాత్మిక కార్యక్రమములు సాగడం కష్టమైంది. ప్రపంచం యెడల తీవ్రవైరాగ్యం కలిగింది. ఆశ్రమ జీవితం గడపాలనే అభిలాష పెరిగింది. కాని కుటుంబాన్ని వదలి ఆశ్రమ జీవితం గడపడానికి దైవం అనుమతించలేదు. జీవితగమ్యం చేరాలి అని తపించాను. ఫలితంగా శ్రీశ్రీశ్రీ అవధూతేంద్రసరస్వతి స్వామీజీతో పరిచయం ఏర్పడింది. అహర్నిశలూ మూల మంత్రాన్ని జపించమని స్వామి వారు ఒక మార్గాన్ని సూచించారు. వారి సూచన ప్రకారం అనుక్షణం మంత్రజపం చెయ్యటానికి ప్రయత్నించాను. కాని ఏదైనా కార్యక్రమములో నిమగ్నమైనపుడు నాకు జపం ఆగిపోయేది. కొంత సమయానికి మాత్రం ఆగిపోయినట్లుగా గుర్తించి తిరిగి ప్రారంభించేవాడిని. కొంత కాలానికి నా ప్రయత్నం లేకుండానే మంత్రం సాగుతుండటం గమనించాను. చివరికి స్వప్నావస్థలో కూడా మంత్రం జరుగుతుండేది. (స్వప్నావస్థలో కూడా జరుగుతుందని ఎలా చెప్పగలుగుతున్నానంటే) నిద్రలో నుండి లేచినపుడు నాప్రయత్నం లేకుండా మంత్రం జరగడం గమనించేవాడిని. నిత్యం సాధనకు సంబంధించిన దినచర్య పత్రమును పూర్తిచేసి స్వామివారికి నివేదించి

సాధనలో పురోగతిని ప్రసాదించమని ప్రార్థించేవాడిని. నియబద్ధమైన జీవితం గడుపుతూ సాధన తీవ్రం చేశాను.

నా భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలు నా ఉపాసనా దైవం రామచంద్ర ప్రభువు నుండి పొందగలననే విశ్వాసం బలంగా పెరిగింది. అందువలన నాకు కలిగిన యిబ్బందులను నిత్యము స్వామి వారి పూజామందిరమునందు కూర్చొని నివేదిస్తూ ఉండేవాడిని. వాటికి తగు తరుణోపాయం నా మనస్సుకు స్ఫురిస్తూ ఉండేది. ఇలా షుమారు 10 సం॥లు గడిచినయి. తల్లీ,తండ్రి, గురువు దైవం అంతా రాముడే.

కాలప్రవాహం దొర్లుతూ ఉండగా 1971 సంవత్సరం వచ్చింది. ఆరోజుల్లో అమ్మమహిమలు బహుళ ప్రచారంలో ఉన్నవి. అవి విన్నందువలన ఒకసారి మళ్ళీ అమ్మను దర్శనం చేసుకోవాలనే కోరికకలిగింది. జిల్లెళ్లమూడి చేరి అమ్మ దర్శనానికి వెళ్ళాను.

అది ఒక పెద్దహాలు, అమ్మ సింహాసనాసీన అయివున్నది. అనేకమంది భక్తులు అమ్మను పూజించుకుంటున్నారు. నేను ఒక మూల నిలబడి అమ్మను పరిశీలనగా వీక్షించసాగాను. క్షణాలలో అమ్మ కరుణారస తరంగాలు నాపై వర్షించాయి. ఈ కరుణారసతరంగాలలో నాలోని వ్యక్తిత్వం నశించి తనువు పునీతమైపోయింది. నన్ను నేను మరచిపోయాను. అప్రయత్నంగా అమ్మపాదాలను అశ్రుధారలతో అభిషేకం చేశాను. అమ్మ పాదములు రామపాదములుగా భాసించినవి. పూజకై తెచ్చుకున్న పూజా కుసుమములను అమ్మ పాదములపై వుంచుతూ రామఅష్టోత్తరంతో పూజించాను. ఈ పూజ మా రామచంద్రునకే చెందాలి అని మనసారా కోరుకున్నాను.

క్షణాలలో మనస్సులో ఒక ఆలోచన మెరుపులా మెరిసింది. నేను రామభక్తుడను. ఇతరులను ఎందుకు ఆరాధించాలి ? నా స్వామి స్థానంలో అమ్మను ప్రతిష్ఠించుకోవడం తగునా ! అని మానసిక సంఘర్షణ ప్రారంభమైంది. కాని అమ్మ అయస్కాంత దివ్యశక్తి, ఆ మాతృప్రేమ, నా మనస్సంతా నిండిపోయింది. అప్పటి నుండి అమ్మ నా వెన్నంటి ఉంటూంది. అయినా మళ్ళీ అమ్మను ఎప్పుడు చూద్దామా అని నా మనస్సు ఎప్పుడూ తహ తహ లాడుతూ ఉండేది. ఇంతలోనే మళ్ళీ నా ఉపాసనాదైవమయిన శ్రీరామ చంద్రునికి దూరమౌతున్నాననే భయం కూడా ఉండేది. అందుకే అభయ ప్రదాత అయన భద్రాద్రీశుని దర్శనానికి భద్రాచలం చేరాను. పవిత్ర గోదావరి స్నానం చేసి స్వామివారి సన్నిధిలో ఆసీనుడనయ్యాను.

చుట్టూ ప్రశాంత వాతావరణం - మనస్సు నిశ్చల స్థితిలో ప్రశాంతంగా

ఉంది. అర్చక స్వాములు స్వామివారిని అభిషేకించుటకు, ఆభరణాలు, వస్త్రాలు తొలగించారు.

సీతామహాసాధ్వి వామాంకమున ఉన్న శ్రీరామచంద్రుని నిజరూప దర్శనం లభించింది. గర్భాలయం నుండి శ్రీరామచంద్రునికి దూరమౌతున్నాననే దిగులుతో నేత్రాలు అశ్రుపూరితాలయినవి.

దుఃఖం కట్టలు తెంచుకొని పొర్లుకొస్తున్నది. స్వరం గద్గదమైంది. స్వామి! రామచంద్రా! నీ నుండి నన్నెందుకయ్యా దూరం చేస్తున్నావు ! అని ఆర్తితో కట్టలు తెంచుకొన్న దుఃఖంతో స్వామి సన్నిధిలోనే అమనస్కుడనయ్యాను. అపుడు నాకు " అమ్మే అమ్మే అమ్మే " అనిపించింది.

అమ్మ అంటే నాకు ఉన్నది ఒకే అమ్మ. ఆ అమ్మ సీతమ్మ. అయితే ఆ సీతమ్మే ఈ అమ్మా ? అని అనుకుంటూ ఉండగా నా మనస్సు నుండి సమాధానంలేదు నిశ్శబ్దం ఆవరించింది. మనస్సు ఆలోచనారహితస్థితిలో ప్రశాంతంగా ఉంది.

ఆసమయంలో - గర్భాలయం నుండి మూడుసార్లు "అమ్మ" "అమ్మ" "అమ్మ" అని వినిపించిది.

ఇంతకాలం నన్ను ఆదుకొని రక్షిస్తున్న దయాసముద్రుడగు రామచంద్రుడు మాతృప్రేమను వర్షిస్తూ జిల్లెళ్ళమూడిలో అమ్మగా ఉన్నాడని ధృడమనస్కడనయి ఆనందాతిరేకంతో - ఇంటికి తిరిగి వచ్చాను. అపుడు నాది రైస్ మిల్ వ్యాపారం యేలూరులో. ఆ రోజులలో బి. రామబ్రహ్మం గారు ఆంధ్రాబ్యాంకు మేనేజరుగా ఉన్నారు. రామబ్రహ్మం గారు మహామనీషి, స్థితప్రజ్ఞుడు, నిష్కామ కర్మయోగి. విధి నిర్వహణలో నిజాయితీతో ప్రవర్తించడం అయన వ్యక్తిత్వలక్షణం. అమ్మ సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేసినవారు. అమ్మ మూలంగా మేమిద్దరం అతిసన్నిహితులమయ్యాం, యేకోదరులవలె జీవిస్తున్నాం.

ఒకనాడు ప్రసంగవశాత్తు అమ్మను గూర్చిన చర్చలో నా భద్రాచల అనుభూతిని గురించి చెప్పాను, ఆ చెప్పేటప్పుడు "అమ్మే" "అమ్మే" "అమ్మే" అని మూడు సార్లు అనిపించడం చెప్పానుగాని. గర్భగుడిలో నించి మూడుసార్లు వినిపించడం చెప్పలేదు జ్ఞాపకం లేని కారణముగా. కొంతకాలం తరువాత శ్రీరామబ్రహ్మం గారు అమ్మదర్శనానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అమ్మను దర్శించి అమ్మ ప్రక్కన కూర్చున్నారు. అమ్మకు రామబ్రహ్మంగారికి " విశ్వాసం " అనేదాని గురించి సంభాషణ జరుగుతుంది.

అమ్మ "అప్పారావు ఎన్నో పరిశోధనలు చేసి నా దగ్గరకు వచ్చాడు" అని అమ్మ అన్నదట.

రామబ్రహ్మం : అవునమ్మా ఆయనకు మూడుసార్లు "అమ్మే" "అమ్మే" "అమ్మే" అని భద్రాద్రిలో అనిపించాకనే నేను అమ్మవద్ద స్థిరపడ్డానని నాతోచెప్పాడు.
అమ్మ : "అనిపించడమే కాదు నాన్నా మూడుసార్లు వాడికి వినిపించింది కూడా" నేను ఈ విషయాన్ని రామబ్రహ్మం గారికి మాత్రమే చెప్పాను గాని ఇతరులకు ఎవ్వరికీ చెప్పలేదు. అమ్మకీ చెప్పలేదు. వినిపించింది నా వ్యక్తిగత అనుభవమే గాని రెండవ వ్యక్తికి తెలియదు. నిజానికి నేను కూడ మూడు సార్లు వినిపించిన మాట మరచిపోయాను. అమ్మ రామబ్రహ్మంగారికి చెప్పిన తరువాతనే గుర్తువచ్చింది నాకు కూడా. రెండవ వ్యక్తికి కూడా తెలియని నా వ్యక్తిగత అనుభవం అమ్మకు ఎలా తెలిసింది అమ్మయొక్క సర్వాంతర్యామిత్వం, అవగతమయి అమ్మ పాదాలకు మనసారా నమస్కరిస్తూ అశ్రువులతో పాదాభిషేకం చేశాను. ఆనాటి నుండి అమ్మే నాకు సర్వస్వం అమ్మయే రాముడు. అమ్మయే తల్లి, అమ్మయే తండ్రి, అమ్మయే దైవం, అమ్మయే సర్వస్వంగా నన్ను అందుకుంటుంది.

## సీతారాములు

విరామంలేనిది రామం
విరామం లేని ప్రతి ఒక్కటీ రామమే
ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు విరామం లేదు
సృష్టికి విరామంలేదు.
కదలికకు విరామంలేదు.

ఆ విరామంలేని తన నుండి అవసరాన్నిబట్టి
పరిమితిగల రాముడుగా అవతరించాడు.
తనలో శక్తే సీతై, లోకమాతై, ప్రకృతి సాక్షియై
సర్వఆరామమై విరాజిల్లింది.

విరామంలేనివారుగా
ప్రపంచానికి వారు ధర్మాన్ని పంచిపెట్టారు
వారే సీతారాములు
(మహోదధితరంగాలు-శేముషీవైభవం నుండి)

# అమ్మ నిజరూపమేది

7-9-2003 తెల్లవారు ఝామున గం. 3-30 ని.లకు నా భార్య కుసుమాంబకు మోకాలు నొప్పి చాలా ఎక్కువగా ఉంది. చాలా బరువుగా కూడా ఉంది. కాలు కదపలేక పోతోంది. అంతకు ముందురోజు 6-9-2003 ఉదయం 10 గంటలకు పూజా గృహంలో అమ్మ సన్నిధిలో కూర్చుని "అమ్మా! నా కాలునొప్పి చాలా ఎక్కువగా ఉంది తగ్గడంలేదు నవరాత్రులు దగ్గరకు వస్తున్నాయి ఇట్లా ఉంటే నేను ఎట్లా పూజచేసుకోగలుగుతాను" అని చెప్పుకుని ఏడ్చింది.

ఆ రోజు రాత్రి హోమియో మందు వాడాం. నొప్పి తగ్గకపోగా ఎక్కువ అయ్యింది. మరునాడు తెల్లవారుఝామున గం. 3-30 లకు నన్ను నిద్రలేపి నొప్పి తట్టుకోలేక పోతున్నానండీ, నా బ్రతుకు ఇట్లా అయిపోయింది అని బావురుమని ఏడ్చింది. ఈ బాధ చూడలేక నొప్పి ఉన్నచోట నా చేతిని ఉంచి "అమ్మ నిన్ను రక్షించుగాక" అని అమ్మను ప్రార్థిస్తూ సంకల్పించి దృష్టిని అక్కడ కేంద్రీకరించాను. అపుడు ఒక దివ్య చైతన్య శక్తి నాచేతి ద్వారా అమె మోకాలిలోకి ప్రవేశించి మోకాలు చుట్టూ ఒక వలయాకారంగా పరిభ్రమిస్తూ పాదముల వరకూ ప్రవహించడం మొదలైంది. అక్కడి నుండి అరికాలు లోనికి; అరికాలు నుండి తిరిగి మోకాలు లోనికి మృదువుగా ప్రవహించి కొంతసేపటికి ఆగిపోయింది. ఆమె నిద్రలోనికి జారుకుంది. నిజానికి అది నిద్ర కాదేమో! పదినిమిషాల తర్వాత అమె నన్ను మళ్ళీ పిలిచి నా బాధ అమ్మ విన్నది. అలయంలోని మూర్తి నుండి బయటకు వచ్చి నాకాలు నిమిరింది చూడండి! ఎంతతేలికగా ఉందో! తగ్గిపోయింది అన్నది తన అనుభవాన్ని వివరిస్తూ. "**నేనిప్పుడు చైతన్య రూపంలో ఉన్నాను**" అని అమ్మ చెప్పగా చైతన్యమంటే ఏమిటో నాకు తెలియదమ్మా!అని నాభార్య అంటూ ఉండగా అదే తెలుస్తుంది అని చెప్పి అమ్మ అదృశ్యమైంది అని నా భార్య చెప్పింది.

నా భార్యకు భౌతిక రూపంగాను, నాకు చైతన్యరూపంగాను అనుభవాన్ని అందించిన అమ్మకు అసలు రూపం ఏది అని నేను ఆలోచనలో పడి అన్ని రూపాలూ అమ్మవేనని దృఢపరచుకున్నాను.

**రూపాన్ని ధ్యానిస్తే దేనిని పొందుతారో**
**అక్షరాన్ని ధ్యానించినా దానినే పొందుతారు.**
**మంత్రంమంటే భగవంతుని అక్షరరూపమే.**

## నామపారాయణ ప్రీత

నామపారాయణ ప్రీత అయిన అమ్మ 1968లో హైమసిద్ధి పొందిన తర్వాత అఖండ జ్యోతి వెలిగించి అఖండ నామాన్ని ప్రారంభించింది. అప్పటి నుండి హైమాలయ ప్రాంగణంలో అఖండ నామం జరుగుతూనే ఉంది అఖండ జ్యోతి వెలుతూనే ఉన్నది.

10-11-1979న లలితాకోటి నామార్చన జరిగింది. అప్పటినుండి ప్రతి సోమవారం శుక్రవారం లలితా లక్షనామార్చన జరుగుతూనే ఉంది. ఇంకా ఏకాహాలు కూడా జరుగుతూనే ఉన్నాయి.

1984లో బృందావనంలోని ప్రభుదత్త బ్రహ్మాచారిగారి ఆశ్రమంలో రఘువరదాసు గారి శిష్యులు శ్రీరామదాసుగారు మా దంపతులము 10 రోజులు ఉండటం జరిగింది. బృందావనంలో నామ సంకీర్తనకు చాలా ప్రాధాన్యం ఇస్తారు. చాలా ఆశ్రమాలలో అఖండ నామ సంకీర్తన జరుగుతూ ఉంటుంది. సంకీర్తన బృందములు వాద్యములతో కలసి సంకీర్తన చేస్తారు. కొన్నిచోట్ల నృత్య సంకీర్తన కూడా చేస్తూ ఉంటారు.

బృందావనంలో సంకీర్తన విన్న నాకు జిల్లెళ్ళమూడిలో కూడా ఇలా అఖండనామం జరిగితే బాగుండుననే కోరిక కలిగింది. అమ్మతో ఈ విషయం చెప్పాను అమ్మ సరే అంది. బాగా నామం చేయగల కుటుంబాన్ని చూడునాన్నా! అంటూ నీకు తెలిసిన వాళ్ళు ఎవరైనా ఉన్నారా! అని అడిగింది. ఇక్కడికి దగ్గరలోనే కారంచేడు ఆశ్రమంలో రఘువరదాసు గారి శిష్యులు శ్రీరాం గారి దగ్గరకు వెళితే ఎవరినైనా పంపుతారు అన్నాను. వెంటనే బయలుదేరి వెళ్ళమన్నది. ముందుగా ఒక సప్తాహం కూడా చేయించమన్నది. ఈ విషయం శ్రీరాం గారికి చెప్పగానే 22-10-1984 నుండి 29-10-1984 ఉదయం వరకు అఖండ హరేరామ నామసప్తాహం అవధూతేంద్రసరస్వతీ స్వామివారి శిష్యులు వంతులు వారీగా చేశారు. ఈ సప్తాహం శ్రీ లక్ష్మణ యతీంద్రుల వారి ఆధ్వర్యంలో జరిగినది. శ్రీ రాంగారు జిల్లెళ్ళమూడి ప్రాంగణమంతటా నామామృత వర్షాన్ని కురిపించారు. తరువాత పిల్లలమర్రి పద్మావతి గారి కుటుంబం అంతా జిల్లెళ్ళమూడిలో స్థిరపడ్డారు సంకీర్తన చెయ్యడానికి. ఈ సప్తాహం జరిగిన పిమ్మట "సప్తసప్తాహాలు కూడా చూచి

వెళ్ళాలనుంది నాన్నా ” అంటూ సప్తసప్తాహాలు త్వరగా చేయించమని వత్తిడి పెట్టింది. శ్రీరాంగారిని ఇక్కడకు పిలిపించమంది. లక్ష్మణయతీంద్రుల వారిని కూడా పిలిపించమంది. దాని ఫలితంగానే కలిసంతరణమహామంత్రం. 9-2-1985 నుండి ది. 22-3-1985 వరకూ “హరేరామ హరేరామ రామ రామ హరేహరే” అంటూ అఖండ నామ సంకీర్తన సప్తసప్తాహాలు జరిగినవి. ప్రతిరోజూ ఉదయం నగర సంకీర్తన, రాత్రికి రామలీల మహోత్సవం జరిగేది. ఇది ఒక వినూత్న ప్రక్రియ. హరేరామ నామం చేస్తూ నృత్యసంకీర్తన గావిస్తూ ఉంటారు. మొత్తం రామాయణాన్ని శ్రీరాం గారు వ్యాఖ్యానంచేస్తూఉంటారు. దానికి అనుగుణమైన హావ భావాలతో నృత్య సంకీర్తన జరుగుతుంటుంది. ఇది ఉత్తరదేశ సంప్రదాయం. అక్కడ రామలీల అంటూ రామకథలను, కృష్ణలీలఅంటూ కృష్ణుని కథనూ మూకాభినయంతో పాత్రలలో లీనమై నృత్య సంకీర్తన చేస్తూ ఉంటారు. ప్రతిరోజు ఈ కార్యక్రమాన్ని అమ్మ కూడా తిలకించేవారు. ఇది చూచి పులకించిన నాకు మనసులో ఒక కోర్కె కలిగింది. ఒక రోజు అమ్మ చరిత్రను కూడా ఇదేరీతిలో నృత్య సంకీర్తన చేయించాలని.

శ్రీరాం గారితో నాకోరిక వెలిబుచ్చాను. అమ్మ చరిత్ర వ్రాసి ఇస్తే అలాగే చేద్దాం అన్నారు. రామకృష్ణ అన్నయ్యతో చెప్పాను ఈ విషయం. ఇది తన మనస్సులో ఉన్న కోరిక కూడా అన్నాడు అన్నయ్య.

వెంటనే ఆఘమేఘాలమీద అమ్మ దగ్గరకు వెళ్ళి ఒక రోజు నీ చరిత్ర కూడా నృత్యసంకీర్తన చేయించాలని ఉంది. ఆ ప్రదర్శనను నీవుకూడా చూడాలని, నీవు సరేనంటే అన్నయ్య రచన చేయడానికి సిద్ధంగా ఉన్నాడన్నాను. బిడ్డల కోరికలను కాదనలేదు కదా! అమ్మ. వెంటనే అన్నయ్య దగ్గరకు వెళితే ఒకే ఒక్క రోజులో రచన పూర్తి చేసి ఇచ్చాడు అన్నయ్య. జయహోమాతా అనే నామంతో ఆఖరు రోజున అమ్మ చరిత్రతో సప్తసప్తాహాలు పూర్తి అయినాయి. అమ్మ చరిత్ర పాత్రధారులంతా ఆశ్రమవాసులే. వారికి శ్రీరాంగారు శిక్షణ ఇచ్చారు 12-6-1985న అమ్మశరీరత్యాగం చేసిన తరువాతగాని “ సప్తసప్తాహాలు చూచి వెళదామని ఉన్నది నాన్నా ” అని అమ్మ పలికిన మాటలోని అంతరార్థం నాకు అర్థం కాలేదు.

నామసంకీర్తనకు అమ్మ ఎంతోప్రాధాన్యత నిచ్చేది “నామ పారాయణ ప్రీత ” కదా ! మరి.

## ఆబ్రహ్మకీటజనని

1977లో వచ్చిన పెనుతుఫానుకు అన్ని గ్రామాలవలెనే జిల్లెళ్లమూడి గ్రామం తల్లడిల్లిపోయింది. ఇళ్ళన్నీ కూలిపోయి గ్రామస్థులంతా నిరాశ్రయులయ్యారు. దానికి తోడు చుట్టప్రక్కల వాగులన్నీ పొంగి వరదవచ్చింది. చుట్టూజలం. మధ్యలో అమ్మ నివసించే అందరిల్లు. అన్నపూర్ణాలయంలో వంటచెయ్యటానికి కూడా కష్టమైన పరిస్థితి. అయినా అమ్మ అందరింటి భవనంలోనే గ్రామస్థులకు, వారి పశువులకు కూడా ఆశ్రయం కల్పించి వారు తేరుకుని ఇళ్లకు తిరిగి వెళ్ళేవఱకు అన్నపూర్ణాలయంలోనే భోజనం ఏర్పాటు చేయించింది.

వరద తాకిడి కొంత తగ్గిన తరువాత నేను జిల్లెళ్లమూడి వెళ్ళి అమ్మ సన్నిధిలో కూర్చున్నాను. అమ్మ ఆవేదనతో ఇలా చెప్పడం ప్రారంభించింది. " ఈ తుఫానుకు భోజనశాల మీదనున్న రేకులు ఎగిరి దూరంగా పడ్డాయి. క్రింద కట్టివేసిన ఏ పశువుకు ఆరేకులు తగిలినా దాని ప్రాణం ఉండేది కాదు. ఆ పశువులు అంబా అంబా అని ఆర్తనాదం చేశాయి నాన్నా ! ఏ ఒక్కరు కూడా వెళ్ళి కట్లు విప్పలేదు పొద్దుటే పాలకోసం మాత్రం పాత్ర తీసుకొని వెళతారు. అదృష్టవశాత్తు ఒక్క రేకు కూడా ఏ ఒక్క పశువుకు తగలలేదు అంటూ తన ఆవేదనను వ్యక్తం చేసింది.

మాకు ఏదైనా బాధవేస్తే నీకు చెప్పుకుంటున్నాము. పశువులు, పక్షులు వాటి బాధను ఎవరితో చెప్పుకుంటాయి అని నేను అమ్మను అడిగితే వాళ్ళమ్మకు చెప్పుకుంటాయి అని అన్నది అమ్మ. అపుడు నా కర్థమైంది వాటి అమ్మ ఎవరో!

అమ్మా ఆ బ్రహ్మకీట జనని గదా !

# అమ్మకు అసాధ్యం లేదు

అమ్మ సన్నిధిలో అనసూయావ్రతం చేసుకోవడానికి నేనూ, నాభార్య కుసుమాంబ అమ్మ సన్నిధికి చేరాం. ఆరోజు నా పుట్టిన రోజు. అమ్మ ఆరోజు ఉదయం మా ఇద్దరికి తలపై చమురు పెట్టి నుదుట కుంకుమ బొట్టు పెట్టి దండవేసి ఇద్దరికీ శిరస్సుపై పువ్వులు ఉంచి నూతన వస్త్రములు పెట్టి ఇద్దరికి అమ్మ చేతితో పాయసం తినిపించి ఇడ్లీపెట్టి మంచినీళ్ళు త్రాగించి తన పైట చెంగుతో పెదవులు తుడిచి ప్రతిసంవత్సరం ఇద్దరూ ఇలాగే రండి నాన్నా ! అంటూ ఆప్యాయతతో దగ్గరకు తీసుకుంది.

ఆరోజు సాయంత్రం అమ్మ పాదములకు పూజచేస్తూ అనసూయా వ్రతం చేసుకున్నాము. ఉదయం కార్యక్రమము అయిపోయింది. షుమారు పది గంటలకు ఏలూరు నివాసి పద్మనాభుని నారాయణ గారు షుమారు 60 సం॥లు వయస్సు ఉంటుంది అమ్మ దర్శనార్ధం వచ్చారు. నాకు వారు బాగా తెలుసు. అమ్మను దర్శించుకుని మహదానంద భరితులు అయ్యారు. వారిని కూడా ఉండమని, వ్రతం చేసుకోమని చెప్పమని అమ్మ నాతో చెప్పారు. నేను వారితో విషయం చెప్పగానే రాత్రి సమయంలో మూత్ర విసర్జనకు నాలుగైదు సార్లు వెళ్ళవలసి ఉంటుంది. ఎక్కువ సమయం కూర్చోలేను భోజనానికి ఆలశ్యమయితే ఆగలేను బయలుదేరి వెళతాను అన్నారు నారాయణగారు.

అప్పటికి "అందరిల్లు"లో మాత్రమే ఉండటానికి వసతిగదులున్నాయి. అక్కడ టాయిలెట్స్ లేవు. కనుక రాత్రి మేడ దిగి వెళ్ళవలసి ఉంటుంది. అందువలన నేను కూడా ఉండమని గట్టిగా చెప్పలేకపోయాను. అమ్మతో విషయం చెప్పాను. ఏ ఇబ్బందీరాదు ఉండమని చెప్పారు. ఈ మాట విని అమ్మ మాటయందలి విశ్వాసంతో

రాత్రి ఉండి అనసూయావ్రతం చేసుకుంటానికి నిశ్చయము చేసుకున్నారు. నారాయణ గారు.

ఈ సందర్భంలో అమ్మ ఒక ధర్మసూక్ష్మాన్ని కూడా చెప్పారు. " వారిని భోజనం చేసి వ్రతం చేసుకోమను మీరు మాత్రము అల్పాహారమును తీసుకుని వ్రతాన్ని చేసుకోండి అని ". సాయంకాలం ప్రశాంతవాతావరణంలో అమ్మ సన్నిధిలో అనసూయావ్రతాన్ని నిర్వహించుకున్నాము. రాత్రి విశ్రాంతి తీసుకున్నాము. విశేషమేమిటంటే నారాయణ గారికి ఒక్క సారైనా మూత్రవిసర్జన చేయవలసిన అవసరం రాలేదు. ఉదయము కాలకృత్యాలు తీర్చుకొనుటకు క్రిందకు వెళ్ళాము.

అప్పటి రోజులలో యాత్రికులు స్నానం చేయటానికి వరసగా పదిపంపులు ఉండేవి. ఆకుళాయిలలోనికి నీరు రావటానికి ఒకే ఒక పెద్ద గొట్టం టాంకునుండి ఉండేది. నేను ఒక కుళాయివద్ద స్నానం చేస్తున్నాను. నా ప్రక్క కుళాయి వద్ద నారాయణరావుగారు స్నానం చేస్తున్నారు. చలికి నేను బాగా వణికిపోతున్నాను. వారు మామూలుగా స్నానం చేస్తున్నారు. ఎందుకండీ అలా వణికిపోతున్నారు మీరు అని నారాయణగారు నన్ను అడిగారు. నీళ్ళుచాలా చల్లగా ఉన్నాయికదా అన్నాను. అలా అంటారేమిటి వేడినీళ్ళు వస్తున్నాయి కదా ? అన్నారు అది ఎలాసాధ్యం ఈ పంపులన్నిటిలోకి నీళ్ళు వచ్చేగొట్టం ఒక్కటే అన్నాను. కాదు చూడండి ఈ పంపునుండి వచ్చే నీళ్ళను, వేడిగా ఉన్నాయి అన్నారు. నేను చెయ్యిపెట్టి చూచాను. నీళ్ళు స్నానానికి సరిపడే రీతిలో వేడిగా వస్తున్నాయి. ఎవరిని ఎలా కాపాడాలో అమ్మకు తెలియక పోతేకదా ? అమ్మ మహిమకు ఆనంద పడ్డ నారాయణగారు అమ్మ వద్ద శలవు తీసుకొని గృహోన్ముఖులయ్యారు.

# మృతపుత్రుని సజీవ దర్శనం

2004 ఆగష్టు కృష్ణా పుష్కరాల సందర్భంగా విజయవాడలో గల చక్కా చంద్రశేఖరరావు గారి ఇల్లు కేంద్రముగా జిల్లెళ్ళమూడి విశ్వజననీ పరిషత్ వారు ఒక సేవా కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఈ కేంద్రంలో పుష్కర యాత్రికులకు భోజన సదుపాయంతో పాటు అమ్మ ప్రేమతత్వాన్ని గురించి ప్రతిరోజు ప్రసంగాలు జరిగేవి.

ఒక రోజు నేను ప్రసంగిస్తూ ఉండగా శ్రీ శరభయ్య గారి (సత్యనారాయణ పురంలో గుడులు కట్టించిన వారు) కోడలు సేవాకేంద్రానికి వచ్చారు. వారి కుటుంబమంతా అమ్మభక్తులు. ఆమె నా ప్రసంగాన్ని ఆద్యంతము శ్రద్ధగా ఆలకించడం చూచి "మీరు అమ్మను చూచారా" ? అని అడిగాను. ఆమె అన్నదికదా " మేమంతా అమ్మ భక్తులమండీ! " అంటూ 1960 ముందు జరిగిన ఒక సంఘటనను గురించి వివరించారు." ఏడేండ్లవయస్సుగల్గిన మా చెల్లెలుకొడుకు " విధివశాత్తు మరణించాడు. ఆమె నిద్రాహారాలు మాని విలపిస్తూ ఉంటే మేము చూడలేకపోయాము. అమ్మ ఉందన్న భక్తి భావముతో అమ్మ దగ్గరకు వెళితే ఈ దుఃఖభారం తగ్గుతుందేమోనని నేను మా చెల్లెలు జిల్లెళ్ళమూడి వెళ్ళాము. అమ్మతో మాకు బాగా చనువున్నది. అమ్మను చూడగానే మా చెల్లెలు బావురుమంటూ అమ్మను పట్టుకొని దుఃఖావేశంలో గట్టిగా కుదిపేస్తూ 'నీవు నిజంగా అమ్మవే ఐతే నాకిలా చేస్తావా ? నా కొడుకుని తీసుకెళతావా' ? అన్నది. అపుడు అమ్మ ఆమెను దగ్గరకు తీసుకొని సముదాయించింది. అప్పటికి వారంరోజులుగా మా చెల్లెలు భోజనంచేయలేదు. అమ్మ మాటపై గౌరవంతో భోజనం చేసివచ్చి కూర్చున్నాము.

అపుడు అమ్మ మా చెల్లెలితో ***"నీ కొడుకును చూపిస్తాను నీవు వెళ్ళగలవా? అదిగో అటు చూడు !"*** అన్నది.

ఇంతలో చనిపోయినపుడు ఏబట్టలు ధరించిఉన్నాడో ఆబట్టలతో తన కుమారుడు సమీపంలోని ఒక "గుంజ"ను పట్టుకొని దాని చుట్టూ తిరుగుతూ ఆడుకుంటున్నాడు. ఆ బాలుని చూచింది మా చెల్లెలు. ఈ లోపుగా ఒక కారు వచ్చింది. ఆబాలుణ్ణి కారులో ఎక్కించుకొని వాని తల్లిదండ్రులు తీసికొని వెళ్ళారు. ఈ సంఘటనతో మా చెల్లెలు నివ్వెర పోయింది. అమ్మ ఆశీస్సులు ఎలా పనిచేశాయో తెలియదుగాని ప్రశాంత మనస్కులమై యింటికి తిరిగి వచ్చాము అమ్మ ఆశీస్సులు తీసుకొని.

# దుష్ట సంస్కార సంహరణ

అది 1977 సంవత్సరం అయిఉండవచ్చు. మానసికంగా అశాంతిగ ఉన్నాను. ఏదో ఒక పుణ్యక్షేత్రానికి వెళ్లాలనిపించింది. శ్రీచక్కా చంద్రశేఖరరావ (విజయవాడ) వారు మంత్రాలయంలో మండల దీక్షతీసికొని సాధన చేసుకుంటున్నారు. నాకూ మంత్రాలయం వెళ్ళాలనిపించి వెళ్ళాను.

దేవాలయం ముఖద్వారానికి ఎడమ ప్రక్కన రాఘవేంద్రస్వామివారి నిలువెత్తు తైలవర్ణ చిత్రపటం చిత్రీకరించబడి ఉన్నది. హృదయపూర్వకంగా ప్రణమిల్లాను. స్వామివారి చిత్రపటం చైతన్యవంతమైనమూర్తిగా కనిపించింది. మహదానందాన్ని పొందాను. ఈ క్షేత్రంలో ప్రదక్షిణాలకు ప్రాధాన్యం ఉందికదా! ఎనిమిది దిక్కులలో సాష్టాంగ నమస్కారం చేస్తూ ప్రదక్షిణలు చెయ్యడం అక్కడ ఆచారం. నేను కూడా అలాగే ప్రదక్షిణలు ప్రారంభించాను. అలా ప్రదక్షిణలు చేస్తూ ఉండగా ఈశాన్యదిక్కులో సాష్టాంగనమస్కారం చేస్తున్నపుడు శరీరం అంతా శక్తి తరంగాలతో నిండిపోయి మనస్సు ఏకాగ్రమైనది. ఏదో ఒక దివ్యశక్తి అధీనంలో నా శరీరము ఉన్నది. బాహ్యదృష్టిలేదు. ఎరుక మాత్రమే ఉన్నది.

ఆ సమయంలో ఒక దృశ్యము. అమ్మ (జిల్లెళ్లమూడి) ఒక ఆసనం మీద కూర్చుని కనిపించింది. అమ్మకు ఇరుప్రక్కలా నరసింహస్వామి, రాఘవేంద్రస్వామి ఉన్నారు. ఆ దృశ్యం నేను చూస్తూ ఉండగానే ఒక దివ్యశక్తి అదృశ్యంగా నా ఉదర, హృదయస్థానములందు శూలములతో గ్రుచ్చి మెలిత్రిప్పి కుళ్ళగించి ప్రేగులను కండరములను పెకలించుతున్నట్లుగా అనుభూతి కలిగింది. అలా కుళ్ళగించుతున్నపుడు బాధ కలిగినట్లనిపించి మూలుగుతున్నాను. (కాని ఆబాధ బాధగా లేదు.) ఆ బాధ భౌతిక శరీరానికి సంబంధించినదికాదు. ఆ మూలుగు అంతరాంతరాలలో ఎక్కడి నుండో చాలా లోతులలో నుండి వస్తున్నట్లుగా అనుభూతికలుగుతున్నది. ఈ సంఘటన అంతటికి నేను సాక్షిగానే ఉన్నాను. చుట్టూ జనం చేరారు. వారు మాట్లాడుకుంటున్న మాటలు లీలా మాత్రంగా వినబడుతున్నాయి. కాని శరీరం నా స్వాధీనంలో లేదు మాట్లాడనూ లేను లేవలేనూ.

ఇదీ నాస్థితి ఇలా 20 నిమిషాలు సాగిన తరువాత పూర్వస్థితికి చేరుకున్నాను. (మామూలుగా ఉండే జాగ్రదావస్థకు చేరుకున్నాను.) ఇపుడు సాక్షిత్వంలేదు. శరీరము నా స్వాధీనములోనికి వచ్చినది. లేచి కూర్చున్నాను. శరీరం నుండి ఏదో బరువు తీసివేసినట్లనిపించింది.

శరీరం తేలిక పడింది. మనస్సు చాలా ప్రశాంతంగా ఉంది. చేతులెత్తి స్వామికి హృదయ పూర్వకంగా నమస్కరించుకున్నాను. ఈ విషయాన్ని కొందరు పెద్దలకు సాధువులకు తెలియపరచగా, “ అనేక జన్మపరంపరలలో సంప్రాప్తమైన విషయవాసనల రూపంలో గుండెలో గూడుకట్టుకొన్న దుష్టసంస్కారాలు అంతతేలికగా వదలవు. అతితీవ్రమైన సాధనవలనగాని, మహాత్ముల అనుగ్రహంవలనగాని అవి పెకలింపబడతాయి. అలా పెకలింపబడే సమయంలో సాధకుని సూక్ష్మశరీరము కొద్దిపాటి బాధను అనుభవించుతుందని మహాత్ములు వివరించారు.

దృశ్యముగురించిన భావ-అభిప్రాయ అభినివేశాలే సూక్షదేహము యొక్క మూలపదార్థాలు. రాఘవేంద్రుని సన్నిధిలో అమ్మ దివ్యానుగ్రహం నాపై ప్రసరించిందని, దుష్టసంస్కారములకు సంబంధించిన పూర్వవాసనలు తొలగిపోతున్న వేళ నా సూక్ష్మ శరీరం బాధను అనుభవించిందని నేను చవిచూచిన బాధకు సంకేతాలే నా నుండి వెలువడిన మూలుగులని తరువాత తెలుసుకున్నాను. నాలో వాసనా రూపంలో దాగిఉన్న సంస్కారాలను పెకలించి, తొలగించి అమ్మ నన్ను అనుగ్రహించిందని పొంగిపోయాను.

రెండుచేతులు జోడించి భక్తితో అమ్మ పాదాలకు నమస్కరించాను.



## కుక్కతో నేర్పించిన యోగాభ్యాసం

మురాల నారాయణరావు గారిని ఒక మంచి యోగాభ్యాసకుడు ఉండేవారు. ఆయన నాకు మంచి మిత్రుడు. అనేక మంది సాధుసత్పురుషులను దర్శించిన వాడు. తాను యోగాభ్యాసంలో ఒక స్థితికి చేరాడు. ఆపై స్థితికి చేరాలంటే శ్వాసను ఎలా నడిపించాలో ఆయనకు అర్ధం కావడంలేదు. అందుకు ఒక ఉన్నతమైన యోగాభ్యాసకుని సూచన అవసరం అనిపించింది. అందుకు అయన మనసులో అమ్మ మెదిలింది. వెంటనే నా దగ్గరకు వచ్చారు. మీరు జిల్లెళ్ళమూడి వెళ్ళేటపుడు చెప్పండి. నాకు యోగాభ్యాసానికి సంబంధించిన వారితో అవుసరంఉందని, నాకు అమ్మతో పరిచయంలేదు మీరు నన్ను అమ్మకు పరిచయం చేయండి నా సందేహం తీర్చుకుంటాను అన్నారు. నేను అలాగే అన్నాను.

ఇద్దరం జిల్లెళ్ళమూడి వెళ్ళాము. అమ్మ సన్నిధిలో కూర్చున్నాము. అమ్మతో నేనేవో విషయాలు మాట్లాడుతూ ఉన్నాను. అంతసేపూ ఆయన మౌనంగా కూర్చున్నారు. ఆయన విషయం ఇంకా నేను అమ్మతో ప్రస్తావించలేదు. ఇంతలో ఆయన బయలుదేరదామా అన్నారు.

అమ్మను మీరింకా అడగలేదు గదా అన్నాను. ఆశ్చర్యం ! ఆయన అమ్మను అడిగాను అన్నారు. అయితే అమ్మేమి చెప్పింది అని అన్నాను. (మనస్సులో అడగకుండానే అడిగానంటాడేమిటీ అని అనుకుంటూ) అమ్మతో మాట్లాడుతున్నపుడు ఒక కుక్క వచ్చింది గమనించారా? అన్నాడు. (నిజమే ఒక కుక్క వచ్చింది) అవును అన్నాను. ఆ కుక్క వచ్చినప్పుడు "ఏం చేసిందో గమనించారా " అని అడిగారు. అవును అదేదో శ్వాసను బలవంతంగా పీల్చినట్లుగా ఉన్నది ముక్కుతో అన్నాను. నేను చేయవలసిన ప్రాణాయామం "అలా ఉండాలని " కుక్కచేత చేయించి చూపించింది అమ్మ అన్నారు.

నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను. అమ్మకు నమస్కరించుకున్నాను.

## తినేవాడికే ఇంత హాయిగా ఉంటే పెట్టేవాడికి ఎంత హాయిగా ఉంటుంది.?

అమ్మచేతి గోరుముద్దలు తినియున్న నాకు అది ఒక "కుతిగా" మారింది. చాలాకాలంగా అట్టి అవకాశం లభించలేదు. అమ్మ దర్శనంకోసం జిల్లెళ్ళమూడి వెళ్ళాను ఏమైనా ఈ రోజు అమ్మ చేతిమీదుగా అన్నంతినాలని. ఆవేళనేను భోజనం చేయలేదు. అమ్మ చాలా అనారోగ్యంగా ఉంది. లేచి కూర్చొని పెట్టేఓపిక కూడాలేదు. ఐనా అమ్మనడిగాను " అమ్మా! ఈ వేళ నీచేత్తో అన్నం పెట్టమ్మా" అని. అమ్మ తన అనారోగ్యస్థితిని లెక్క చేయలేదు. వసుంధరక్కయ్యను పిలిచి అన్నము కూరలు తెప్పించి నేతితో కలిపి ముద్దలు చేసి నా చేతిలో పెట్టడం ప్రారంభించింది. అమ్మకు బొత్తిగా ఓపికలేదు. ఎప్పుడూ నోట్లోపెట్టేది. ఒకొక్క ముద్ద తింటూ అమ్మను ఈ స్థితిలో కూడా బాధపెట్టానే అని వ్యధకలిగినది. అశ్రువులు కన్నులనుండి ధారగా వర్షిస్తున్నాయి. ఐనా అమ్మ పెడుతూనే ఉన్నది. నేను తింటూనే ఉన్నాను. ఆరోజు చాలా ఎక్కువ అన్నం తిన్నాను. అమ్మ వైపు చూస్తూనే ఉన్నాను. తన బాధంతా మర్చిపోయినట్లు ఉత్సాహంగా కనిపించింది. " అమ్మా ! నీ చేతి మీదుగా అన్నం తింటుంటే చాలా హాయిగా ఉందమ్మా" అన్నాను. అందుకు అమ్మ " **తినే వాడికేయింత హాయిగా ఉంటేపెట్టేవాడి కెంత హాయిగా ఉంటుంది నాన్నా !**" అని అన్నది.

నిజానికిది నాకు ఒక ఉపదేశమైనది.



# ఏం చేసినా మీరే చేయాలి

అది 1975వ సంవత్సరం సెప్టెంబర్ నెలలో అనుకుంటాను. అమ్మ ఆరోగ్యం బాగాలేదు. డాక్టరు సుబ్బారావుగారు అమ్మను చికిత్సకోసం నెల్లూరు తీసుకొని వెళ్లారు. నేనూ నెల్లూరు వెళ్లాను. 15 రోజులుగా అనారోగ్యంతో ఉంది అమ్మ. అసలు మంచం మీద నుంచి క్రిందకు దిగలేక పోతోంది. ఆదృశ్యాన్ని చూడలేక దుఃఖ పూరిత హృదయంతో బయటకు వచ్చాను. అమ్మకు ఆరోగ్యం చేకూరాలని - అమ్మనామం చేస్తూ అక్కడ నుండి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న రంగనాయకస్వామి ఆలయం చేరాను. ముందుగా అమ్మవారి ఆలయానికి వెళ్ళాను. లక్ష్మీ అమ్మవారుగా నాకు దర్శనం ఇచ్చింది. ఆర్తితో వేడుకున్నాను. " మా అమ్మకు ఆరోగ్యాన్ని ప్రసాదించు అని" - అమ్మవారి మూర్తివైపు తదేకంగా చూస్తున్నాను. ముందుగా అమ్మవారి అభయ హస్తం స్పందించి నట్లనిపించింది. ముఖంలో చిరునవ్వు ద్యోతకమైంది. అమ్మవారి మెడలోని పూలహారం నుంచి ఒక పువ్వురాలింది. నా ఆవేదనకు అమ్మ స్పందించిందికదా అనే ఆనందంతో పరవశించి పాదాభివందనం చేశాను.

తరువాత రంగనాథుని దర్శించి అక్కడకూడా మొరపెట్టుకున్నాను. కానీ స్వామివారిలో ఏ ప్రతిస్పందన లేదు. నిశ్చలంగా నిర్వికారంగా ఉన్నాడు. ఏమీ పట్టించుకోలేదు. మనసుకు బాధ కల్గింది. స్వామివారి వద్ద నిరాశా నిస్పృహలకు గురయినా అమ్మవారి వద్ద కలిగిన అనుభూతితో ఆనందంగా తిరుగుముఖం పట్టాను. సుమారు రాత్రి గం. 7-30ని.లకు డాక్టరుగారి ఇల్లు చేరాను అమ్మ నామం చేస్తూ. డాక్టరు సుబ్బారావుగారి భార్య చిరునవ్వుతో ఎదురుగా వచ్చి 15 రోజులుగా మంచం దిగలేని అమ్మ ఇపుడు ఇంటిలో అటూ ఇటూ తిరగ గలుగుతోంది. అదిగో ఆ తులసి కోట దగ్గర పచార్లు చేస్తూ ఉంది చూడు అంటూ అమ్మను చూపించింది.

నా ఆనందానికి అవధులు లేవు. ఒక్క ఉదుటున వెళ్లి అమ్మ రెండు పాదాలకు చుట్టుకున్నాను. అప్యాయతతో అమ్మ నన్ను లేవనెత్తింది. నేను గుళ్లో జరిగిన సన్నివేశాన్ని వివరిస్తూ అమ్మవారు స్పందించింది కాని రంగనాయక స్వామి

ఏమీ పట్టించుకోలేదమ్మా ! నిశ్చలంగా నిర్వికారంగా ఉన్నాడు ఏమీ పట్టనట్లుగా అని అన్నాను అప్యాయంగా తల నిమురుతున్న అమ్మతో.

అమ్మ తన చేతి వ్రేళ్ల గోళ్లను అప్పటికపుడు తీసి ఆశీర్వదించి ఇచ్చింది నాకు సంతోషంతో. అమ్మను ఇష్టదైవంగా ఎంచుకున్న నేను అమ్మకు సంబంధించిన గోళ్లను పవిత్రమైన ఆరాధ్య వస్తువులుగా భావించి స్వీకరించాను ఆనందపారవశ్యాన్ని అనుభవిస్తూ.

పారవశ్య ప్రవాహంలో నుండి నేను తేరుకోకమునుపే **"రంగనాయకులేంచేస్తాదురా - రంగస్థలం మీద ఉండవలసిందే, ఏం చేసినా మీరే చెయ్యాలి"** అన్నది అమ్మ.

అప్పటికి ఆ మాటల్లోని ఆంతర్యం నాకు అంతగా అవగాహన కాలేదు. కాలక్రమేణా అమ్మ అనుగ్రహంతో, పెద్దల ప్రబోధంతో, ఆధ్యాత్మిక గ్రంథాలపరిచయంతో ఆ మాటల సారాంశం అనుభవానికి వచ్చింది.

ఒక్కడే అయిన పరమాత్మ ఈ సృష్టిచక్రం నడవడానికి రెండు రూపాలు ధరించాడు. ఈ రెండు రూపాలే ప్రకృతి పురుషులు. ఆ ఇద్దరూ ఒకే నాణానికి బొమ్మా బొరుసులవంటి వారు.

ప్రకృతి పురుషులుగా దిగివచ్చిన పరమాత్మలో లోకవ్యవహారాల్లో నిమగ్నమై ఉండే జీవుడే ప్రకృతి తత్త్వం. ఈ విధమైన లోకవ్యవహారాలకు అతీతంగా తానుండి, సాక్షిగా నిలిచే తత్త్వమే పురుషుడు. సాక్షి అయిన ఆ పరమాత్మ నిశ్చలుడు. అతడు చేయించేవాడే కాని చేసేవాడుకాడు. "సాక్షిగా నిర్వికారుడై ఉండే పరమాత్మకు కర్తవ్యమూలేదు, కలవరపాటూలేదు. జీవభావంతో విలవిలలాడే భక్తులకే ఆరాటమూ, కర్తవ్యమూ - అని గుర్తించాను నేను". మనసు తేలిక పడింది. అమ్మకు అంతరంగంలోనే ప్రణామాలు సమర్పించుకున్నాను.

❁❁❁

# గడ్డ కూడ బిడ్డే

అది 1975వ సంవత్సరం జులై నెల 17 ఆషాడ శుద్ధ ద్వాదశి సాయంకాలం షుమారు 4 గంటలకు జిల్లెళ్ళమూడి చేరాను. వాత్సల్యాలయమునకు వెళ్ళే మేడ మెట్లకు రెండు ప్రక్కలా జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. ముఖాలలో విషాద ఛాయలు కనుపిస్తున్నాయి. ఈ లోపుగా పై నుండి కబురువచ్చింది. ఏలూరు నుండి వచ్చిన అప్పారావును అమ్మ రమ్మంటున్నారని. నేను ఇప్పుడే కదా వచ్చాను అయిదు నిమిషాలు కూడా కాలేదే అమ్మకెలా తెలిసి కబురు పెట్టింది. అయినా అమ్మకు తెలియనిదేముంది అనుకుంటూ పైకి వెళ్ళాను. అక్కడ కూడా జనం ఈ హడావిడిగానే కనుపిస్తున్నారు. ఇంతకూ అసలు విషయం ఏమిటి ? ఏమిటి హడావుడంతా ? అనుకుంటూ ఆందోళనగా ప్రక్కవారిని అడిగాను. అమ్మ నెల్లూరు వెళుతున్నారు. డాక్టరు సుబ్బారావుగారు తీసుకెళుతున్నారు.

నా పుట్టిన రోజు అషాడశుద్ధ త్రయోదశి అంటే మరుసటిరోజు. అమ్మ గత సంవత్సరం నాపుట్టిన రోజు సందర్భంగా ప్రతి పుట్టిన రోజుకు రానాన్నా ! అని చెప్పారు. మరుసటి రోజు 11 గంటల వరకే త్రయోదశి ఉన్న కారణంచేత ఆసాయంకాలానికి అక్కడకు చేరాను. అమ్మకు ఒక పిరుదుమీద గడ్డలేచింది. అది చాలా కాలంగా బాధిస్తూంది. అమ్మ కూర్చోలేకపోతోంది. అందువల్ల కొంత కాలం గా దర్శనమిచ్చేటప్పుడు ఆ పిరుదు క్రింద గడ్డకు కుర్చీ ఆనకుండా ఉండేందుకు ఒక స్కూటరు ట్యూబ్ లాంటిది పెట్టేవారు. మరొక ప్రక్క దిళ్ళు వేసేవారు. దాని మీద బెడ్‌షీట్ లాంటిది వేసి కప్పేవారు ఎదుటివారికి తెలియకుండా. అలా కూర్చునే ఎదుటివారికి దర్శనం ఇస్తూ ఉండేవారు. కొంతకాలం దర్శనమివ్వడం ఆపమని కార్యకర్తలు చెప్పినా దర్శించ వచ్చిన వారికి నిరాశ కలుగుతుందని అమ్మ దర్శనాలు ఆపలేదు. తానెంత బాధనైనా సహిస్తుంది కానీ బిడ్డల బాధను చూడలేదు కదా! అమ్మకు ఆరోగ్యము బాగుగలేదని నెల్లూరు నుండి డా॥ యస్.వి. సుబ్బారావుగారు, నర్సాపురం నుండి డా॥ కేశవరావు గారు మరికొందరు వచ్చారు.

ఆ గడ్డ చూచిన డా॥ సుబ్బారావు గారు బాధపడుతుంటే **" గడ్డ కూడా బిడ్డేకదా నాన్నా ! "** అంది సముదాయిస్తూ. (అమ్మ ఆబ్రహ్మకీటజనని కదా అందుకే అమ్మ గడ్డను కూడా బిడ్డ అందేమో!) అమ్మా నిన్ను నెల్లూరు తీసుకుని వెళతాను. అక్కడ నీకు వైద్యం చేయిస్తాను నీవు నా కోరిక తీర్చమని అభ్యర్థించాడు డా॥ సుబ్బారావుగారు. మరి ఆ గడ్డతో నెల్లూరు ప్రయాణం చేసేదెట్లా ?

డాక్టరు గారికి ఒక ఆలోచన వచ్చింది ఇక్కడే ఆపరేషన్ చేసి తీసుకెళితే ఎలా ఉంటుందీ అని. ఆపరేషన్ చేయడానికి తగిన ఏర్పాట్లతో రాలేదు అన్న ఆలోచన కూడా ఉంది. అది గ్రహించిన అమ్మ మత్తు అవసరం లేదు నాన్నా! ఒక బ్లేడ్ తీసుకుని కట్ చెయ్యి అంది. డా॥ గారు సాహసించలేకపోయారు. కానీ, అమ్మ ఇచ్చిన ధైర్యంతో డాక్టరు గారు బ్లేడుతో ఆపరేషన్ చేశారు. ఆతరువాత అమ్మ నెల్లూరు ప్రయాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి. అప్పుడు అమ్మ కలగజేసుకుని రేపు అప్పారావు పుట్టిన రోజు వాడు వస్తాడు. నేను లేక పోతే ఏడుస్తాడు అందట. ఈ విషయమంతా విన్న నాకు అమ్మ హృదయంలో నాకున్న స్థానానికి పొంగి పోయాను. నిజంగా ఇది అమ్మ సంకల్పం కాకపోతే నేను ఈ రోజు ఎందుకు వచ్చేవాడిని రేపుకదా నా పుట్టినరోజు. ఆస్థితిలో కూడా అమ్మ నన్ను దగ్గరకు పిలిచి తలకు నూనెరాసి, కుంకుమ బొట్టుపెట్టి తలపై పూలు వేసి తలనిమురుతూ నీకు ఈరోజే పుట్టినరోజు నాన్నా అన్నది. నిజానికి అప్పటికి త్రయోదశి ప్రవేశించింది. ఇదీ అమ్మ ప్రేమ. అనురాగవర్షిణిగదా అమ్మ.

అమ్మ నాపై కురిపించే అనురాగానికి అమ్మ పాదాలను అశ్రువులతో అభిషేకం జేశాను.

❀❀❀

# మంచి జన్మ అంటేనో

అది బహుశః 1974 లేక 75 అయిఉండవచ్చు. ఒక రోజు నేనూ కొండముది శ్రీరామచంద్రమూర్తి గారూ, మురాల నారాయణరావు గారూ మరొక ఇద్దరూ(ఎవరో గుర్తులేదు) కలిసి జిల్లెళ్ళమూడి కారులో బయలుదేరాము.

కారు గన్నవరం బేకన్‌ఫ్యాక్టరీ దగ్గరకు వచ్చింది. కారు వేగంగా వెళుతోంది. ఇంతలో ఒక కుక్క ఆర్తనాదం వినిపించింది. ఆ కుక్క మా కారు కిందే పడి ఆర్తనాదం చేస్తుంది.చనిపోయిందేమో అనిపించింది. కానీ కారు ఆపలేదు. ఆ సంఘటన నా మనసును కలచివేసింది. అమ్మా మా కారణంగా ఆ కుక్క చనిపోయింది దాని కొక మంచి జన్మనివ్వమ్మా అని ప్రార్థన చేశాను. తరువాత జిల్లెళ్ళమూడి చేరాము. అమ్మ దర్శనం చేసుకున్నాము. అమ్మ కెదురుగా కూర్చున్నాను. ఆర్తి ఆగలేదు. అప్పుడు అమ్మకు కుక్క గురించీ నా ప్రార్థన గురించీ చెప్పాను.

అప్పుడు అమ్మ మంచి జన్మ అంటేనో ! అంటూ వివరణ ఇవ్వడం ప్రారంభించింది. నాన్నా ! ఇక్కడ రెండు కుక్కలు ఉండేవి. ఒక కుక్క ప్రసవించి కొన్ని పిల్లలు పెట్టింది. ఒక రోజు ఆ రెండు కుక్కలూ పోట్లాడు కున్నవి. ఆ పోట్లాటలో ఆడ కుక్క బాగా గాయపడింది. పొదుగు చీల్చివేయబడింది. రక్తంధారగా కారుతుంది ఆభాగం అంతా కుక్క నుండి వేరు పడిందా అన్నంతగా చర్మం వేళ్ళాడుతున్నది. ఆ చీలిన భాగాన్ని పట్టుకుని పిల్లలు పాలు త్రాగుతుండేవి. పాలనుకొని ఆ నెత్తురే అవి పీలుస్తూ ఉండేవి. కానీ ఆస్థితిలో కూడా తాను బిడ్డలకు పాలిస్తూనే ఉంది తన బిడ్డలకు పాలిస్తున్నాన్న తృప్తితో. అదే మనుష్యులలో చూడలేకపోయినాను. ఇప్పుడు ఎంతమంది తల్లులు పిల్లలకు పాలిస్తున్నారు నాన్నా! అంటూ అమ్మ ఆవేదనతో తన సంభాషణ ముగించారు.

✿✿✿

## సన్యాసం వచ్చేదే గాని - ఇచ్చేది కాదు

ముముక్షు జనమహాపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులవారు జగద్విఖ్యాతి గాంచిన యతీశ్వరులు. వారు నన్ను వాత్సల్య భావంతో చూచేవారు. ఆధ్యాత్మికంగా నన్ను ఎన్నో విధాలుగా తీర్చిదిద్దిన మహానుభావులు. ఎన్నో సందర్భాలలో అమ్మ సందేశాలలోని నిగూఢార్థాలను నాకు వివరిస్తూ ఉండేవారు.

ఒక రోజు యతీంద్రులవారు అమ్మ దర్శనానికి వారి పరివారంతో సహా జిల్లెళ్ళమూడి వెళ్ళాలని నిర్ణయం తీసుకుని నాతో చెప్పారు. నేను రామకృష్ణ అన్నయ్యకు ఫోన్ చేశాను.

అనుకున్నట్లుగా 1979 ఫిబ్రవరి 11న యతీంద్రులవారు వారి పరివారంతో బయలుదేరి జిల్లెళ్ళమూడి చేరారు. నేనూ వెళ్ళాను. అమ్మ ఆనతి ప్రకారం రామకృష్ణ అన్నయ్య ఎవరెవరికి ఏయేవిధమైన వసతులు కావాలో అయా ఏర్పాట్లు నన్నడిగి చేశారు. పిమ్మట అందరూ అమ్మ దర్శనానికి వచ్చారు. అమ్మ ఒక్కొక్కరిని తన దగ్గరకు తీసుకుని తలనిమురుతుంటే ఆ మహనీయులందరు అమ్మఒడిలో తలపెట్టి పసిబిడ్డల్లా ఒదిగిపోయారు. ఆ అనుభూతి ఎవరిది వారిదే. ఈ దృశ్యాన్ని చూచిన నేను మహానందాన్ని పొందాను. ఆ రోజు అమ్మకు ఆరోగ్యం బాగాలేకపోయినా ఎంతో ఉత్సాహంగా కనిపించారు.

ఆ రోజు సాయంకాలము యతీంద్రులవారి ప్రసంగాన్ని ఏర్పాటు చేశారు. వారు సన్యాసం అంటే "సత్ పదార్థంలో మనసును లగ్నం చేయడమే" అని వివరించారు.

అమ్మ సన్యాసి లక్షణాలను గురించి వివరిస్తూ అనేక పర్యాయాలు ఇలాగే అనేవారు. "కావాలి" అన్నది కోరికైతే **"వద్దు"** అనేదికూడా కోరికే కదా నాన్నా!

మంచం మీద పడుకోను క్రింద నేపడుకుంటాను అనేది, తెల్లబట్టలు వద్దు కాషాయ వస్త్రాలేకావాలనేది రెండూ కోరికలేగదా.

"ఎప్పుడు ఏది ప్రాప్తిస్తే అప్పుడు దానితో తృప్తి పడేవాడు సన్యాసి. రూపం భేదం గాని స్పర్శ భేదం గాని లేని వాడే సన్యాసి. అటువంటి వాడు ఇంటిలో ఉన్నా ఆశ్రమంలో ఉన్నా ఒకటే. కాషాయం కట్టినా తెల్ల వస్త్రం కట్టినా

ఒకటే సన్యాసం వచ్చేదే కాని ఇచ్చేది కాదు నాన్నా !" గృహస్థాశ్రమం కోటలో ఉండి యుద్ధం చేయడంలాంటిది. ఇంటిలో ఉండి సాధింపలేమనుకోనేవారు ఒక కట్టుబడిలో ఉండి జీవనాన్ని నడపాలనే ఉద్దేశ్యంతో సన్యాసం తీసుకుంటారు, అంటూ వివరించింది అమ్మ.

సంప్రదాయబద్ధంగాచెప్పే సన్యాసానికి అమ్మ చెప్పేసన్యాస వివరణకు ఆనందపరవశులైనారు అందరు.

అమ్మ ఒడిని వదలలేక వదలలేక తిరుగుప్రయాణం సాగించారు శ్రీ యతీంద్రులవారు వారి పరివారం.

## కూతురును, కోడలును సమంగా చూడటమే అద్వైతం

❀❀❀

# దేవుడంటే

అమ్మ కృష్ణా జిల్లా పర్యటన సందర్భంగా ది. 8-10-1973 మధ్యాహ్నం గం. 1-30ని.లకు విజయవాడ లబ్బీపేట టి.టి.డి. కళ్యాణమండపంలో పత్రికావిలేఖరుల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో నేనుకూడా ఉన్నాను. విశాలాంధ్ర పత్రిక సబ్ఎడిటర్ శ్రీ నళినీ మోహన్ గారు కూడా వచ్చారు, కొంచెం ఆలశ్యంగా.

అమ్మ ఎక్కడకు వెళ్ళినా తనతో కొన్ని తినుబండారాలను తీసికెళ్ళడం అలవాటు. ఆ రోజు గారెలు, పులిహోర, పరమాన్నం చేయించి తీసికొచ్చారు.

నళినీ మోహన్ గారు వస్తూండగానే "రానాన్నా" అంటూ తాను తెచ్చిన తిను బండారాలను పెట్టబోయింది. మోహన్‌గారు నేను భోజనం చేసి వచ్చాను నాకు ఆకలిలేదు అన్నారు. " బిడ్డ ఆకలి తల్లికి తెలుసు నాన్నా నీవు అన్నం తినలేదు" అంటూ తలనిమిరుతూ నోటికి అందించింది ఆహారాన్ని. అమ్మకరస్పర్శ ప్రభావమేమోగాని అశ్రునయనాలతో అమ్మపెట్టింది తింటూ నేను దేవుడు లేడనుకునేవాడినమ్మా అంటూ వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

అమ్మ *" నీవేనయం నాన్నా ! దేవుడు లేడు అని తెలుసుకోగలిగావు - వాడున్నాడో లేడో, అసలు ఎట్లా ఉన్నాడో నాకు ఇంతవరకు తెలియలేదు నాన్నా!"* అని అమ్మ అంటూ ఉంటే నళినీమోహన్ గారు పెల్లుబికిన దుఃఖమును ఆపుకోలేకపోయారు.

అమ్మ వాత్సల్య దృష్టితో నళినీ మోహన్ గారిని చూస్తూ " ఒకడు పటం పెట్టుకొని దేవుడని పూజిస్తున్నాడు. మరొకడు పసుపుముద్దపెట్టుకొని దైవభావంతో పూజిస్తున్నాడు. ఇంకొకడు విగ్రహం పెట్టుకొని పూజిస్తున్నాడు నీవు నీజండాను ఆరాధిస్తున్నావు. భావమే కదా, ప్రధానం !" అంటూ తలనిమురుతూ దగ్గరకు తీసుకున్నది. అమ్మ ప్రేమామృత ధారలో తడిసి ముద్దయినారు నళినీ మోహన్ గారు.

❁❁❁

## ప్రయత్నం - ఉందా ? లేదా ?

ఒకనాటి సాయంకాలం అమ్మ విశ్రాంతిగా కూర్చుని ఉండగా "ప్రయత్నం ఉన్నదా? లేదా?". అని అడిగాను. అడగడానికి కారణం లేకపోలేదు. అమ్మ "నీదంటూ ఏమీలేదు. అంతా నిర్ణయించిన ప్రకారమే జరుగుతుంది" అని అనేది శాస్త్రాలు అన్నీ " ప్రయత్నం ఉన్నది" అని అంటూంటే, అమ్మేమో లేదంటున్నది దీనిలో ఏదో నిగూఢార్థం ఉండి ఉండాలనుకుంటూ అమ్మతో ఇలా అన్నాను "మార్కండేయ మహర్షికి అయుర్దాయం లేకపోయినా శివుణ్ణి ఆరాధించి మృత్యుంజయుడయ్యాడు గదా ? ప్రయత్నం లేదంటావేమిటమ్మా నీవు ?

అమ్మ : " (చిరునవ్వుతో) నాన్నా ! మార్కండేయుడు శివారాధన చేయడం శివానుగ్రహం పొందడం, మృత్యువు నుండి రక్షింపబడటం, దీర్ఘాయుష్మంతుడు కావడం, అంతా ముందుగానే నిర్ణయింప బడియున్నది."

అమ్మ సమాధానం నాకు తృప్తినివ్వలేదు. అమ్మ చెప్పేదానిపై సంశయము ఉండ నక్కరలేదు గదా ! కానీ, ఇందులో కూడ ఏదో లోతైన అంశం ఉండి ఉంటుంది. అనుకొని ఈ తత్వరహస్యాన్ని సమయం వచ్చినపుడు అమ్మే తెలియజేస్తుందనే విశ్వాసంతో ఏలూరు తిరిగి వచ్చాను. ఏలూరు వచ్చానే గానీ ఆలోచన ఆగలేదు. "జిల్లెళ్ళమూడి వెళ్ళాలంటే ముందుగాలేచి, కార్యక్రమాలు ముగించుకుని, స్టేషనుకువెళ్ళి, టిక్కెట్టుకొని బండిలో ఎక్కాలి గదా! ఇదంతా ప్రయత్నమేగదా ?"- అనుకుంటూ ఉండేవాడిని. ఇలా కొంతకాలం గడిచింది. అమ్మను చూడాలనిపించింది. కానీ, ఎంత ప్రయత్నించినా వెళ్ళలేకపోయాను. ఇట్లా ఎన్నిసార్లో. ఏదో ఒక ఆటంకం రావడం. వెళ్ళడానికి కుదరక పోవడం. సుమారు రెండు మాసముల తర్వాత జిల్లెళ్ళమూడి వెళ్ళగలిగాను.

ప్రస్తుతం ధ్యానాలయం ఉన్న ప్రాంతం ఆరోజులలో ఖాళీగా ఉండేది. అప్పటికి ఆలయ నిర్మాణం జరగలేదు. నేను తూర్పువైపు పిట్టగోడను ఆనుకుని కూర్చున్నాను. అమ్మ పడమటివైపు పిట్టగోడకు ఆనుకొనియున్న మంచంపై కూర్చుని

ఉన్నది. " ఏమైనా సరే. ఇప్పుడే అమ్మనడుగుదాము ప్రయత్నము ఉన్నదో లేదో తేల్చుకుందాము అనిపించింది". అనిపించిందే తడవుగా అమ్మను సమీపించి అడిగాను.

అమ్మ : నాన్నా ! నీవాగోడకానుకొని కూర్చున్నపుడు ఏమైనా సరే ఇపుడే అమ్మనడిగి తేల్చుసుకోవాలనిపించింది గదా నీకు. ఆ అనిపించిన తరువాత గదా నీవు నన్నడగటానికి వచ్చింది ఆ రావడమే ప్రయత్నం అనిపించుకోబడుతుంది." ఆ అనిపించడములో నీ ప్రమేయంలేదు

" నీప్రయత్నానికి ముందు ఒక ప్రేరణ ఉన్నది గదా! ఆ ప్రేరణ ఎక్కడి నుండి వచ్చిందో గమనించు అని అమ్మ యిచ్చిన వివరణతో అన్వేషణ ప్రారంభించాను. చివరకు

**" నేను - నీవు గా ఉన్నపుడు అన్నీ ఉన్నాయి**

**"నేను - నేను" గా ఉన్నపుడు ఏమీ లేదు"**

అన్న అమ్మ మాటలోని అంతరార్థం " నేను నేనుగా ఉన్నపుడు ప్రయత్నమేమున్నది?" అనుకొని నా మనస్సును హృదయస్థానమందు నిలిపాను.

ఇలా కొంతకాలం సాధన చెయ్యగా చెయ్యగా నా మనస్సు హృదయ స్థానమందులగ్నమైంది. అపుడు అప్రయత్నంగా అంటే నా ప్రమేయం లేకుండానే అన్ని పనులు జరుగుతూ ఉండటం గమనించాను. ఈ తత్వరహస్యం అర్థం కావటానికే నేమో, ఈ అనుభవాన్ని ప్రసాదించింది అమ్మ.



# బాధ శరీరానికే గాని మనసు కులాసాగానే ఉన్నది

బహుశా అది 1980వ సంవత్సరం. ఒకసారి అమ్మ దర్శనార్థం నేను జిల్లెళ్ళమూడి వెళ్ళాను. వాత్సల్యాలయంలో మంచంపై అసీనురాలై ఉన్న అమ్మను దర్శించాను. మనసు వికలమయింది. కారణం అమ్మ దగ్గలేక దగ్గలేక దగ్గుతోంది. కఫం బయటకు రావాలంటే గట్టిగా దగ్గాలి గదా ! దగ్గడానికి కూడా అమ్మకు ఓపికలేదు. నాకు చాలా బాధ కల్గింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గద్గద కంఠంతో అమ్మా ! ఎలా ఉన్నావని అడిగాను. అమ్మ " కులాసాగానే ఉన్నాను నాన్నా" అన్నది. అపుడు నేను అమ్మా ! మేము ఎక్కడ బాధ పడతా మోనని అలా అంటున్నావు గాని దగ్గటానికి కూడా ఓపికలేదుగదమ్మా అంటూ కంటతడిపెట్టుకుని అమ్మ మంచం దగ్గరకు జరిగాను. తాను పడుతున్న బాధకంటె తన బాధను చూడలేక బాధపడుతున్న నన్ను చూచి అమ్మ చలించిపోయింది. తల్లిగదా మరి!

నా తల తన ఒడిలోనికి తీసికొని గోముగా నిమురుతూ " కులాసాగా ఉన్నానన్నాను గాని బాధలేదన్నానా." అంటూ దాని వెనుక నున్న అంతరార్థాన్ని చెబుతూ " నాన్నా ! కులాసా అనేది మనసుకు సంబంధించినది. బాధ అనేది శరీరానికి సంబంధించినది అని వేదాంతరహస్యాన్ని వివరించింది.

అమ్మ ఆరోగ్యం కొరకు యేలూరులో అమ్మ భక్తురాలైన కమలమ్మ గారింట్లో ఏకాహం చేస్తున్నాము. అమ్మతో తాదాత్మ్యం చెందినపుడు కమలమ్మగారి ప్రవర్తన మిగిలిన సమయాలలో కంటే భిన్నంగా ఉండేది. రాత్రి 12 గంటల సమయంలో అమ్మ ఆరోగ్యం గురించి బాధ పడుచున్న నన్ను చూచిన కమలమ్మగారు, అమ్మ బాధపడుచున్నట్లుగా మనకు కనిపిస్తున్నా అమ్మకు బాధ ఉండదు అంటూ తన అరికాలు నాశిరస్సు పై ఉంచారు. వెంటనే కళ్ళు మూతలు పడ్డాయి. బాహ్యస్మృహకోల్పోయాను. అపుడు నాలో నుండి నా సూక్ష్మ శరీరం విడిపడి ఆ గదిలోఉన్నఅందరినీ కమలమ్మగారు కాలుపెట్టిన నా స్థూల శరీరాన్ని సాక్షిగా నా సూక్ష్మశరీరం చూచింది. అపుడు కలిగిన ఆనందాన్ని వర్ణించలేను,

అర్హతలతో నిమిత్తంలేకుండా అనుభవాలన్ని అందిస్తూ సాధనమార్గంలో చెయ్యిపట్టుకుని నడిపిస్తుంది అమ్మ.

# మిమ్మల్ని వదలి నేనెక్కడకి పోతాను

1985 జూన్ 12న అమ్మ దేహం చాలించిన దగ్గర నుండి మానసికంగా నేను చాలా కృంగిపోయాను. ఏ కష్టంవచ్చినా అమ్మతో చెప్పుకునేవాణ్ణి. అమ్మ కరస్పర్శతో సేదదేరేవాణ్ణి. ఇప్పుడు అమ్మలేని జిల్లెళ్ళమూడి గదా ! అమ్మలేని జిల్లెళ్ళమూడిని ఊహించుకోలేక రోజూ అమ్మ ఫోటో ముందు కూర్చుని విలపించేవాడిని.

అక్కడ జిల్లెళ్ళమూడిలో వసుంధర అక్కయ్య ప్రతిరోజు వాత్సల్యాలయానికి పూజ కొరకు వెళ్ళేది. ఆరోజు "అమ్మఫోటోలోనుండి వెలుపలికి వచ్చి " అప్పారావు అక్కడ బాధపడుతున్నాడు. నేను లేనని ఇక్కడకు రాలేక పోతున్నాడు. వాడిని బాధపడవద్దని చెప్పు" అన్న మాటలు వసుంధరకయ్యకు వినిపించినవి. ఈ విషయం అక్కయ్య రామకృష్ణ అన్నయ్యకు వివరించినది.

ఒకసారి నేను జిల్లెళ్ళమూడి వెళ్ళినపుడు రామకృష్ణ అన్నయ్య "అప్పారావ్ నీవు అమ్మను గురించి ఆవేదన పడుతున్నట్లుగా నిన్ను గురించి ఇంకా ఎక్కువగా అమ్మ ఆవేదన పడుతున్న దయ్యా" అంటూ వసుంధరక్కయ్య తనతో చెప్పిన విషయాన్ని అన్నయ్య నాకు వివరించాడు. భౌతికంగా అమ్మ లేకపోయిందే అని అనుకుంటున్న నాకు ఈ సంఘటన ఊరట కలిగించడమేకాక అమ్మ జిల్లెళ్ళమూడిలో ఉన్నది అన్న స్థిరభావన కలిగినది.

అమ్మ దేహ త్యాగం చేసే ముందురోజు రాత్రి రామకృష్ణ అన్నయ్యతో అన్నమాట చిరస్మరణీయాలు

" మిమ్మలను వదలి నేను మాత్రం ఎక్కడికి పోతాను. నేను మీతోనే ఉంటాను మీకు కనపడకపోవచ్చుగాని ఎప్పుడులాగే మిమ్మలను చూచుకోనూ. బిడ్డల యోగక్షేమాలు చూచుకోవడం తల్లి ధర్మం. నేను కనపడను అని దుఃఖించకండి. అవసరమైనపుడల్లా కనిపిస్తాను.



# నేనుండగా భయమెందుకు

మా అమ్మాయి వాణి చిన్నతనంలోనే అనేక ఇబ్బందులను ఎదుర్కొంది! 6 మాసాలు అమ్మ దగ్గర ఉండి సేవ చేసుకుంది. దాని ఫలమేనేమోతెలియదు గాని భరించలేని కష్టాలనుండి బయటపడింది. తరువాత సంతానం కలిగింది. ఆ కుర్రవాడు పుట్టుకతోనే గుండెకు సంబంధించిన వ్యాధితో పుట్టాడు. కానీ నెల తిరక్కుండానే దేహాన్ని వదిలేశాడు. విశేషమేమిటంటే సం॥ తిరక్కుండానే మా వాణి మళ్ళీ గర్భం ధరించింది. 20-7-1988న మగ పిల్లవాడు పుట్టాడు. ఈ పిల్లవాడికి కూడా నెల పూర్తి కాకుండానే జబ్బుచేసింది. గుంటూరు ఆసుపత్రికి పంపించాము. నాలుగు రోజులు చూస్తేగానీ నమ్మకం చెప్పలేమని డాక్టర్లు చెప్పారు. హాస్పటల్‌లో కూడా వాణి "అమ్మజీవితచరిత్ర" పారాయణ చేస్తూనే ఉంది. నాల్గు రోజులు గడిచినా. వ్యాధి తగ్గుముఖం పట్టలేదు. అమ్మ మీద భారం వేసి గుంటూరు హాస్పటల్‌లో మా అమ్మాయినీ అల్లుడుగారినీ మా శ్రీమతినీ ఉంచి నేను ఏలూరు వచ్చేశాను. దుఃఖం ఆగటంలేదు. అమ్మాయికి దెబ్బమీద దెబ్బ తగులుతోంది. "నిన్నే నమ్ముకున్న కుటుంబంమాది. ఒక బిడ్డ ప్రాణం కాపాడటం నీకు కష్టమా?" అనుకుంటూ పెల్లుబికిన దుఃఖంతో అమ్మ ఫోటోకెదురుగా కూర్చొని ప్రార్ధన చేస్తున్నాను. షుమారు రాత్రి 11 గంటలు అయ్యింది. " పోనీ, డాక్టరు గారికయినా ఏమందు వాడాలో నీవు బుద్ధి పుట్టించవచ్చుగదా". అనుకుంటూ అమ్మ ఫోటో కెదురుగా కూర్చున్నాను. అదే సమయంలో గుంటూరు హాస్పటల్‌లో అమ్మ జీవిత చరిత్ర పూర్తిచేసి అమ్మమీద పూర్తిగా భారంవేసి నిద్రలోకిజారుకుంది మా అమ్మాయి వాణి. ఆశ్చర్యం ఏమిటంటే, హాస్పటల్ రూము తలుపు నెట్టి అమ్మ రూములోనికి ప్రవేశించింది. అప్పుడు మా అల్లుడు రాఘవేంద్రరావుగారు బాబుకుపెట్టిన సెలైన్ బాటిల్ తాలూకు సూది కదలకుండా చేతిని పట్టుకొని కూర్చుని ఉన్నాడు "నేనుండగా మీకెందుకు భయం" అని అల్లుడు గారితో చెప్పి, అంతర్ధానమయ్యింది అమ్మ.

మా అల్లుడుగారు వాణిని నిద్రలేపి,“అమ్మ ప్రత్యక్షంగా వచ్చి నేనుండగా మీకెందుకు భయం అని అభయమిచ్చి వెళ్ళింది” అని చెప్పాడు. అప్పటి నుండీ ఆయనకు అమ్మ మీద విశ్వాసం బలపడింది “ బిడ్డల బాధలు చూడలేని అమ్మ ఎక్కడికైనా వస్తుంది ఎప్పుడైనా వస్తుంది” అని అనుకున్నారాదంపతులు.

అదే సమయంలో డాక్టరు గారికి కూడా ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది ఫలానా మందు వాడుదాము అని. తనకు వచ్చిన ఆలోచనపై డాక్టరు గారికి కూడా “ ఇంత కాలం ఈ మందు వాడాలనే ఆలోచన ఎందుకు రాలేదు? అని ఆశ్చర్యం వేసింది. వెంటనే ఆ మందువాడారు. ఉదయానికల్లా వ్యాధి తీవ్రత తగ్గి తిరుగుముఖం పట్టింది. ఉదయాన్నే డాక్టరు గారికి ఫోన్ చేశాను ఏలూరు నుండి. “బాబు ప్రమాదం నుండి బయటపడ్డట్టే మీకేం భయంలేదు” అని. డాక్టరు గారి మాట వినటంతో అమ్మ ఫోటో దగ్గర నేను పడ్డ ఆవేదనాఫలితమే ఇది అని ఆనందాశ్రువులు కార్చాను. మా అల్లుడుగారికి కూడా “ మాకు రక్ష అమ్మే” అనే విశ్వాసం దృఢపడింది.



## పిలిస్తే పలుకుతా

బహుశ అది 1990 అయిఉంటుంది మేము హోల్‌సేల్ నూనె వ్యాపారం చేస్తున్న రోజులు. భారీ వ్యాపారం. ఒక రోజున మా బావమరది రామమోహనరావు మా అల్లుడు రాఘవేంద్ర రావు షాపు మూసి ఆనాటి అమ్మకం తాలూకు డబ్బు సంచితో స్కూటర్ మీద ఇంటికి వెళుతున్నారు. ఒక దొంగ ఇది కనిపెట్టి వాళ్ళ తలలపై కర్రతో మోది సంచితో పారిపోతున్నాడు. చూచినవారు దొంగ దొంగ అని కేకలు వేస్తున్నారు. వెంటనే నాకు ఫోన్ వచ్చింది. ప్రాణాపాయంలేదుగానీ డబ్బు పోయిందని. నేను చేయగలిగిందొక్కటే అనుకొని చేతులెత్తి అమ్మా! అందులో మూడు లక్షల సొమ్ము - ఇది కాస్తా పోతే నాసంగతేమిటి ఆ డబ్బు పోకుండా కాపాడుతల్లీ అని ఆర్తితో ప్రార్థించాను. అమ్మ వాడి మనసులో ప్రవేసించి ఏమిచేసిందో తెలియదుగానీ ఆ దొంగ డబ్బుసంచిని ఒకరిఇంటి దొడ్డిలో విసిరేసి పారిపోతుండగా జనం వాణ్ణి పట్టుకున్నారు. ఆ ఇంటివారు ఆ డబ్బుసంచితెచ్చి మాకిచ్చారు. ఇంతకంటే నిదర్శనం ఏమి కావాలి అమ్మ మనతోనే ఉండి రక్షిస్తుందనటానికి.

**విశ్వాసమే భగవంతుడు**

**నీ విశ్వాసమే రూపం ధరించి నిన్ను రక్షిస్తుంది.**

❖❖❖

## నేను నీకు పెట్టడమంటే-నీ చేత ఇతరులకు పెట్టించడానికే

అమ్మ ఏం చెప్పినా ఎన్ని చెప్పినా శిలాశాసనం లాంటి సందేశం "**నీ కున్నది తృప్తిగా తిని ఇతరులకు ఆదరంగా పెట్టుకో**" అని. ఈ సందేశమే అమ్మ జీవితమంతా పరచుకుని ఉన్నది. అమ్మ దగ్గరకు వచ్చిన వాళ్ళకు అమ్మ అన్నంపెట్టి బట్టలు పెట్టేది. పండితులయినా, పామరులయినా ఉన్నవారయినా లేనివారయినా పెద్ద వారయినా చిన్నవారయినా వాళ్ల స్థితిగతులతో సంబంధం లేకుండా అందరికీ పెడుతూ ఉండేది. ఎంత మందికి పెడితే అమ్మకు అంత సంతోషమూ సంతృప్తి.

అలాగే నాకుకూడ అమ్మ అనేక సందర్భాలలో బట్టలు పెట్టింది. అమ్మ ప్రసాదంగా ఇచ్చే బట్టలు నాకు ఆనందాన్ని కల్గిస్తున్నా సంస్థపై ఆర్థికభారం పడుతుందన్న బాధుండేది. ఆ విషయమే అమ్మతో చెప్పాను. నా మాట విని అమ్మ నవ్వుతూ "నేను నీకు పెడుతున్నానంటే-ఇతరులకు నీ చేత పెట్టించటానికే" అన్నది.

నేను ఇతరులకు పెట్టటానికి అమ్మఇచ్చిన శిక్షణ ఎంత బాగుంది. అమ్మ చరణాలకు నమస్కరించడంఅంటే అమ్మ సందేశాన్ని అందుకొని అమ్మ భావాలకు వారసులంకావాలి అన్పించింది. ఆ ఆలోచనే నా సాధనలో సరిక్రొత్త మలుపు తీసుకువచ్చింది. నేను ఇతరులకు పెట్టాలంటే పెట్టగలిగిన ఆర్థికస్థితి ఉండాలి గదా! అనుగ్రహస్వరూపిణి అయిన అమ్మ ఆ స్థితిని ప్రసాదించింది. అమ్మ నాపై చూపించిన అవ్యాజప్రేమకు అపురూప శిక్షణకు ఆనంద పరవశుడనయి అమ్మ మాటలను ఆచరణలో పెట్టటం ప్రారంభించాను. తనకున్న దానిని అందరకూ హాయిగాపంచుతుంటే ఎంతఆనందంగాఉంటుంది అన్న అమ్మమాట అనుభవంలోకి వచ్చి ఎంతో సంతోషమూ సంతృప్తీ కలిగేవి. ఇతరులకు బట్టలు పెట్టినపుడు మెరిసే వారి నేత్రాలు చూసి ఆనందపడేవాడిని.

" మీకు పెట్టడం – అది అన్నమయినా, బట్ట లయినా మీరు ఇతరులకు పెట్టడం నేర్పడానికే" నని అమ్మనేర్పినపాఠం అంతటా ఆచరణలోకి వస్తే అన్న వస్త్రాలకులోటులేని ఆకలిబాధకుచోటులేని సమాజం ఏర్పడుతుంది గదా !



# బిడ్డ మాటే అమ్మ బాట

1975 సం॥ నెల్లూరులో డాక్టరు సుబ్బారావుగారి ఇంట్లో అమ్మ ఉన్నారు. సుబ్బారావు గారి ఆధ్వర్యంలో వైద్యం జరుగుతోంది. అమ్మతోపాటు రామకృష్ణ అన్నయ్య కూడా అక్కడే ఉన్నారు.

ఒక రోజు రామకృష్ణ అన్నయ్య దగ్గరనుండి నాకు ఫోన్ వచ్చింది. అమ్మకు ఇక్కడ మందులు వాడుతున్నాం. కొన్ని మాత్రలు కావలసి వచ్చినవి. అవి గ్లాక్సో కంపెనీవి. ప్రస్తుతం ఆమందులు తయారు ఆపేశారు. కనుక ఎక్కడైనా చిన్న టౌన్స్‌లో పాత స్టాక్స్ ఉంటే దొరకవచ్చు ఏలూరులో ఏమైనా దొరుతాయోమో ప్రయత్నం చెయ్యమన్నారు. ఏలూరులో కూడా స్టాక్స్ అయిపోయినవి. వెంటనే మాతృశ్రీ అధ్యయన పరిషత్ ఉపాధ్యక్షులైన గుడివాక నమశ్శివయ్య గారికి ఫోన్ చేశాను. వారి తమ్ముడు జి.డి. రామయ్య గారు సౌత్ ఇండియాకు గ్లాక్సో కంపెనీ సేల్స్ మేనేజరు. మన ఏరియామొత్తానికీ డిస్ట్రిబ్యూటర్ విజయవాడలో ఉంటారనీ ఆ కంపెనీ రిప్రజంటేటివ్స్ అందరూ రాత్రికి విజయవాడ ఆఫీసుకు చేరతారనీ ఎక్కడ దొరికేది ఇన్ఫర్‌మేషన్ అక్కడ దొరుకుతుందనీ రాత్రి 10 గంటలకు వెళదామన్నారు. అలాగే ఇద్దరమూ వెళ్ళాము. తెనాలిలోని ఒక హోల్‌సేల్ షాపులో ఉన్నవి అని చెప్పారు. మరుసటిరోజు తెనాలి బయలదేరి వెళ్ళాము! ఆమందు తీసుకొని. అక్క నుండి నెల్లూరు వెళ్ళడానికి సాయంకాలం దాకా అప్పటి రోజుల్లో ట్రైన్స్ లేవు. ఫోన్ వచ్చి 24 గంటలు అయింది. ఇంకా మందు అమ్మ దగ్గరకు చేర్చలేక పోయామన్న ఆవేదన. "అమ్మా ఈ మాత్రలు నీకుపయోగపడాలి" అని తపనతో నమస్కారం చేశాను. అర్ధరాత్రికి నెల్లూరు చేరాము. డాక్టరు గారికి మందులు అందిచాము. అప్పటికే ఆ మందులు మదరాసు నుండి వేరే వారి ద్వారా అందినాయి. ఆ మందులు వాడటం కూడా ప్రారంభించారు. కానీ అమ్మకు ఆరోగ్యంలో మార్పురాలేదు. రోజులు గడుస్తున్నాయి. ఆ వ్యాధికి అదే సరిఅయిన మందు.

కానీ అమ్మకు తగ్గడం లేదు. అప్పుడు డాక్టరు గారు అమ్మకు నమస్కారం చేసి అమ్మా నీకు ఏ మందు వాడాలో నీవే చెప్పు అని ప్రాధేయ పడ్డారు. అమ్మ అప్పుడు అప్పారావు తెచ్చినమందువాడమన్నది. అదేమిటీ అప్పారావు తెచ్చిన మాత్రలూ నేను ఇప్పుడు నీకు వాడుతున్న మాత్రలు ఒకటేనమ్మా. మద్రాసు నుండి ముందుగా రావడం చేత ఆ మాత్రలు వాడుతున్నాను. అన్నారు. లేదు నాన్నా అప్పారావు ఆమందు కొనే టప్పుడే ఈ మందు అమ్మకు ఉపయోగపడాలని అనుకొని కొన్నాడు అని అంది. ఆ తరువాత ఆ మందు వాడారు. అమ్మ ఆరోగ్యం చక్కబడింది.

## ద్రస్సూ - అద్రస్సూ

ఒకసారి నేను జిల్లెళ్ళమూడి వెళ్లినపుడు వాత్సల్యాలయం తలుపులు మూసి ఉన్నాయి. అమ్మదర్శనం కోసం నేను ఎదురుచూస్తూ ఉన్నాను. ఇంతలో ఆనాటి రాష్ట్రమంత్రిణి నన్నపనేని రాజకుమారి గారు అమ్మ దర్శనంకోసం వచ్చారు. రామకృష్ణ అన్నయ్య సరాసరి ఆమెను వెంటబెట్టుకొని అమ్మ గదిలోనికి తీసుకుని వెళ్లాడు. కొంతసేపటికి అమె తిరిగి వెళ్లింది. అపుడుగాని లోనికి వెళ్ళే అవకాశం నాకు లభించలేదు. త్రికరణశుద్ధిగా అమ్మనేనమ్ముకొని ఎంతోఆర్తితో తపనతో ఎదురుచూసే నన్ను విడిచి నాకంటే వెనుక వచ్చిన మంత్రిగారిని ముందుగా దర్శనానికి తీసుకు వెళ్లినందుకు నాకు చాలా బాధకల్గింది. "ద్రస్సు, అద్రస్సు" చూడవద్దు అనే అమ్మ మాటకు ఈ సంఘటనకు సమన్వయం కుదుర్చుకోలేక పోయాను.

అమ్మ దగ్గర నా ఆవేదన వ్యక్తపరిచాను. అపుడు అమ్మ అన్నది గదా ! నాన్నా, ఆమె ఏమి కోరుకున్నదో తెలుసా? నాకు ఒక్క ముద్ద నీ చేతిమీదుగా పెట్టమ్మా అని నీవు నా చేతి ముద్దలు ఎన్నిసార్లు తిన్నావు నాన్నా !

అమ్మ సమాధానంతో మనసుకు ఊరట కలగడమేకాదు ముందుగా ఆమె వెళ్లిందనుకున్నానుగాని అమెవెళ్లినతరువాత నాకుఎక్కువసమయం అమ్మ దగ్గర ఉండే అవకాశంవచ్చింది కదా అనే ఆలోచన వచ్చి ఎవరిని ఎలా ఆనందపరచాలో అమ్మకే తెలుసు అనుకున్నాను.

ఒకసారి అమ్మ పినతల్లిగారు శేషమ్మ గారు ఎంతో ప్రేమతో పూరీలు చేసి తెచ్చారట. అమ్మ అన్నదిగదా!, నాకు పెట్టేబదులు ఎంగిలివిస్తళ్లలో ఏరుకు తింటారే యానాదులు వాళ్లకు పెట్టగూడదూ ! వాళ్ళు తింటే నేను తిన్నట్లేనని. వాళ్లకుపెట్టి వాళ్ళకళ్ళల్లో తృప్తినీ ఆనందాన్ని చూసి మురిసిపోయిందట. "ద్రస్సు, అద్రస్సు కాదు అకలే అర్హత " అని ప్రకటించి ఎప్పుడూ ఇతరులుతినాలని కోరుకోవడం, వారు తింటే చూసి ఆనందపడే అసాధారణవ్యక్తిత్వం పరోక్షంగా అమ్మ మనకు నేర్పడమే గదా!

❀❀❀

# మనం అమ్మను వదిలినా - అమ్మ మనలను వదలదు

అది 1973 సంవత్సరం. ఏలూరులో మారుతి రైస్ మిల్లునడుపుతున్న రోజులు. అమ్మ వద్ద ఎక్కువ కాలంగడపాలని ఉండేది. కాని మిల్లులో పని వత్తిడి వల్ల తరచూ వెళ్ళలేకపోయేవాడిని. వెళ్ళలేకపోతున్నాననే బాధ మనసును తొలుస్తూ ఉండేది. వెళ్ళినపుడల్లా ఆ రోజు రాత్రికే తిరిగి వస్తూ ఉండేవాడిని.

ఒకసారి ఒక్కరాత్రిఐనా అమ్మసన్నిధిలో గడపాలనే సంకల్పంతో జిల్లెళ్ళమూడి వెళ్ళాను. ఆ రాత్రికి అక్కడే ఉన్నాను. మరునాడు అమ్మ దర్శనానంతరము వెళ్ళివస్తానమ్మా అంటే "రేపు వెళుదువు గాని నాన్నా!" అన్నది. సరేనని ఆగాను ఆ మరునాడు "ఆంధ్రా బంద్" ఏ విధమైన ప్రయాణ సదుపాయాలు లేవు. మరునాడు అమ్మ దర్శనం చేసికొని బొట్టుపెట్టించుకుందామని వెళ్ళాను. ఆరోజుకూడా అమ్మ ఉండమన్నది. మిల్లులో పని వత్తిడి చేత వెళ్ళాల్సిన పని ఉన్నదమ్మా అని చెప్పి క్రిందకి దిగాను బొట్టుపెట్టించుకొనిజిల్లెళ్ళమూడి నుండి బాపట్ల చేరడానికి వ్యాన్ కోసం ఎదురుజూస్తూన్నాను. ఆపుడు మధ్యాహ్నం రెండు గంటలు. ఇంతలో పైనుండి కబురువచ్చినది ఇంకొక గంటలో అమ్మ సూర్యలంకసముద్ర తీరానికి ప్రయాణం నీతో చెప్పమన్నది అని. నేను మరల మేడపైకి వెళ్ళాను.

ఇంతలో పెద్ద వాన. ప్రయాణం లేదు అనుకున్నారు. వర్షం వెలిసిన తరువాత సుమారు వందమంది వివిధవాహనాలలో బయులుదేరాము. పులిహోరప్రసాదం కూడా సిద్ధంచేశారు. సంధ్యా సమయానికి సముద్రతీరానికి చేరాము.

అమ్మ సరాసరి సముద్రంలోనికి వెళుతున్నది. అమ్మననుసరించారు చాలామంది. నేను, ఎక్కిరాల భరద్వాజ గారు అమ్మకు ఇరుప్రక్కల ఉన్నాము. సముద్రజలం మోకాళ్ళుదాటుచున్నది. భరద్వాజన్నయ్య నేను చేయి చేయి పట్టుకుని అమ్మ మా చేతులపై ఆనేటట్లుగా కూర్చోబెట్టుకున్నాము. అమ్మ బీలుగుబెండులా చాలా తేలికైనది. నడుములోతుదాటింది సముద్రజలం ఆ దృశ్యం మాకు ఎంతో ఆనందము ఆహ్లాదము కలిగించింది.

సముద్రుడు కెరటములనే చేతులతో అమ్మను భక్తి పూర్వకంగా ఆహ్వానిస్తునట్లు హృదయం పొంగి పొరలి పోవునట్లు ఉవ్వెత్తున కెరటములు లేచి పడుచున్నవి. ఇంతలో ఏదో మాయ నన్నుఆవరించింది అన్నట్లు నీటిలో నా చేతిగడియారం తడిచిపోతున్నదే అనే భావం కలిగినది. ఈ భావం ఎప్పుడైతే కలిగినదో అమ్మ నాచేతిని విడిచి వేసింది. మరొకరు నా స్థానాన్ని ఆక్రమించారు.

"ఎంతచిత్రం జగజ్జనని సన్నిధిలో నా చేతిగడియారమును గురించిన భావమా ? ఏమిటిది ? గడియారం పాడైతే ఏమి ? జీవితం బాగుపడాలిగాని. గడియారం మీదికి దృష్టి పోబట్టేగదా అమ్మ నన్ను విడిచిపెట్టినది. అదేగదా నాచేతిని విడిపింపచజేచినది". పశ్చాత్తాపంతో మనసుకుమిలిపోతోంది. హృదయ తాపం ఆపుకోలేకపోయాను. కన్నీరు ధారలైకారుచున్నది. బిక్కమొగం వేసుకొని దీనంగా ఒడ్డున కూర్చున్నాను. అమ్మకు నా ప్రక్కనే ఆసనంవేశారు. ఆశీనురాలై అమ్మ నావంక చూచినది. ఆ చూపులో జాలి,కరుణ,అనురాగం ఆప్యాయత, ఆదరణ మరియింకేమున్నవో తెలియదుగాని నాలో దుఃఖం పెల్లుబికినది. మనసులో అనుకున్నాను " **భావనామాత్రసంతుష్టాయైనమః**" అని. దోసిలినిండా పులిహోర ప్రసాదం పెట్టినది. కడుపునిండా తిన్నాను. ఆహా ! నాకు వస్తువుమీద ప్రేమ అమ్మకు నామీద ప్రేమ. " నేను అమ్మను వదలినా అమ్మ నన్ను వదలదనే భావం బలపడింది".

వెంటనే ఏలూరు వెళ్ళదామనుకొన్న నన్ను తనతో ఉంచి ప్రకృతి సంబంధమైన మాయయెట్టిదో తెలిపి తన మాతృత్వాన్ని ప్రేమను అందించిన అమ్మ జిల్లెళ్ళమూడి అమ్మ.

ఆ మరునాడు జిల్లెళ్ళమూడి నుండి బయలుదేరుతూ " అమ్మా ! నన్ను నీ నుండి దూరంచేయవద్దు అని ప్రార్థిస్తూ అమ్మ చేత బొట్టుపెట్టించుకుని మరీ బయలుదేరాను."

❀❀❀

## అర్కపురమా - బృందావనమా

అది 1984 సంవత్సరం మే ఆరవ తారీఖు. ఐదవ తేదీన అమ్మ కళ్యాణ దినోత్సవం గనుక అందరికీ విందు భోజనాలు జరిగాయి. అమ్మ దృష్టి ఒక్కసారిగా అక్కడున్న పశువుల మీదకు వెళ్ళింది. నాన్నా! మీ వరకు విందుభోజనాలు చేస్తే సరిపోతుందా ? మరి ఇక్కడున్న పశువులకు అవసరం లేదా అంది. ఆఘమేఘాలమీద సంగం జాగర్లమూడి నుండి పశువులదాణా తెప్పించారు పశువులకు విందు చేయడానికి.

ఆ యూరిలోఉండేవారికి కబురు పెట్టి విషయం చెప్పారు. వారి, వారి పశువులు నన్నిటినీ శుభ్రంగా కడిగి పసుపు పూసి ముఖం మీద కుంకుమదిద్ది పూలదండలు వేసి చక్కగా అలంకరించి అమ్మ నివాసానికి పడమరగా ఉన్న పొలాలలో ఒక పెద్ద ఖాళీ స్థలంలో పశువుల నన్నిటినీ వలయాకారంగా కట్టివేశారు.

అమ్మనివాసస్థలం నుండి ఆశ్రమవాసులు అందరూ ఊరేగింపుగా బయలుదేరారు. అమ్మ సర్వాలంకారభూషితయై కారులో కూర్చుంది. ముందుగా కాసురాధాకృష్ణారెడ్డి గారు 'జయహోమాతా' అంటూ సంకీర్తన చేస్తున్నారు. అందరూ ఉత్సాహంగా నామసంకీర్తన చేస్తుండగా ఆకారు ముందు వెనుకల ఆశ్రమజనసమూహం నడుస్తూ ఉన్నది.

అమ్మ పశువులు ఉన్న ప్రాంగణంలోకి ప్రవేశించగానే అక్కడ వలయాకారంగా అలంకరింపబడి ఉన్న పశువులు అంబా ! అంబా ! అంటూ అమ్మవైపే చూస్తూ ఉన్నాయి. ఆ పశువులకు శ్రవణానందకరంగా ఉండటానికి సన్నాయి మేళం పెట్టమంది. మనకంటే అవే ఎక్కువగా ఆనందిస్తాయి. శిశుర్వేత్తి పశుర్వేత్తి అనలేదా అని అన్నది.

అమ్మ ఆ వలయాకారంగా ఉన్న పశువుల మధ్య ఒక కుర్చీ మీద కూర్చుంది. అక్కయ్యలు అన్నయ్యలు అందరూ జయహోమాతా అంటూనృత్యం చేస్తూ అమ్మచుట్టూ తిరుగుతూఉంటే అమ్మ వారందరినీ పలకరిస్తూ కబుర్లుచెబుతూ ఉంటే భాగవతంలో శ్రీ కృష్ణుడు గోపార్భకులతో కలిసి చలిది ముద్దలు ఆరగించిన సన్నివేశం గుర్తుకు వచ్చింది.

కొందరు సోదరులు ఆ పశువుల దాణా అంతా రాశిగా పోసి జయహో మాతా అంటూ ఆదాణాపై నృత్య సంకీర్తన చేస్తూ త్రొక్కి మెత్తగా తయారు చేశారు. అమ్మ ఆ పశువులకు దాణా పెడుతుంటే ఆ పశువులు అంబా అంబా అంటూ ఉంటే ప్రకృతి పులకరించింది.

బృందావనంలో అయితే ఇప్పటికీ గోవులకు అలంకారం చేస్తారు. ఆశ్రమాధిపతులు కొందరు ఉదయం లేవగానే ఆ గోవులకు సాష్టాంగనమస్కారం చేస్తారు. కొన్ని చోట్ల గోశాలలో పంఖాలు కూడా బిగించారు. నేను బృందావనంలో చూసిన సన్నివేశం అంతా ఇక్కడ గుర్తుకు వచ్చింది.

గోవత్సములను తోలుకుని తోటి గోపబాలురతో చెట్టపట్టాలేసుకుంటూ వెళుతున్న గోపాలకృష్ణుని చూచి బ్రహ్మదేవుడు కూడా ఆశ్చర్య పడ్డారు కదా. ! ఆశ్చర్య పడడా మరి. సర్వసంగ పరిత్యాగం చేసిన మహర్షులకు కూడా లభించని గోపాలకృష్ణుని సాన్నిధ్యం గోపబాలురకు దక్కింది. మరి ఈనాడు జగజ్జనని ఐన అమ్మ సాన్నిధ్యం నాకు దక్కింది కదా ! ఇంతకు ఇది అర్కపురమా ? బృందావనమా!

❀❀❀

## మాతృశ్రీ అధ్యయన పరిషత్

1973 నుండి నాకు అమ్మసంస్థలతోను అమ్మతోను బంధం అనుబంధంయేర్పడింది. అందుకుకారణం లేకపోలేదు.

తమిళనాడు "గుడియాత్తమ్" నుండి చంద్రన్ అనే భక్తుడు అమ్మ దగ్గరకు వస్తూండేవాడు. అమ్మతో చాలా చనువుగా ఉండేవాడు. సరాసరి అమ్మ దగ్గరకు వెళ్ళేవాడు.

అది చూచి అనుకునే వాణ్ణి "నా జీవితంలో ఇటువంటి అవకాశం అదృష్టం నాకు కలుగుతుందా ? అమ్మతో చనువుగా నేను మాట్లాడగలుగుతానా ? అమ్మ అవ్యాజకరుణకు పాత్రుణ్ణి కాగలుగుతానా అని. నా తపన ఫలితంగా అధ్యయనపరిషత్‌కు అమ్మే శ్రీకారం చుట్టారు.

అది 1973 జనవరి 13వ తేది. ఆ రోజు " భోగి " పండుగ. ఏలూరు నుండి వెళ్ళిన ముగ్గురము అమ్మ సన్నిధిలో ఉన్నాము. ఆ రోజున అమ్మ "మాతృశ్రీ అధ్యయన పరిషత్" ఏలూరు శాఖకు తానే శ్రీకారం చుట్టింది. మాలో గుత్తా సుబ్బారావుగారిని అధ్యక్షుడుగా, గుడివాక నమశ్శివయ్య గారిని ఉపాధ్యక్షుడుగా నన్ను కార్యదర్శిగా నియమించి తిలకందిద్ది ఆశీర్వదించింది. మా ఆనందానికి అవధులు లేవు.

పదిమందితో కలసి పనిచెయ్యి - పది మందికోసం పనిచెయ్యి అన్న అమ్మ మాటను ఆదర్శంగా తీసుకొని స్వర్ణోత్సవాల కార్యక్రమానికి నడుంబిగించాము. పశ్చిమగోదావరి జిల్లా నుండి రెండు లారీల బియ్యం ఒక లారీ బియ్యానికి సరిపడ ధనము పంపించగలిగాము. ఏప్రియల్ 12,13 తేదీలలో స్వర్ణోత్సవాలలో భాగస్వాములమయ్యే అదృష్టం అమ్మ అనుగ్రహించింది. అప్పటి నుండి సంస్థకు నాకు అనుబంధం బలపడింది. అనేక విధాలుగా సేవలందించడం జరిగినది.

తరువాత 1973-75 మరల 82-84 సంవత్సరాలలో మాతృశ్రీ ఓరియంటల్ కళాశాలకు ఉపాధ్యక్ష పదవిలో ఉండి కళాశాలకు కూడా ఏలూరు అధ్యయన పరిషత్ శాఖ తరపున సేవ లందిచడం జరిగినది. నేను అమ్మకు కూడా దగ్గరయ్యాను.

1985లో అమ్మ దేహంచాలించిన తరువాత కళాశాలకు గుత్తా సుబ్బారావుగారు అధ్యక్షులు గాను బొప్పూడి రామబ్రహ్మము గారు ఉపాధ్యక్షులుగాను కొండముది రామకృష్ణ గారు కార్యదర్శి గాను వల్లభనేని కృష్ణాజీరావుగారు వైస్‌ప్రెసిడెంట్ గానూ, నేను సహకార్యదర్శిగాను కళాశాల బాధ్యతలను చేపట్టి 89 మే 4 వరకు పై పదవులలో ఉండి కళాశాల నూతన భవనాన్ని నిర్మించడము జరిగింది. ఈ విధంగా అమ్మ అనురాగానికి పాత్రుణ్ణి కావడమే కాక అమ్మ సంస్థ సేవాయజ్ఞంలో నేనూ ఒక సమిధనయ్యాననే ఆనందం నిలిచింది. జీవితంలో ఇంతకంటే కావలసిన దేమున్నది.

**కమిటెడ్ మెంబర్లు కావాలి గాని**

**కమిటి మెంబర్లు కాదు.**

❀❀❀

## ఆనందోత్సవం - అమ్మ స్వర్ణోత్సవం

అమ్మకు ఏభై వసంతాలు పూర్తి అయిన సందర్భంగా 1973 ఏప్రియల్ 12వ తేదీన అమ్మ స్వర్ణోత్సవ వేడుకలు కన్నుల పండుగగా జరిగాయి.

లక్షమంది ఒకే సారి కూర్చుని భోజనం చేస్తూ ఉంటే చూడాలనే అమ్మ కోరిక ఫలితమే స్వర్ణోత్సవ వేడుకలు.

లక్షమంది భోజనాలు కాదు లక్షమంది ఒకే సారి భోజనాలు అంటే సామాన్యమా ? మానవ మాత్రులకు సాధ్యమా? ఎంతమంది కార్యకర్తలు కావాలి? ఎంత వంటసామాగ్రి కావాలి ? ఎన్ని పందిళ్ళు వేయ్యాలి ఊహకందని విషయం. ఏమైతేనేం అమ్మ సంకల్పం జరిగి తీరుతుందనే విశ్వాసంతో విశ్వజననీ పరిషత్ కార్యరంగంలో ప్రవేశించింది. వివిధ ప్రాంతాలలో ఉన్న అమ్మ బిడ్డలెందరో ఈ కార్యక్రమానికి నడుం బిగించారు. 60 ఎకరాలలో చలువ పందిళ్ళు షామియానాలు వేయబడ్డాయి. పదార్థాలు సమకూర్చే ప్రయత్నాలు కొనసాగాయి. 13 వంటశాలల నిర్మాణం జరిగింది. ఒక్కొక్క వంటశాలలో "8000" మంది ఒకేసారి భోజనాలు చేయడానికి తగిన ఏర్పాట్లు చేయబడ్డాయి. ఏలూరు శాఖకు రెండు వంటశాలలు కేటాయింపబడ్డాయి. ఒకటి నాకు మరొకటి గుడివాక నమశ్శివయ్య గారికి.

11 గంటల వరకు జనం పెద్దగా రాకపోతే గోపాలన్నయ్య అమ్మ దగ్గకు వెళ్ళి చేసిన పదార్థాలు మిగులుతాయంటే అమ్మ వస్తారులే అంది. పదకొండున్నర గంటలకు లక్షజనాభా దాటింది. క్షణక్షణం జనం పెరుగుతున్నారు. కార్లలో, బస్సుల్లో, ట్రాక్టర్లలో, మోటారు సైకిళ్ళపై, సైకిళ్ళపై, యెడ్లబండ్లపై ఎవరి అవకాశం కొద్దీ వారు వస్తున్నారు. ఈ జనాన్ని చూచి కె.బి.జి. గోపాలకృష్ణ అన్నయ్య గారు అమ్మను సమీపించి " అమ్మా ! జనం విశేషంగా వస్తున్నారు. బాపట్ల నుండి మరొక లారీ బియ్యం తెప్పించమంటావా ?" అని అడిగారట. అమ్మ చిరునవ్వుతో " జనాన్ని చూచి సరుకులు తెప్పించడం మొదలు పెడితే మీరేమి ఉత్సవం చేయగలరు ? ఏమీ అవసరం లేదు. నేను స్నానం చేసి బయలుదేరి పందిళ్ళలోకి వస్తాను మీరు ఆప్రయత్నం చూడండి. బాపట్ల పోనవసరంలేదు." అన్నదట అమ్మ.

ఇంక మా వంటశాలలో విషయం . గం. 2-30 ని.లకు 2000 మందికి వడ్డన అయ్యేసరికి అన్నపురాశి సగం అయిపోయింది. పప్పూ, పులుసూ అంతే. నాకు ఆందోళన. ఇంకా 6000 మందికి వడ్డించాలి పదార్థాలు చాలేటట్లు లేవు. దిక్కుతోచలేదు. ఆర్తితో రెండు చేతులెత్తి అమ్మకు నమస్కరించాను.

వడ్డనకు ముందే అమ్మ సరిగా గం. 12-30 ని.లకు సర్వాలంకార శోభితమై జీపులో పందిళ్ళ మధ్య ఏర్పాటు చేసిన విశాల మార్గం నుండి ప్రతి వంటశాల వద్ద జీపునుండే అమ్మ అన్నపురాశులమీద, పదార్థాలపైన దృష్టి ప్రసారం జేశారు. అన్నపురాశులకు , అమ్మకు మేము హారతులు యిచ్చాము. అమ్మ ఒక సందర్భంలో ఇలా అన్నారు

" ప్రసారం చేసిందే ప్రసాదమని ". మేము వడ్డన కొనసాగిస్తున్నాము. అన్నపు రాశి తరగలా పప్పు, పులుసు అంతే. 8000 మంది భోజనం చేసిన తరువాత కూడా అలాగే ఉన్నాయి. మళ్ళీ పంక్తి 4 వేలు కూర్చున్నారు. అయినా పదార్థాలు రవ్వంత తగ్గలా. రాత్రి 9 గంటలవరకు వడ్డిస్తూనే ఉన్నాము. పదార్థాలు అలాగే ఉన్నాయి. మా ఒక్క విభాగంలోనే కాదు అన్నిచోట్లా అంతేనట. అమ్మ దృష్టి ప్రసారం జేసినకారణంగానే పదార్థాలు తరగలేదనేది నా ప్రత్యక్షానుభవము. మరునాడు 13వ తేదీకూడా ఆ పదార్థాలే చాలామంది భోజనం చేశారు. అన్నం వేడి తగ్గలా. పప్పూ వాసన రాలేదు. పులుసు వేడి తగ్గలేదు. అప్పటికి లక్షకుపైగా భోజనాలు చేశారు. మిగిలి ఉన్న పదార్థాలను అమ్మ ఆదేశానుసారం చేలల్లోను నీళల్లోను వెదజల్లాము. క్రిమికీటకాలూ జలచరాలు కూడా అమ్మ సంతానమేగదా.



# అమ్మ ఏలూరు పర్యటన

1973 నవంబరు 3వ తేది అర్ధరాత్రి 2 గంటలకు ఏలూరు పొలిమేరకు చేరుకున్నారు అమ్మ, అమ్మ పరివారం.

అప్పటికే ఏలూరు మాతృశ్రీఅధ్యయన పరిషత్ అధ్యక్షులు గుత్తా సుబ్బారావుగారు. ఉపాధ్యక్షులు గుడివాక నమశ్శివయ్య గారు, కార్యదర్శిగా ఉన్న నేను, వి.కృష్ణాజీరావుగారు, ఎ.ఐ.ఆర్. ఆర్టిస్టు జయలక్ష్మిగారి బృందం అమ్మ రాకకై ఎదురుచూస్తున్నాము.

అమ్మకు అంజలి ఘటించి స్వాగతం పలుకుతూ అమ్మ కారుకు ముందుగా ఉన్న ఒక జీపులో ఆసీనులై సాగిరావమ్మ స్వాగతం అంటూ ఒక గీతికను శ్రావ్యంగా ఆలపిస్తూ అమ్మ విడిదికి ముఖద్వారమైన రైస్‌మిల్లుల సందు వద్దకు చేరాము.

ఆ వీధి అంతా నీళ్లు చల్లి ముగ్గులు పెట్టారు. మామిడి తోరణాలు కట్టారు. ఇరుప్రక్కల అరటి మొక్కలతోను కొబ్బరి మట్టలతోను అలంకరించారు. విద్యుద్దీపాలతో వీధి అంతా శోభాయమానంగా ఉంది. అర్ధరాత్రి మూడు గంటలయింది. అయినా పదివేలమంది దాకా అమ్మ నామం చేస్తూ అమ్మ రాకకై నిరీక్షిస్తున్నారు.

అమ్మరానేవచ్చింది. వీధి అంతా అమ్మ నామంతో ప్రతిధ్వనిస్తుంది. ఆనందోత్సాహాలతో భక్తి శ్రద్ధలతో అమ్మకు స్వాగతం పలికారు.

అమ్మ విడిదికై ఏర్పాటు చేసిన పచ్చిపులుసు రంగయ్య గారి ఇంటికి సమీపిస్తుండగా వేదమంత్రాలతో పూర్ణకుంభంతో వేదపండితులు ఎదురేగి స్వాగతం పలుకగా అక్కడ ఉన్నవారందరికి అమ్మ దర్శనం ఇచ్చి విడిది గృహంలో ప్రవేశించారు.మరునాడు 4-11-1973న ఉదయం నుండి మధ్యాహ్నం వరకు అనేక మంది పురప్రముఖులేకాక పరిసరప్రాంతాలవారు ఎంతో మంది షుమారు 30వేల మంది దాకా అమ్మ దర్శనం చేసుకొన్నారు.

❁❁❁

**పత్రికా విలేకరులతో అమ్మ :**

మధ్యాహ్నం 2 గంటలకు పత్రికా విలేకరులు వచ్చారు. వారు అనేక సందేహాలను వెలిబుచ్చగా అమ్మ సందేశాత్మకమైన సమాధానాలిచ్చారు.

మీ ఈ పర్యటన ఎందుకమ్మా ? అన్న ప్రశ్నకు " పిల్లలను చూడాలనిపించి రావడమే" అన్నది. "మీరు భారతీయులకు మాత్రమే తల్లియా అన్న ప్రశ్నకు "అందరికి అన్నింటికి . . .పశుపక్ష్యాదులకు కూడాను" అన్నది. తరించడానికి సులభమైన మార్గం ఏమిటమ్మా! అన్న ప్రశ్నకు " సంసారమే" అన్నది అమ్మ. " మరి గురువును ఆశ్రయించవలదా". అంటే "సంసారమే గురువు" అని నిర్ద్వంద్వంగా సమాధానమిచ్చింది. "దైవం ఉన్నాడని కొందరు లేదని కొందరు అంటున్నారు గదా ఈ ఆలోచనలు కలిగిస్తున్నది ఎవరు ? అని అడిగితే " అన్నీ వాడు చేస్తున్నవే సమస్తమూ వాడే" అన్నది. మరో ప్రశ్నకు సమాధానంగా అమ్మ " సంకల్పమే భగవంతుడు నాన్నా". అని సెలవిచ్చారు. " వేలాదిమంది మీ దర్శనం చేసుకోవడానికి కారణమేమిటి ? అంటే " అమ్మను బిడ్డలు చూడడంలో ప్రత్యేకమైన కారణమేముంటుంది". అన్నది.

పత్రికా విలేఖరులు అమ్మకు నమస్కరించి వెళ్ళిన తరువాత సాయంకాలము గం. 4-45 ని.లకు వేలాదిమంది వెంటరాగా సి.ఆర్.ఆర్. కాలేజ్‌కి బయలుదేరారు. అప్పటికే అక్కడ లక్షమందికి మించి అమ్మ దర్శనం కోసం వేచి ఉన్నారు. అమ్మను చూస్తున్నటువంటి వారిలో ఎంతో ఆర్తికనిపించింది. ఆనందము కనిపించింది. అమ్మ కన్నుల నుండి జాలువారే కరుణారసదృక్కులతో తడిసిపోయారు ఆప్రాంగణంలోని భక్త జనమంతా.

❀❀❀

# నా ఇల్లు పునీతమైనరోజు

నా జీవితంలో మరువలేని మరుపురాని మహాపర్వదినం అది. అదే అమ్మపావన పాదస్పర్శతో మాగృహాన్ని పావనం చేసిన రోజు.

4-11-1973 రాత్రి 8 గంటలకు కార్యకర్తల, భక్తుల కోరికపై అమ్మవారి వారిఇండ్లకు బయలుదేరారు. అప్పటికి నాకున్న ఆర్థిక పరిస్థితులలో ఒక చిన్న ఇంట్లో అద్దెకు ఉంటున్నాను. చాలా చిన్నగదులు, కొద్దిపాటి ఖాళీస్థలం. ఆ ఖాళీ స్థలానికి ఎదురుగా మరుగుదొడ్డి. దానికి తలుపు లేదు. అదీ మా ఇంటి పరిస్థితి. అందువలన నేను అమ్మను ఆహ్వానించలేకపోయాను. అమ్మను ఆహ్వానించలేకపోయిన నా దురదృష్టానికి నాలో నేను బాధపడుతూ నాకూ ఒక విశాలమైన ఇల్లు ఉంటే నేను కూడా అమ్మను ఆహ్వానించేవాడినిగదా! అమ్మ పావన పాదస్పర్శతో మా ఇల్లు కూడా పునీతమయ్యేదిగదా! పోని రమ్మని ఆహ్వానించుదామంటే ఎలా ? మంచం వేసికూర్చోపెట్టటానికి కూడా సరిపోని గదులే! పోనీ దొడ్లో అయితేనో ! ఎదురుగా మరుగు దొడ్డి. మనసులో దుఃఖం పెల్లుబికి వచ్చింది.

అమ్మకు నా బాధ తెలియదా ! ఎందుకు తెలియదు ? ఇలా నాలోనేను అనుకుంటూ ఉండగా అమ్మ నన్ను చూచి " నేను మీ ఇంటికి వస్తున్నాను నాన్నా!" అన్నది.

ఆ మాట నా చెవిని పడగానే నా ఆనందానికి హద్దులులేవు " అమ్మా! మాది అద్దెఇల్లు" అన్నాను. అందుకు అమ్మ " నీవు ఎక్కడ ఉంటే అదే నీ ఇల్లు నాన్నా" ! అన్నది.

క్షణాలమీద ఇంటికి బయలుదేరాను. ఇల్లంతా శుభ్రం చేశాం. పెరటిలో మంచం వేశాం. దానిపై కొత్త దుప్పటి వేశాం. మరుగుదొడ్డికి పట్టాకట్టాం. రాత్రి 11 గంటలకు అమ్మ రానే వచ్చారు. అమ్మ రాకను చూచి భక్తజనసందోహం చేసిన జయజయ ధ్వానాలతో వీధి మార్మోగిపోయింది. అమ్మ లోనికి వచ్చి విశ్రాంతిగా మంచంమీద పండుకొని నిర్మలంగాఉన్న ఆకాశాన్ని చూస్తుంది. ప్రకృతి ప్రశాంతంగా ఉంది. పిండారబోసినట్లు వెన్నెల. షోడశకలాప్రపూర్ణుడైన చంద్రుడు చల్లని తన కిరణాలతో అమ్మను స్పృశించి, బడలి ఉన్న అమ్మను సేద తీర్చాడని పించింది. అప్పటి ప్రకృతి సౌందర్యానికి ఆనందపడుతూ నా వంక తిరిగి చూచి, "చాలా హాయిగా ఉంది నాన్నా అంటూ కొద్ది సమయం విశ్రాంతి తీసుకున్నారు. అపుడు

నా కనిపించింది ఇల్లు చిన్నదైనందువల్లగదా పెరటిలో మంచంవేసింది అమ్మ విశ్రాంతి తీసికొంది అని ఆనందపడ్డాను. అమ్మకు పట్టుచీరపెట్టుకొని పూజించుకొన్నాం. అక్కడే అమ్మ ఆ పట్టుచీర కట్టుకొని మాకు చూపించితే మా అదృష్టానికి మురిసిపోయాం.

తరువాత కొద్దికాలానికే ఆర్థికంగా స్థిరపడి ఒక భవనాన్ని కూడా నిర్మించుకోగలిగాముఅమ్మదయవల్ల.

## పారిశుధ్య పనివారల కాలనీ

దీ. 5-11-1973 పారిశుధ్య పనివారి కాలనీకి అమ్మ వస్తునట్లు వార్త తెలిసింది. వారి ఆనందానికి అవధులులేవు. క్షణాల్లో వీధి అంతా శుభ్రం చేసుకున్నారు. అమ్మకు నివేదన చేయటానికి పులిహోర మొదలైన పదార్థాలను తయారు చేసిపెట్టుకున్నారు కొందరు.

అమ్మ కాలనీ ప్రాంతానికి రాగానే వారు ఎదురుగా వచ్చి ముకుళిత హస్తాలతో స్వాగతం పలికారు. ఒకామె ఆనంద బాష్పాలతో మెడలో హారం వేసింది. ఆబాలగోపాలం అందరు ఇండ్లలో నుండి వెలుపలికి వచ్చారు. వృద్ధులు బాలురు స్త్రీలు వారు వీరు అనే భేదభావనే లేదు. అందరి నేత్రాలలో అశ్రువులు. ఆపేద ప్రజలు అమ్మను కౌగిలించుకున్నారు. అమ్మ వారిని హృదయానికి హత్తుకుంది. ఇది ఎన్ని జన్మల బంధమో అనిపించింది చూచేవారికి. ఆ వీధి వీధంతా అమ్మతన అనుగ్రహదృక్కులను ప్రసరింపచేస్తూ సంచరించింది.

అటు తరువాత ప్రక్కనే ఉన్న మేదరకాలనీకి వెళ్ళింది. అక్కడ వారు కూడా పరుగుపరుగున వచ్చి అమ్మ పాదాలపై వ్రాలారు. ప్రేమార్ద్రహృదయంతో అమ్మవారిని లేవనెత్తింది. మాతృతత్వం అంటేయేమిటో వారికి అవగాహన అయింది.

**“ గుడులకే కాదు నాన్నా! గుడిశలకూ వెళదాం”**

అన్న అమ్మ మాటకు ఇది ప్రత్యక్ష నిదర్శనమేగదా !

❀❀❀

# వాత్సల్య జలధి

అది ఒక విశాలమైన ఆవరణ. బారులు తీరిన కొబ్బరి చెట్లతో చాలా అందంగా ఉన్నది. అది ఏలూరుకు సమీపగ్రామమైన శనివారపుపేటలోని బాలనేరస్తులకు శిక్షణ ఇచ్చే ప్రభుత్వ బాలుర ధ్రువీకరణ పాఠశాల. తెలిసీ తెలియని వయస్సులో ఏవో నేరాలకు పాల్పడిన పిల్లలను సంస్కరించే పాఠశాల అది. అందులో 10 నుండి 14 ఏళ్లవయస్సులో ఉన్న పిల్లలు 359 మంది ఉన్నారు. వాళ్ళలో సత్ప్రవర్తన కల్గించటానికి ప్రయత్నించడమే కాక వాళ్లు పెరిగి పెద్దయిన తరువాత బ్రతుకు తెరువుకు అవసరమయిన కుట్టుపని తోటపని మొదలయిన పనులను నేర్పుతూ శిక్షణ ఇస్తున్నారు.

ప్రభుత్వ వైద్యులు డా॥ అమలేశ్వరరావు గారి ఆహ్వానంపై అమ్మ అక్కడకు వెళ్లింది. అమ్మతోపాటు మేమందరం కూడ వెళ్ళాము. అమ్మ ప్రేమలోని కమ్మదనానికి దూరమయి, తల్లికోసం తల్లడిల్లిపోయే ఆపసివాళ్లకు అమ్మను చూడగానే ఒక్కసారి ప్రాణం లేచి వచ్చినట్లయింది. అమ్మ దగ్గరకు వచ్చి అమ్మఒడిలో చేరాలని, అమ్మ స్పర్శలోని మాధుర్యాన్ని అనుభవించాలని ఆపసి హృదయాలకు అన్పించినా ఆ పాఠశాల క్రమశిక్షణను ఉల్లంఘించినట్లవుతుందని ఆపని చేయలేకపోయారు. వాళ్ళ స్థితిని గమనించిన అమ్మ ఆప్యాయత అనురాగం పొంగులు వారుతుండగా తానే వాళ్ళ దగ్గరకు వెళ్లింది. తల్లిదండ్రుల నీడలో అల్లారు ముద్దుగా పెరగవలసిన ఆపసివాళ్లను చూసి అమ్మ హృదయం కరిగిపోయింది. వాళ్ళను చూచి చలించి పోయిన అమ్మ కంటివెంట నీరు వస్తుండగా ఆపుకుంటూ ఎంతో గోముగా వాళ్ళను దగ్గరకు తీసుకొని ప్రేమతో వాళ్ళ తలలు నిమిరి " నాన్నా అమ్మను చూడాలని ఉందా" అని గద్గదకంఠంతో అడిగింది. వాత్సల్యపూరితమైన అమ్మమాట విని పిల్లలందరూ ఒక్కసారిగా బావురమని ఏడ్చేశారు. అక్కడే ఉండి ఆ సన్నివేశాన్ని చూస్తూఉన్న మా అందరి హృదయాలు ద్రవించిపోయాయి. అమ్మ అమలేశ్వరరావు గారిని పిలిచి వాళ్లకు తల్లీ,తండ్రీ అన్నీ నీవయి జాగ్రత్తగా చూడు నాన్నా! అని చెప్పింది. అమ్మ వాత్సల్యామృతాన్ని చవిచూచిన పెద్దవాళ్ళే అమ్మను వదలి వెళ్లలేరు. మరి ఆ పిల్లలస్థితి చెప్పేదేముంది ? అమ్మను వాళ్లు వదలలేరు . . . . . .

అమ్మ వారిని వదలలేదు . . . . కాని తప్పదుగా ఒకరిద్దరి కన్నీటిని అమ్మ తన పైట చెంగుతో తుడిచి " అమ్మను చూచారుగా" అంటూ వాళ్లను వదల్లేక వదల్లేక ఎంతో భారంగా ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టింది. ఆ దృశ్యాన్ని చూచిన ప్రతివారికీ కంటి వెంట నీరు రాక తప్పదు. ఆనాటి సన్నివేశాన్ని ఇన్నేళ్లతరువాత తలచుకున్నా కూడా అప్రయత్నంగా కన్నులు అశ్రుపూరితాలవుతున్నాయి.

## కొల్లేటి విహార యాత్ర

కొల్లేరు సరస్సు లక్షయెకరాల విస్తీర్ణంగలది. ఇది కృష్ణా పశ్చిమగోదావరి జిల్లాలను కలుపుతూ కొన్ని వేలకుటుంబాలకు జీవనోపాధిని కల్పిస్తున్నది. ఈ సరస్సులో సుమారు 40 లంకలున్నవి. ఎన్నో ఎకరాలు సాగుచేయబడుచున్నవి. అప్పటికి చేపల చెరువులు లేవు. ఎటుచూచినా చూపుకందినంత వరకు సాగరంలా కనిపించేది.

16-11-1973న సాయంకాలం 4 గంటలకు రెండు పడవలలో అమ్మ, అమ్మపరివారము కొల్లేటిలో బయలుదేరాము. ఆ వాతావరణం సహజప్రకృతి సౌందర్యంలో అమ్మతోకలసి చేసిన ఆ కొల్లేటిలో ప్రయాణం మరుపురానిది. మరువరానిదీను. కొల్లేటి వాసులు సజలనేత్రాలతో అమ్మనుదర్శించారు. పాదాభివందనంతో పులకించారు. అమ్మ తనతో తెచ్చిన పండ్లు పులిహోర వారికి పంచారు. వారి ఆనందం వర్ణనాతీతం. ఇంతలో ప్రొద్దుగూకుతున్నది. మరల తిరుగు ప్రయాణమయ్యాం.

ఇది ఒక మధురానుభూతి .



# నేను రామకృష్ణ అన్నయ్య

1971లో నేను రెండవసారి అమ్మను దర్శించటానికి వెళ్లినపుడు రామకృష్ణ అన్నయ్యతో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం 1973 నాటికి అనుబంధంగా మారింది. నేను ఆయనను పెద్ద అన్నయ్యగా భావించేవాడిని అన్నయ్య అవకాశంవచ్చినప్పుడల్లా అమ్మతత్త్వాన్ని నాకు నూరిపోసేవాడు. అవి బాగా వంటపట్టడానికి అన్నయ్య మూలకారణం.

ఒక రోజు గాయత్రి భవన్ నిర్మాణాన్ని గురించి అన్నయ్యకు అమ్మకు సంభాషణ జరుగుతుంది. అమ్మ రెండస్థుల భవనానికి తగినట్లుగా పునాదులు వెయ్యమన్నది. సంస్థ యొక్క ఆర్థిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని అన్నయ్య పూరిపాక నిర్మించటానికి కావాల్సిన పునాదులు వెయ్యాలన్నారు. ఈ లోపుగా ఇంజనీర్లువచ్చారు. అన్నయ్య యింజనీర్లను సంప్రదించేందుకు స్థలం వద్దకు వెళ్లాడు. ఈ లోపుగా అమ్మతో నేను ఇలా అన్నాను. అమ్మా ఇప్పటి వరకు రామకృష్ణ అన్నయ్యను "స్థితప్రజ్ఞుడ"నుకునేవాణ్ణి. నీవుచెప్పేది ఆచరించాలిగాని తన అభిప్రాయం ప్రతిపాదిస్తాడేమిటి అన్నాను నాకున్న అజ్ఞానం వల్ల. అపుడు అమ్మ "వాడి స్థితప్రజ్ఞత్వానికి వచ్చిన లోటేమిటి" అంటూ నామాటమీద విశ్వాసంలేకకాదు "అంతరాంతరాలలో విశ్వాసం ఉన్నా వ్యవహారదశలో అలా అనుకోకపోతే జరగదు" అన్నారు అమ్మ.

ఈ సంభాషణద్వారా స్థితప్రజ్ఞలక్షణమంటే ! కర్తవ్యనిష్ఠగాని-కర్తృత్వనిష్ఠ కాదని అర్థమైంది నాకు. (కర్తృత్వనిష్ట అంటే - నేనే కర్తను-నేనే భోక్తను అనేభావన)

అన్నయ్య క్రమక్రమంగా పూర్తి శరణాగతిపొంది

' నీ సేవలోనే నా బ్రతుకు సాగనీ

నీ ధ్యాసలోనే నా శ్వాస ఆగనీ' . . .

అంటూ తన జీవితాశయాన్ని పాటగా వ్రాసుకున్నాడు. ఇది నాకు ఉపదేశవాక్యమైంది.



## నక్సలైట్లూ నా బిడ్డలే

30-12-75 ఏలూరు నుండి పోకూరి అన్నపూర్ణమ్మ దమ్మాల సీతారత్నంగార్లు అమ్మ దర్శనం కోసం జిల్లెళ్ళమూడి వెళ్ళారు. ఆరోజు రాత్రి వల్లూరి జగన్నాథరావుగారి కుటుంబం అమ్మ వ్రతం చేసుకుంటున్నారు. ఎందుకో తెలియదుగానీ అమ్మ వ్రతం త్వరగా పూర్తి చేయించి హారతి ఇప్పించింది. నాన్న గార్ని రోజూ పడుకొనే చోట కాక వేరొకచోట పడుకొనమని సూచన చేసింది. రామకృష్ణ అన్నయ్య అంతకుపూర్వమే అప్పికట్ల వెళ్ళాడు.

అర్ధరాత్రి అయినది. బాంబుల మోత "అమ్మలూ - బాబాలూ నశించాలి" అంటూ నేలమీద పొగబాంబులను కొడుతూ ఆశ్రమవాసులను భయభ్రాంతులను చేశారు నక్సలైట్లు. ఈ లోపుగా అక్కడ ఉన్న ఏలూరు అక్కయ్యలిద్దరూ ప్రాణభయంతో ఆఫీసుప్రక్కన ఉన్న గదిలో ప్రవేశించారు. ఆగది తలుపులకు గడియలేదు కిటికీకి రెక్కలూ లేవు. వారి వంటి నిండా బంగారం ఉంది. ప్రాణాలరచేత పట్టుకుని తలుపులు నెట్టినా రాకుండా ఉండటానికి వాటికి ఆనుకొని కూర్చున్నారు. దుండగులు టార్చిలైటు వేసి కిటికీలోనుండి చూశారు. ఎవ్వరూ కనుపించలేదు "లోపల ఎవ్వరూ లేరు పదండి ముందుకు" అంటూ అమ్మగదివైపుకు వెళ్ళారు. తలుపు పగలగొట్టడం ప్రారంభించారు. ఈ లోపుగా అమ్మను రక్షించడానికి ఆగదిలో ఉన్న అమ్మను ప్రక్కన ఉన్న మరొక గదిలోనికి అలా ఒకటి రెండు గదులు దాటించి ఒక్కొక్క గదికి తలుపు గడియలు వేశారు ప్రాణత్యాగానికైనా సిద్ధపడి అమ్మకు రక్షణ కవచంగా నిలబడి ఆగదిలో నిలిచాడు గోపాల్ అన్నయ్య. దుండగులు తలుపులు బ్రద్దలు కొట్టి గదిలోనికి ప్రవేశించి బూతులు తిడుతూ గోపాలన్నయ్య చొక్కా పట్టుకొని గుమ్మం బయటకు లాక్కొచ్చి

కూర్చోబెట్టారు. అమ్మ ఎక్కడుందీ అనీ ప్రశ్నవేశారు. తెలియదని గోపాల్ అన్నయ్య సమాధానం. ఈ సమాధానానికి ఆగ్రహం చెందిన వారి నాయకుడు. నూరు పోట్లు పొడవండి రా వాడిని అంటూ కేకవేశాడు. చుట్టూ ఉన్న షుమారు పదిమంది ఆయుధాలుపైకెత్తారు. ఈ మాటలు అమ్మకు వినిపించాయి. ఆగలేకపోయింది. పరుగెత్తుకు రావడానికి సిద్ధమయ్యింది కానీ చుట్టూ ఉన్న శేషక్కయ్యా మొదలైనవారు అమ్మ పాదాలు పట్టుకొని వారించారు ఈ లోపుగా.

దుండగులు గోపాల్ అన్నయ్య గుండెలకు గురిపెట్టి బరిసె విసిరారు. అన్నయ్య తన చేతిని అడ్డుపెట్టాడు. ఆచేతికి అమ్మ ఉంగరం ఉంది. చేతిని రాసుకుంటూ బరిసె దూసుకుపోయింది. వారి దృష్టి ఉంగరంమీద పడింది. వారి చేతిలో ఉన్న ఆయుధాలు క్రిందకు దింపి గోపాల్ అన్నయ్య చేతికున్న ఉంగరాన్ని అడిగారు. ఉంగరం తీసిచ్చేలోపు అక్కడే ఉన్న బీరువా పగులకొట్టి అందులో ఉన్న సొమ్మును దోచుకున్నారు. కొందరు హైమాలయానికి వెళ్ళి అక్కడున్న నగలను దోచుకున్నారు. ఇంతలో వారి నాయకుడి దగ్గరనుండి టైమైపోయింది బయలుదేరమని విజిల్ వచ్చింది. నినాదాలు చేసుకుంటూ వారక్కడ నుండి వెళ్ళిపోయరు.

నక్సలైట్లు వెళ్ళిపోగానే గోపాల్ అన్నయ్య తలుపులు తీసికొని పరుగుపరుగున అమ్మ సన్నిధికి వెళ్ళి "అమ్మా బీరువాలో ఉన్నదంతా దోచుకుపోయారు" అన్నాడు. అపుడు అమ్మ "సొమ్ము పోతేపోయింది బిడ్డ దక్కాడు నాన్నా! అంటూ, " కొందరు పిల్లలు అడిగి తీసుకుంటారు కొందరు బెదిరించి తీసుకొంటారు. వీళ్ళు ఆ రెండో కోవకు చెందినవాళ్ళు నాన్నా. వాళ్ళూ నా బిడ్డలే" నాన్నా ! " అన్నది.

# అమ్మసన్నిధిలో ఆబ్దికాలు

1973వ సంవత్సరం నుండి అమ్మతో బాగా చనువు ఏర్పడింది నాకు. మా ఇంట్లో ఏ పుణ్యకార్యం చేసినా అమ్మ సన్నిధిలో చేయువలసిందే. భౌతికవిషయములలోను ఆధ్యాత్మిక విషయములలోను అమ్మతో చెప్పకుండా ఏపని చేసేవాడిని కాదు. అమ్మకూడా అలాగే సలహా ఇచ్చేది. ఎక్కడికన్నా వెళ్లవలసివచ్చినా తీర్ధయాత్రలకు వెళ్ళినా అమ్మతో చెప్పకుండా వెళ్ళేవాడిని కాదు. ఆ చనువుతో ఈ సారి మా నాన్నగారి ఆబ్దికం నీ దగ్గరే పెట్టుకుంటానమ్మా మార్చి 29వ తారీఖు అన్నాను. అది 1975వ సంవత్సరం అమ్మ సరేనన్నారు.

నేను అలా అడగటానికి కారణం లేకపోలేదు. ఒకసారి నేను అమ్మ వద్ద వాత్సల్యాలయంలో కూర్చుని ఉన్నపుడు ఒక సంఘటన జరిగింది. అది ఒక సోదరుని తండ్రిగారి ఆబ్దిక కార్యక్రమము.

ఆ సోదరుడు ముందుగా అమ్మ పాదాలుకడిగి పూజించుకున్నాడు. తరువాత అమ్మ చేతిలో ఆపోశనేశాడు (కాసిన నీళ్ళు వేశాడు).

ఈ లోపుగా ఒక సోదరి అమ్మకు ఎదురుగా ఒక చిన్న టేబుల్‌లాంటిది తెచ్చిపెట్టింది. ఒక పెద్ద పళ్ళెంలో అన్నం తెచ్చిపెట్టారు 3 కూరలు 3పచ్చళ్లు పప్పు పులుసు గారెలు పాయసం ఒక నేతి గిన్నె అన్ని తెచ్చి ఆ టేబుల్ మీద పెట్టారు. ఒక గిన్నెతో పెరుగు కూడ తెచ్చిపెట్టారు.

అమ్మ ఆ పళ్ళెంలోని అన్నంలో పప్పు పులుసూ పిండి వంటలు పెరుగూ అన్నీ కలిపి దానిపైనే నేతిగిన్నెలోని నెయ్యి నంతా కుమ్మరించి కలిపి పెద్దపెద్దముద్దలు చేసి వాటిపై అమ్మదృష్టిని సారించి రెండుమెతుకులు తాను నోట్లోవేసుకొని త్రేన్చింది. తరువాత ఒక ముద్ద ఆబ్దికం పెట్టుకొంటున్న సోదరునికి తరువాత అక్కడున్న వారందరికి ఆ ముద్దలు పెట్టింది, నాకూ పెట్టింది. ఆసోదరుడు నాతో మా నాన్న గారు ఎంత అదృష్టవంతులో అమ్మయే భోక్తగానున్న ఈ ఆబ్దికం వల్ల ఇక మా నాన్న గారికి జన్మలేదుగదండి . అన్నాడు. మామూలుగా అమ్మ రోజు

అన్నంగాని మరి యేయితర ఘనపదార్థంగాని తీసికోదు. ఎవరైనా అమ్మసన్నిధిలో ఆబ్దికం పెట్టుకుంటే తప్ప. నేనుకూడా ఉత్సాహపడి అమ్మా మా నాన్న గారి ఆబ్దికం కూడా నీ దగ్గరే పెట్టుకుంటానమ్మా అన్నాను. అమ్మ సరేనన్నారు. అనుకోకుండా అమ్మ దక్షిణదేశయాత్ర 23-3-1975 నిర్ణయం అయిందన్న విషయం తెలిసి నిరాశా నిస్పృహలకు లోనైన నేను అమ్మ దగ్గరకు వెళ్ళి ఈ నెల 29న మా నాన్న గారి ఆబ్దికంకదా నీదగ్గర పెట్టుకుందామని చాలా ఆశపడ్డానమ్మా అంటూ నా మనస్సులో ని బాధను వ్యక్తంచేశాను.

బాధ ఎందుకునాన్నా! మద్రాసు రా అక్కడే పెట్టుకుందువుగాని అన్నది. నాకు చాలా సంతోషం కలిగింది. అమ్మ, అమ్మ కుటుంబం అంతటికి ఇంజనీరుతాతయ్య గారి కుమార్డు చుండూరు అచ్యుతరామయ్య గారి గృహంలో విడిది మద్రాసు ఆల్వారు పేటలో.

నేను 29వ తేది ఉదయానికే వారింటికి చేరాను. మా నాన్న గారి ఆబ్దికానికి కావలసిన ఏర్పాట్లన్నీ రామకృష్ణ అన్నయ్య వారింట్లో చేశారు.

మధ్యాహ్న సమయం అయింది. అమ్మ కుటుంబపరివారం వసుంధరఅక్కయ్య, నాన్నగారు, సుబ్బారావు, రవి, శేషు, వైదేహి, రామకృష్ణ అన్నయ్య అచ్చుతరామయ్య గారి కుటుంబ పరివారం అందరం అమ్మసన్నిధిలో కూర్చొన్నాం. ఒక టీపాయి అమ్మకెదురుగా తీసికెళ్ళి పెట్టారు. ఒక పళ్లెంలో ఆ రోజు చేసిన పదార్థాలన్నీ వడ్డించారు. ఆబ్దికానికి అమ్మ భోక్తకదా. తన చేతిలో నాచేత కొంచెం నీళ్ళు వేయించుకుని అమ్మ స్వీకరించింది. ఆపదార్థాలన్ని కలిపి భోక్తగా అమ్మ కొంచెం స్వీకరించిది. అక్కడున్న మా అందరికి అమ్మస్వయంగా తన చేతులు మీదుగా పెట్టింది. అమ్మ కుటుంబం అంతా మా నాన్న గారి ఆబ్దికానికి అతిథులు. అమ్మభోక్త. నా పితృ దేవతలు ఎంత అదృష్టవంతులో అని పొంగిపోయాను. అమ్మ కల్పించిన ఈ అవకాశం నన్ను ఆనందపరవశుణ్ణిచేసింది.

మా నాన్నగారి తిథి అమ్మసన్నిధిలో జరుపుకొన్న సంతోషంతో మా అమ్మ తిథికూడా అమ్మసన్నిధిలో జరుపుకుంటే అమ్మే భోక్తగా ఉంటుందిగదా అనే కోరికి కలిగింది. ఒక పర్యాయము నేను అమ్మ దగ్గర ఉన్నప్పుడు ఒక చర్చ జరిగింది. ఏమంటే " ఇతర దేశాలలో మన దేశంలోలాగా ఆబ్దికాలు మొ॥ లేవుగదా! మరి వారి పితృదేవతల సంగతి ఏమిటి" అని. అమ్మ "ఎందుకులేవునాన్నా" వారిది మరొక పద్దతి. ఆరోజు గుర్తుగా వారిని తలచుకొని వారుకూడా శక్త్యానుసారం నలుగురుకు భోజనం పెడతారు గదా అన్న అమ్మ మాటనాకు ఉపదేశమైనది. ఏ చిన్న అవకాశంకుదిరినా ఏదోఒకరకంగా ఎందరికో కొందరికి భోజనం పెట్టించేవాణ్ణి.

మా అమ్మగారి "తిథి" అమ్మసన్నిధిలో జరుపుకోవాలనిగదానాకోరిక. ఆ"తిథికి" అమ్మ జిల్లెళ్ళమూడిలోలేరు. ఐతే నేను అమ్మతోనే టూర్‌లో ఉన్నాను. మా అమ్మ తిథినాడు అమ్మే భోక్త. టూర్‌లో ఉన్నందున వేరే అవకాశం లేక లడ్డూలు నివేదించాలనిపించింది. రెండుకిలోల లడ్డూలు కొనితెస్తున్నా అమ్మకు నివేదన చేయాలి అనే భావంతో. ఇంతలో అమ్మమ్మ కనిపించింది. ఎక్కడకి రా అన్నది. అమ్మదగ్గరకు అన్నాను. ఏమిటా చేతిలోనిది అన్నది. ఇవి లడ్డూలు ఈ రోజు మా అమ్మ ఆబ్దికము. అమ్మకు నివేదనచేయాలని తీసుకెళుతున్నాను అమ్మ ఈ రోజుభోక్త కదా అన్నాను.

వెంటనే అమ్మమ్మ స్పందించి "అసలే అమ్మకు షుగరుగదా ! ఇన్నిలడ్డూలు పెడతావటరా ! అమ్మ తినదనుకుంటావేమో సారం పీల్చిగదరా మనకందిచ్చేది" అన్న అమ్మమ్మభావానికి అశ్చర్యము ఆనందము కలిగినది. ఎంత ఉదాత్తమైన ఆలోచన. ఈ భావన నాకు ఎప్పుడూ రాలేదు. ఐతే ప్రతిరోజు అన్నపూర్ణాలయంలో ఎప్పుడూ జరిగే కార్యక్రమం గురుతుకు వచ్చింది. వంట పూర్తి కాగానే ఒక పళ్ళెంలో పదార్థములన్నీ సర్ది దానిపై ఆకుమూతవేసి అమ్మ దగ్గరకు తీసుకువస్తారు నివేదనకొఅకు. పళ్ళెంమీద ఆకుతీసి అమ్మ ముందుంచేవారు. అమ్మ తనదృష్టిని సారించేవారు. ఆ పదార్థాలలో ఉప్పుకారాలు తక్కువ ఎక్కువ గానున్న చెప్పేవారు. అంటే అమ్మ దృష్టిమాత్రంచేత ఆపదార్థాలను తాను స్వీకరించినట్లేకదా. అమ్మమ్మకున్న భావానికి పొంగిపోయాను. అప్పటివరకు శాస్త్రోక్తంగా చేస్తేనే నివేదన అనుకునే నాకు భావమే ప్రధానమనే భావం దృఢమైనది.

## తోడూ - నీడ :

నవంబరు 1976 వరకు రైసుమిల్లు వ్యాపారంలో ఉన్ననేను భారీ వ్యాపారంలో వచ్చే ఒడిదుడుకులు తట్టుకోలేక ఒక చిన్నపాటి వ్యాపారం అయితే బాగుంటుందనే ఉద్దేశ్యంతో హోల్‌సేల్ వేరుశనగనూనె వ్యాపారం చేద్దామని నిర్ణయానికి వచ్చాను.

కొత్త వ్యాపారం మొదలు పెట్టడం కాబట్టి ఆ వ్యాపారానికి సంబంధించిన పుస్తకాలను అమ్మ చేతిమీదుగా ప్రారంభం చేయించాలని పుస్తకాలను అమ్మ దగ్గరకు తీసుకువచ్చి నీ చేతి మీదుగా ప్రారంభించమ్మా అని ప్రార్ధించాను.

నా చేత్తో ప్రారంభించినా తప్పేదేమున్నది వ్యాపారం అంటేనే లాభనష్టాలు రెండూ ఉంటాయికదా అని అన్నది. అమ్మనే నమ్ముకున్న తరువాత అన్నీ అమ్మేచూసుకుంటుందిలే అనే విశ్వాసంతో అమ్మదగ్గరున్న చనువుతో అమ్మా నేను శరణాగతుడను. లాభమయినా నష్టమయినా నీవు ప్రారంభించకతప్పదు అని పట్టుబట్టేటప్పటికి బిడ్డల కోరిక కాదనలేని అమ్మ ఆపుస్తకాలను తీసుకుని " అంఆ" అనే రెండు అక్షరాలను వ్రాసింది.

ఆ తరువాత ఎంతోకొంత డబ్బుకూడా నీ చేతి మీదుగా ఇవ్వమ్మా అని అడిగాను. నా కోరిక మేరకు అమ్మ 116/- డబ్బుకూడ ఇచ్చింది. ఆ విధంగా మా నూనె వ్యాపారం ప్రారంభం అయింది.

అమ్మ అనుగ్రహంతో ఊహించని రీతిలో వ్యాపారం భారీగా సాగుతోంది. ఆ వ్యాపారం నాకు క్రొత్త. అయినా ఎప్పటికప్పుడు అమ్మ నాకు తోడు-నీడగా ఉందన్న విషయం ప్రస్ఫుటం అవుతూనే ఉన్నది.

కష్టమయినా సుఖమయినా అన్నీ అనుగ్రహం వల్లనేననీ. ఇవ్వబడిన సర్వమూ వరమేనని ఒడిదుడుకులు కూడా "నాఆశీర్వచనమేనాన్నా" అని చెప్పినప్పటికీ ఒడిదుడుకులు వచ్చినపుడు అమ్మ తన బిడ్డలను ఎలాకాపాడుతుందో అందరికీ అనుభవంలో ఉన్నవిషయమే. నా అనుభవంలోనుంచి ఒక సంఘటన వివరిస్తాను.

❀❀❀

# సంస్కరణ

*1978, ఫిబ్రవరి మాతృశ్రీ మాసపత్రిక నుండి*

1978 జనవరి 2వ తేదీ ఉదయం సోదరుడు తూనుగుంట్ల త్రిలోక అప్పారావు మరొక సోదరుని వెంటబెట్టుకుని అమ్మ వద్దకు వచ్చాడు.

ఆ సోదరుని అమ్మకు పరిచయం చేశాడు. పేరు బిఫిన్‌కుమార్ బెహరా. కటక్ వాస్తవ్యుడు. స్మగ్లింగ్‌లో సిద్ధహస్తుడు. వంచనలో ప్రవీణుడు. అతని రూపమే మొరటుదనానికి ప్రతీకగా ఉన్నది. అతని కళ్ళల్లో క్రౌర్యం ఎఱ్ఱటి చారలుకట్టి కనిపిస్తున్నది.

పరిచయం చేయగానే అతడు అమ్మకు నమస్కరించి అతనిలోని దుర్గుణాలను ఏకరువుపెట్టాడు. ఆ సమయంలో అతని రాతి గుండె కరుగుతున్నట్లుగా అతని కళ్ళల్లో చెమ్మ కనుపించింది. అతని స్వరంలో స్పందన వినిపించింది.

"అబద్ధం కూడా ఆడుతావా నాన్నా"? అని ప్రశ్నించింది అమ్మ లాలనగా.

" అదొక్కటే నమ్మా నాలో లేనిది. ఏమి తప్పు చేసినా బహిరంగంగా చెప్పేస్తాను". అన్నాడు వినయంగా.

" ఆ ఒక్కటి చాలు నాన్నా, ఎందరిలోనో లేనిదే అది. నీలో ఉన్నదే అది. నీ వనుకునే అన్ని అవగుణాలు ఆ ఒక్క సుగుణం ముందు మరుగున పడిపోతయ్'.

" నన్ను బాగుచేయమ్మా" అని వేడుకున్నాడతను.

"ఇప్పుడు నువ్వు బాగానే ఉన్నావు నాన్నా. ఇప్పుడే కాదు, ఎప్పుడూ బాగానే ఉన్నావు" అంటూ అమ్మ తన దగ్గర ఉన్న కమలాఫలం ఒలిచి తొనలు అతని నోట్లో పెట్టింది. అతణ్ణి దగ్గరకు పిలిచి అతని వీపు నిమిరింది. ఆస్పర్శలో ఎంత అనురాగం ఉన్నదో. ఎంత లాలన ఉన్నదో ఎంత దివ్యత్వం ఉన్నదో !... అతను విచలితుడయ్యాడు. విభ్రాంతుడయ్యాడు. అనురాగ స్రవంతీమగ్నుడయ్యాడు. ఆనందపరవశుడయ్యాడు.

ఆ అనుభవం అతనికి అపూర్వం. అతనికి పరిచయమున్న లోకమూ మనుషులూ యిందుకు పూర్తిగా భిన్నమయినవారు. కనుకనే ఆ పవిత్ర స్థలమూ అమ్మ ఆప్యాయతా, ఆదరణా అతనికి ఒక వినూతన అనుభవాన్ని ప్రసాదించాయి.

అమ్మను చూస్తూ ఆ మమతామృతాన్ని తనివిదీరా పానం చేస్తూ అమ్మ చేతిలోని పండునే తీసుకుని వణికే తన చేత్తో అమ్మ నోటికి అందించి తినమని ప్రాధేయపడ్డాడు. అమ్మ కాదనకుండా ఆ తొనను చప్పరిస్తూ కరుణ తొణికిసలాడే కనులతో అతణ్ణి చూసింది. అమ్మ పరిపూర్ణ కృపామృత ధారల్లో తడిసిన అతను ఎంత అదృష్టవంతుడో అనుకున్నారక్కడ కూర్చున్న అందరూ.

అతడు అమ్మసన్నిధికి చేరిన ఉదంతం ఆశ్చర్యకరమైనది.

తూనుగుంట్ల త్రిలోక అప్పారావు ఏలూరు వాస్తవ్యుడు. అమ్మసన్నిధికి చిరకాలం నుంచీ వచ్చేవారిలో ఒకడు. అమ్మను పరిపూర్ణంగా విశ్వసించి అనుక్షణం అమ్మనే స్మరిస్తూ ధ్యానించే వ్యక్తి. సర్వంలోనూ అమ్మనే చూట్టానికి ప్రయత్నించే ఉపాసకుడు. జీవితంలోని ప్రతిఘట్టంలోనూ అమ్మసూక్తులను సమన్వయం చేసుకునే సాధకుడు. అమ్మ కటాక్షాన్ని పొందిన భక్తుడు.

అతడు వేరుశనగ నూనె వ్యాపారం చేస్తున్నాడు. 1977 జూన్ 20వ తేదీన ఎమ్మిగనూరులో రూ.70,000/-లకు 40 పీపాల వేరుశనగ నూనె కొనుగోలుచేసి లారీపై ఏలూరుకు ఎగుమతికి ఏర్పాటు చేశాడు.

ఆ లారీ ఎఎటి 2197. దాని స్వంతదారు, డ్రైవరూ కూడా పైన ఉదహరించిన బిపిన్‌కుమార్ బెహరా. అతని ప్రవృత్తి ననుసరించి అతనికి యీ నూనెను దొంగతనం చేసి డబ్బు చేసుకొవాలనే దురాశ కలిగింది. దారిలో విజయవాడ వచ్చి కొబ్బరి కాయలు కొని నూనెపీపాలు కనుపించకుండా కప్పివేసి తిరుపతి వెంకటేశ్వరుని తనను సురక్షితంగా గమ్యస్థానం చేర్చమని మ్రొక్కుకున్నాడు. అతని ప్రార్థన ప్రకారమే అతడు ఏ ఆటంకమూ లేకుండా గమ్యం చేరుకున్నాడు. నూనెను డబ్బు చేసుకున్నాడు.

నిర్ణీతకాలంలో లారీ ఏలూరు చేరకపోయే సరికి అప్పారావుకు అనుమానమూ ఆందోళనా కలిగి వెంటనే ఎమ్మిగనూరు వెళ్ళి - అక్కడ పోలీసు రిపోర్టు యిచ్చాడు.

తిరిగివస్తూ విజయవాడలో నటరాజ్ హోటల్ నుండి అమ్మకు ఫోను చేసి జరిగిన దుర్ఘటనను వివరించాడు.

అతను ఆ వ్యాపారంలో ఒక భాగస్తుడు మాత్రమే అయినప్పటికీ-అతనికి ఉన్న డబ్బునంతా అందులో పెట్టుబడి పెట్టాడు. క్రితం సంవత్సరాల్లో అతనికి రైస్‌మిల్లు వ్యాపారంలో నష్టం వచ్చింది. అతని షాప్‌లో దొంగతనం జరిగి రూ20,000/-లు పోయినయ్. గోరుచుట్టుపై రోకటిపోటుగా యిప్పుడు యీ విషాదోదంతం. అందువల్ల అతని మనస్సు బాగా దెబ్బతిన్నది. అతని మనస్సు పూర్తిగా చంచలం అయింది.

అతని మొరను ఫోనులో విన్న అమ్మ అన్నది. "నాన్నా, అవతల మనిషి ఎంత అవసరంలో ఉండి అట్లా చేశాడో. అదీగాక యిప్పుడు నీకంటే అతడే ఎక్కువ బాధపడుతూ ఉంటాడు".

"మరి, యిప్పుడు నన్ను ఏమి చేయమంటా వమ్మా"

నువ్వు చేసే దేమున్నది ? ఏదో ఒకటి అదే జరుగుతుంది కదా. జరిగేది జరుగుతుంది. చూస్తూ ఉండు.

అమ్మ సలహా విన్న అప్పారావుకు అమితమైన బాధతోపాటు కోపం కూడా వచ్చింది. తాను ఇన్నేళ్ళుగా అమ్మనే నమ్మి కొలిచి నందుకు ఇదా ఫలితం! ఇదా సమాధానం? జరగవలసినదేదో జరగక తప్పనప్పుడు, జరిగేది చూస్తుండవలసినప్పుడు ఇక ఈ దేవుళ్ళెందుకు? ఈ పూజలెందుకు? ఈ ప్రార్ధన లెందుకు ? అయినా, తాను ఇంత బాధలో జ్వలిస్తూ తెలియజేస్తే తన సంగతి ఆలోచించడం, తనకు సానుభూతి అందజేయడం లేకపోగా, పైగా తనను మోసం చేసిన వ్యక్తి కష్టాల గురించి సానుభూతి కనపరుస్తూ అతనిపై కరుణను క్రుమ్మరించడం అప్పారావుకు విస్మయాన్ని కలుగజేసింది. అయినా అమ్మను ఏమనగలడు?

"అమ్మా- నేనీ బాధను, నష్టాన్నీ, తట్టుకునే శక్తి నయినా ప్రసాదించు" అని వేడుకున్నాడు.

"నేను ప్రసాదించేది ఏముంది నాన్నా. ఆ శక్తినీలోనే ఉన్నది " అన్నది. అమ్మ

విచిత్రమేమిటంటే - ఆ క్షణం వరకూ ఆందోళనతో అలమటించిపోతున్న తనలో ఆ క్షణంనుండీ ఒక విధమయిన స్థిమితం ఏర్పడిందీ - అంటాడు అప్పారావు.

సరే నమ్మా నేనెట్లాగో సర్దుకుంటాను. మా ఆవిడకు ఏలూరు ఫోనుచేసి కొంచెం ధైర్యం చెప్పమ్మా" అని బతిమిలాడుకున్నాడు. ఏలూరురో అతని భార్య గుండె నిబ్బరం కోల్పోయి కుప్పకూలిపోయింది. దిగులుతో నిద్రాహారాలు మరచిపోయింది.

అమ్మ వెంటనే ఏలూరు ఫోను చేసింది. నీ బాధ్యతలు నావి అని ధైర్యాన్ని ప్రసారం చేసింది. " నువ్వేమి భయపడొద్దు. నేను ఉన్నాను. అన్నీ నేను చూసుకుంటాను" అని.

ఆ వాక్కూ హామీ విన్నప్పటి నుంచీ అమెలోకూడా ఆందోళన తగ్గిందట.

అప్పటి నుంచీ అమ్మ దివ్యశక్తి యీ విషయంలో పనిచేయనారంభించిందని అప్పారావు అభిప్రాయం. ఎందుకంటే బెహరా కథనం ప్రకారం అతను లోగడ ఎన్ని దొంగతనాల చేసినప్పటికీ, ఎంత పెద్ద మొత్తాలు హరించినప్పటికీ అతనిలో మున్నెన్నడూనూ కలుగని కొన్ని అపూర్వమయిన భావసంచలనాలు ప్రారంభ మయినాయట. అనిర్వచనీయమూ, అదృశ్యమూ అయిన ఏదో దివ్యశక్తి ఒకటి తనను వెంటాడు తున్నట్లు అనుభూతి కలిగేదట.

తత్ఫలితంగా జులై 12 తేదీన విజయవాడ వచ్చి తన తప్పును ఒప్పుకుని, తాను కాజేసిన డబ్బుకుగానూ తన లారీని అప్పారావుకు యిస్తానని వాగ్దానం చేశాడు. తనను తన తమ్మునిగా భావించి, కేసు లేకుండా కాపాడమన్నాడు. అతనికి

కొద్దికాలం క్రితమే వివాహమయిందట. కానీ ఈ వ్యసనాలకులోనై భార్యతో ఎక్కువకాలం గడపలేదట. భార్యకూ, సంసారానికి తాను దూరమై పోతాననే భావం ఏర్పడినప్పుడుగానీ అతనికి దాని విలువ అర్థం కాలేదు.

ఈ జాలి గాథ వినేసరికి అప్పారావులో అనురాగం పొంగిపొరలింది. తన తమ్ముడే ఏదయినా తప్పుచేస్తే, అతణ్ణి తాను పోలీసులకు అప్పచెబుతాడా, కటకటాల వెనక్కు పంపుతాడా ? వెంటనే అప్పారావుకు, అమ్మతో తాను ఫోనులో మాట్లాడినప్పుడు అమ్మ పలికిన పలుకులు స్మరణకు వచ్చినయ్. అమ్మ అతనిపై అపారమైన ప్రేమనూ కరుణనూ కనుపరిచింది.

మరి, అమ్మకు అందరూ బిడ్డలే కదా. మంచివాడూ బిడ్డే, చెడ్డవాడూ బిడ్డే. దొంగా బిడ్డే, దొరా బిడ్డే. బిడ్డలు ఏం చేసినా తల్లికి తప్పే కనుపించదు. మరి, తమ్మునిపై తనకు కక్షసాధింపు ఎందుకు? అదీగాక అమ్మ అనేక పర్యాయాలు చెప్పింది. " ఎవరు ఏమి చేసినా అందుకు వారేమీ బాధ్యులు కారు. అందరినీ నడిపే ప్రేరణ ఒకటి ఉన్నది. కనుక ఒకడు మంచి చేసినా వాడిని పొగడనవసరం లేదు. ఒకడు తప్పుచేసినా నిందించనవసరం లేదు." అని మరి, భగవన్నిర్ణయమయిన కార్యక్రమంలో అతడూ ఒక సాధనం మాత్రమే అయినప్పుడు అతనిపై విరోధం ఎందుకు? ఎప్పుడూ అమృతత్వాన్నీ అమ్మ వాక్యాలనూ పునశ్చరణ చేసుకుంటూ ఇతరులకు బోధించే తాను తన విషయం వచ్చేసరికి పారిపోతే ఎలా?

అమ్మకు అందరూ బిడ్డలయినప్పుడు లోకంలో అందరూ తనకు సోదరులే కదా. అసలు, అమ్మ మనలో విశ్వసోదరభావం కలిగించేందుకే తాను 'విశ్వజననీ' సంభావనను ప్రపంచానికి ప్రసాదించిందా ? మరి, అమ్మ ప్రసారంచేస్తున్న యీ మహాసందేశాన్ని తాను ఏమి అర్థం చేసుకున్నట్లు? ఆచరణలేని ఆదర్శానికి ప్రయోజన మేమున్నది?

...ఇట్లా ఆలోచనలు అంతరంగంలో తరంగిత మయ్యేసరికి అప్పారావులో బెహరాపై అవ్యాజమైన అభిమానం ఏర్పడింది. అతడిని ఎలాగైన రక్షించాలనే అభిప్రాయం కలిగింది. అలా అతనికి వాగ్దానం చేశాడు.

ఈ లోగా బెహరా అన్నదమ్ములు చాలా వక్రగతుల్లో ఆలోచనలు చేసి లారీ అప్పారావుకు యివ్వవద్దని సలహా యిచ్చారు. కానీ బెహరా వారి సలహాను సమ్మతించలేదు.

జులై 21వ తేదీన బెహరా ఆదోని మెజిస్ట్రేట్‌కు లారీని అప్పగించాడు. అంతకుముందే 407వ సెక్షనుక్రింద కేసు రిజిష్టరు అయినందువల్ల బెహరాను ఎమ్మిగనూరు తాలూకా జైల్లో బంధించారు.

అక్కడ అతనికి ఒక అనుభవం అయింది. తనతోపాటు కారాగారంలో ఉన్న ఇద్దరు ఖైదీలు మాట్లాడుకుంటూ ఉండగా అతను విన్నాడు. ఒక ఖైదీ మరో ఖైదీని అడిగాడట తాను ఏమి తప్పు చేస్తే శిక్ష విధించబడిందని. తన కుటుంబం పస్తులతో ఉంటే చూడలేక అతడు అరబస్తా ధాన్యం మాత్రం దొంగతనం చేశాడట. రెండో అతనుకూడా చాలా చిన్న దొంగతనం అదీ అత్యవసరమై చేశాడట.

ఈ సంభాషణ విన్న బెహరాలో పశ్చాత్తాపం రగిలింది. వాళ్ళు అత్యవసర పరిస్థితుల్లో చాలా చిన్న దొంగతనాలు చేస్తేనే వాళ్ళకు శిక్ష తప్పలేదు. మరి తాను ధన ప్రలోభంతో, విలాస జీవితంపై వ్యామోహంతో ఒక ఉత్తముని మోసంచేసి ధనం అపహరించాడు. కనుక తాను శిక్ష అనుభవించడం న్యాయం. మరి, తాను శిక్ష అనుభవిస్తూ బంధిఖానాలో ఉంటే తనను నమ్మి తన జీవితాన్ని పంచుకున్న ఉత్తమురాలైన భార్య గతి ఏమిటి?

దుస్సహమైన యీ ఆలోచనలతో కన్నీటిధారలతో అప్పారావును వేడుకున్నాడు. అప్పారావు యిచ్చిన హమీవలన బెహరా తాత్కాలికమైన విడుదల పొందాడు.

డిశంబరు చివరి వారంలో ఆదోనిలో విచారణ. బెహరా అప్పారావూ ఇద్దరూ ఆదోని వెళ్ళారు.

క్షణక్షణానికీ అప్పారావులో సోదరభావం ఉత్తుంగ తరంగితమై అతణ్ణి నిలువెల్లా ఆక్రమించి అతని రక్తంలోని కణకణాన్నీ మధురభావ ప్రభావితంచేసి అతని సమస్త నాడీమండలాన్ని సముత్తేజపరచి కర్తవ్యోన్ముఖంచేసింది. బెహరాను ఎట్లాగైనా గత మార్గాన్నుంచి మళ్ళించి ఉత్తమ మానవునిగా సత్పాత్రునిగా తీర్చి దిద్దాలనే పట్టుదల మనసంతా నిండిపోయింది. కనుకనే బెహరాను వెంటబెట్టుకుని మహానంది, మంత్రాలయం వగైరా పుణ్యక్షేత్రాలన్నీ చూపించాడు. ఎన్నో కథలూ, గాథలూ వివరించాడు. సమయం దొరికినపుడెల్లా అమ్మ గురించి తెలియజేశాడు. అమ్మ ప్రేమమార్గాన్ని విపులీకరించాడు.

పాపులయెడల, పతితుల యెడల అమ్మకు గల ఔదార్యమూ, క్షమా, అనురాగమూ సోదాహరణంగా బోధించాడు. పుణ్యశీలురనూ, పావన చరితులనూ సన్మార్గులనూ ప్రేమించే గౌరవించే వ్యక్తులు ఎక్కడైనా ఎందరైనా ఉండవచ్చును. గానీ పాపులను కూడా "నా బిడ్డలే" అని అనుకోవడమే కాక బాహాటంగా ప్రకటించి వారిని తన ఒళ్ళో చేర్చుకొని ఓదార్చే వ్యక్తులను జీవితంలోగాని లోకంలోగాని చరిత్రలో గానీ మరెక్కడా చూడలేదని ఉద్ఘాటించాడు. తనకు అమ్మే ఆదర్శమన్నాడు. అమ్మే ఆరాధ్యమన్నాడు. అమ్మే సర్వస్వమన్నాడు. తన జీవితానికి ఆధారమూ

ఆలంబమూ గమ్యమూ అమ్మేనన్నాడు. తనకే కాదు సర్వలోకానికీ సమస్త జీవులకూ, సర్వ సృష్టి స్థితి లయాలకూ మూలం అమ్మేనని తన విశ్వాస మన్నాడు.

బెహరా అన్నీ విన్నాడు. అంతా జీర్ణించుకున్నాడు. అతనికి తానొక కొత్తలోకానికి వచ్చినట్లుగా ఉన్నది. వీళ్ళందరూ మానవులగా కనుపించడంలేదు. దేవతలుగా దర్శనమిస్తున్నారు. అపకారులకూ ఉపకారం చేయడం 'నేర్పరి' లక్షణంగా తాను విన్నాడుగానీ అది సహజగుణంగా కలవారిని తానింతవరకూ చూడక పోవటమే కాదు, విననుగూడా లేదు. సాధారణ మనుషుల్లో ఇంత గొప్పగుణం ఆదర్శమే ననుకున్నాడు గానీ లోకంలో ఇటువంటి వ్యక్తులను తాను ఎరుగనన్నాడు. కనుకనే అవినీతి పూరితమైన గత నికృష్ట నీచ జీవితమంటే తనకు అసహ్యమనిపించింది. నిజాయితీ జీవితంలోని సుధామాధుర్యం తనను ఆకర్షించింది. శేషజీవితం పవిత్రంగా గడపాలనే దృఢ నిశ్చయం కలిగింది.

డిసెంబరు 31వ తేదీన తీర్పు చెప్పారు. బెహరాకు ఆనాడు కోర్టు ముగిసేవరకూ నిర్బంధమూ, రూ. 2000/-లు అపరాధమూ విధించారు. బెహరావద్ద పైకం ఏమీ లేదు. తన బంధువులు ఎవరూ తనకోసం రాలేదు. ఆ సమయంలో అప్పారావు తానే ఆ పైకాన్ని న్యాయస్థానంలో కట్టి అతణ్ణి విడుదల చేయించాడు.

ఇక, అతను ఒక్కక్షణం వృధాపోనీయక అమ్మకు చూపించమని అప్పారావును వేడుకున్నాడు. ఇద్దరూ కలసి జిల్లెళ్ళమూడి వచ్చారు.

అనుక్షణమూ అమ్మ సూక్తులను అధ్యయనం చేసే తనకు ఒక క్లిష్టపరిస్థితిలో అమ్మ సందేశాన్ని ఆచరణలనో పెట్టకలిగిన హృదయాన్ని ప్రసాదించినందుకు అప్పారావు అమ్మ పాదాలకు ప్రణమిల్లాడు. తన కొక కొత్త మార్గాన్ని చూపి కొత్త జీవితాన్ని ప్రసాదించినందకు బెహరా అమ్మ ముందు మోకరిల్లాడు.

ఇద్దరినీ చెరొక చంకలోకి తీసుకుని ఆనందపరవశురాలయిన 'విశ్వజనని' నయన యుగళిలో వెలిగిన కాంతిరేఖలతో ఆ గదిఅంతా దివ్య దీప్త భాసితమయింది. ప్రతివాడూ అప్పారావువలే ప్రతి తోటివాడినీ తోడబుట్టువుగా భావించి ప్రేమించగలిగితే అమ్మను **'విశ్వజనని'**గా ఆరాధించే మన పూజలకు సార్ధకత కలుగుతుంది. అవతార మూర్తి అమ్మ అందరినీ తన బిడ్డలుగా చూడడంలో ఆంతర్యం 'మన మందరం ఒక తల్లి బిడ్డలమే' అన్న భావం మనలో పాదుకొల్పడమే కదా! అది మనం అర్థం చేసుకుని ఆచరించగలిగితే ఆ భావం మన రక్తగతమైతే అప్పుడు మనందరం అమ్మకు నిజమైన వారసులమవుతాం. ఆ రక్తమాంసాల్ని పంచుకుపుట్టినవాళ్ళమవుతాం.

అప్పుడు యీ లోకం నాకమే కదూ?

# శిక్షకాదు శిక్షణ

సంస్కరణ అనే పేరుతో రామకృష్ణ అన్నయ్య వ్రాసిన సంపాదకీయం చదివారుగదా ! అమ్మ మహిమలు విలక్షణంగా ఉంటాయి. అందరూ చేసే మహిమలలాంటివి కావు. మానవుణ్ణి మాధవునిగా మలుస్తుంది.

దుష్టులను శిష్టులుగాను మారుస్తుంది.

ఆశ్రయించిన వారికి అభయ హస్తం ఇస్తుంది.

కరుణతో కర్తవ్య బోధ చేస్తుంది.

ఆదరించి అక్కున చేర్చుకుంటుంది.

ఈ అంశములన్నింటి సమాహారమే ఈ వ్యాస సారాంశము.

మా లారీ పోయి నేను నిరాశా నిస్పృహలతో ఉండి అమ్మకు ఫోన్ చేశాను. ఫోన్‌లో అమ్మకు నాకు జరిగిన సంభాషణ . . .

నేను : అమ్మా మా లారీ పోయింది.

అమ్మ : తెలుసు నాన్నా! వాడెన్ని బాధల్లో ఉండి ఈ పని చేశాడో!

నేను : మరిప్పుడు నన్నేం చేయమంటావు?

అమ్మ : నీవు చేసేదేముంది. జరిగేది జరుగుతుంది గదా!

" జరిగేదాన్ని చూస్తూ ఉండు."

నేను : ఎలా చూడమంటావ్.

అమ్మ : హాయిగా చూస్తూ ఉండు.

(ఏం జరిగినా హాయిగా చూడగలిగేది స్థిత ప్రజ్ఞుని లక్షణంగదా-అది నా దగ్గరుంటే నిన్నాశ్రయించడమెందుకు అని నామనసులో అనుకుంటూ)

నేను : అయితే తట్టుకునే శక్తినైనా ఇవ్వమ్మా

అమ్మ : " ఆశక్తి నీలోనే యున్నది".

## ఆవేదన

నా లారీ పోయిన విషయం అమ్మకు తెలిసికూడా వాడెన్ని బాధల్లో ఉన్నాడంటూంది! అమ్మనే నమ్ముకుని తల్లీ, తండ్రీ, గురువూ, దైవం అన్నీ అమ్మే అనుకున్న నా పరిస్థితి అంతా తెలిసి కూడా ఉదాసీనంగా ఉంటుందా ! పైగా నా మీద దయ చూపించడానికి బదులుగా నా సొమ్ము దొంగిలించిన వానిపై దయచూపిస్తుందా ! అన్న ఆలోచనలు ముంచెత్తాయి. నాకు బాధకూడా కలిగింది

## బెహరాలో పరివర్తన

బెహరా విజయవాడలో తనకు తెలిసిన లారీ ట్రాన్సుపోర్టు యజమానికి ఫోన్ చేశాడు. ఏమంటే తన లారీడ్రైవరు సరుకు దొంగిలించాడని లారీ యజమానిగా తాను డబ్బుతో వస్తున్నానని ఏదో విధంగా పరిష్కారం చేయమని.

తాను లారీలోని సరుకును అమ్మగా వచ్చిన డబ్బును హైదరాబాదులో తనకు తెలిసిన వాని వద్ద ఉంచాడు. ఆ డబ్బు తేవటానికి హైదరబాదు వెళ్లి అతడ్ని అడుగగా అతడు తనకు అసలు డబ్బేఇవ్వలేదని బుకాయించాడు. బెహరా నిశ్చేష్టుడై చేసేది లేక డబ్బు లేకుండా విజయవాడ వచ్చాడు.

అసలు బెహరాలో డబ్బు తిరిగి ఇవ్వాలనే ఆలోచన ఎందుకు వచ్చినట్లు? ఇదీ అమ్మ మహిమ అంటే. నన్ను ఊరుకోమన్నదేకాని తాను ఊరికే ఉండలేదు. బెహరా కూర్చున్నా నిల్చున్నా ఏదో ఒక అదృశ్యశక్తి తనను వెంటాడింది. లోగడ ఎందరి సొమ్మో అపహరించాడు గాని ఈ విధమైన మానసిక క్షోభ ఆందోళన కలుగలేదు. ఆ మానసిక క్షోభను తట్టుకోలేక రైలు క్రిందపడి మరణించాలనే నిర్ణయానికి వచ్చాడు. ఆ సమయంలో అతనికి ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఎలాగూ మరణిస్తూన్నానుగదా! ఆయన డబ్బు ఆయనకిచ్చి మరణిస్తే బాగుండునని. అపుడు విజయవాడ ఫోన్ చేయడం జరిగింది.

డబ్బు లేకుండా బెహరా విజయవాడ చేరాడు. మేమూ విజయవాడ చేరాము. ఇది ఇలా ఉండగా మాకు సరుకులోడు చేసిన వారు కూడ పోలీసులను వెంటబెట్టుకుని విజయవాడ చేరారు. బెహరా డబ్బులేకుండా వచ్చినందున మధ్యవర్తులు ఏమీ చేయలేక పోయారు. పోలీసులు బెహరాను ఎమ్మిగనూరు జైలులో పెట్టారు. డబ్బుకు బదులుగా తన లారీని ఇచ్చినందున నేనే జామీను ఇచ్చి విడిపించాను. అనేక పుణ్యక్షేత్రాలను చూపిస్తూ అవకాశం వచ్చినపుడల్లా అమ్మ మాతృతత్త్వాన్ని బోధిస్తూ వచ్చాను.

ఒక రోజు బెహరా నేను మంత్రాలయం వచ్చాం. అక్కడ జరిగిన ఒక సంఘటన బెహరాను కదలించివేసింది. మేమిద్దరం హోటలులో కాఫీ త్రాగుతున్నప్పుడు ఒక కుర్రవాడు కప్పులు కడగడం చూసి బావురుమంటూ ఏడ్చాడు. అందుకు కారణం లేకపోలేదు. తాను జైలులో ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటన గుర్తుకు వచ్చింది. తన తోటి ఖైదీని నిన్ను ఎందుకు జైలులో ఉంచారని అడిగాడట. తిండికి లేక అరబస్తా ధాన్యం దొంగతనం చేశానని అందుకే ఇక్కడ ఉన్నానని చెప్పాడట. ఇంత చిన్న దొంగతనానికి జైలుకు వస్తే తనకెంత శిక్షపడుతుంది. తాను జైలు నుంచి బయటకు వచ్చేటప్పటికి తన కుమారుని పరిస్థితి ఇంతే గదా. (అప్పటికి తన కుమారునికి ఒక సంవత్సరం వయస్సు) తన భార్య దిక్కులేనిది అవుతుంది గదా ! దీనాతిదీనంగా బ్రతకవలసిందే గదా. తాను జైలులో ఉన్నప్పుడు కూడ తనను పట్టించుకోని తన కుటుంబ సభ్యులు తన భార్యాబిడ్డలను ఆదుకుంటారా. అన్న ఆలోచనలతో ఏడుస్తూ తనను క్షమించి తన తమ్మునిగా భావించి తనకు శిక్షపడకుండా కాపాడమని తన భార్యాబిడ్డలను దిక్కులేని వారు కాకుండా చూడమని ప్రాధేయపడ్డాడు.

❀❀❀

## కరిగిన మనస్సు

దోషులను సానుభూతితో అర్థం చేసుకుని ప్రేమతో వాళ్ళలో పరివర్తన తీసుకురావాలన్నదే అమ్మ ఆశయం. అమ్మను ఆరాధించడం అమ్మ గుణగణాలను అలవరచుకోవడమేనన్న ఆలోచనతో ఉన్న నాకు బెహరా పరిస్థితిని చూచి హృదయం ద్రవించింది.

నిజమే ఇదే నా తమ్ముడు చేస్తే కక్షసాధింపు చర్యకు పూనుకుంటానా ! నన్ను అన్నగా భావించి క్షమించమన్న బెహరాపై జాలి, ప్రేమ, అనురాగం కలగడం ప్రారంభమైంది. బెహరా తరపున నేను కోర్టులో ప్లీడరును పెట్టాను. సొంత తమ్మునిగా భావించే మనస్సు అమ్మ నాకు కలిగించింది. శిక్షపడకుండా కాపాడగలదన్న విశ్వాసంతో బెహరా నా సలహానుసరించి అమ్మ నామం చేస్తున్నాడు. అప్పుడు సమయం నాలుగు గంటలు. కోర్టు సమయం అయిదు గంటలకు ముగుస్తుంది. విచిత్రమేమిటంటే శిక్ష తప్పదనుకున్న బెహరాకు ఆరోజు కోర్టు సమయం పూర్తయ్యేవరకు మాత్రమే శిక్ష 2000/- జరిమానా అని కోర్టుతీర్పు. అంటే ఒక గంట మాత్రమే అతనికి శిక్షవిధించబడింది. ఆ 2000/- జరిమానా నేనే కట్టాను. ఆ తరువాత నేను అతనిని అమ్మదగ్గరకు తీసుకువచ్చాను. అమ్మ దర్శన మాత్రం చేతనే బెహరా రాతిగుండె సహితం కరిగిందేమో అతని కంటి వెంట ధారగా కన్నీరు. వెంటనే అమ్మ అతనిని దగ్గరకు తీసికొని ఆప్యాయంగా అతని తల నిమురుతుండగా చలించి పోయిన బెహరా కన్నీటితో అమ్మ పాదాలకు అభిషేకం చేశాడు. మరి అమ్మ కరస్పర్శలో ఎంత అనురాగం ఉందో ఎంత లాలన ఉందో అతడు ఆనందపరవశుడయ్యాడు.

అమ్మ కంట్లో కూడా కన్నీరు. బిడ్డలో వచ్చిన మార్పుకు ఆనందబాష్పాలేమో. ఒక కమలాఫలం ఒలిచి అమ్మ అతని నోట్లో పెడుతుంటే అమ్మ చేతిలో తొనలు అమ్మ నోట్లో పెడుతున్నాడు అతను. ఆదృశ్యం చూచి తీరవలసిందే. ఇదేగదా తల్లీబిడ్డల అనుబంధం అంటే. దుష్టులూ శిష్టులూ అమ్మ బిడ్డలే గదా. అర్హతలంటూ ఆలోచిస్తే ఏదో మైలురాయి దాటి ఎవరూ రాలేరు అంటుంది అమ్మ. **"నేను అమ్మను మీరు బిడ్డలు"** అన్న అమ్మ మాటకు ఇంతకంటె నిదర్శనం ఏం కావాలి.

# మహోపదేశం

లారీ పోయిన సందర్భంలో అమ్మకు నాకు జరిగిన సంభాషణలో ఇపుడు నన్నేం చేయమంటావు అని అడిగినపుడు ఏం చేస్తావు **"జరిగేది జరుగుతుంది, జరిగేదాన్ని చూస్తూ ఉండు"** అన్నది. ఎలా చూడమంటావమ్మా అని నా బాధను వ్యక్తం చేసినపుడు **"హాయిగా చూడునాన్నా"** అన్న అమ్మ మాట అపుడు బాధకలిగించినా తరువాత నిత్యజీవితంలో భౌతికంగానూ, అధ్యాత్మికంగాను సాధన పరంగానూ జీవితాన్నే మార్చిన మాహామంత్రం అయింది.

జీవితంలో వచ్చే ఆటుపోట్లు తట్టుకోలేక భయాందోళనకు గురయినపుడు *"జరిగేది జరుగుతుంది జరుగుతున్నదానిని హాయిగా చూస్తూ ఉండు"* అన్న అమ్మ మాటలు గుర్తుకు వచ్చేవి. నిజమే చూడక ఇపుడు చెయ్యకలిగేదేమున్నది అని అనుకుంటూ ఉండే వాడిని. తట్టుకునే స్థితినైనా ఇవ్వమని అడిగినపుడు ఆస్థితినాలోనేఉన్నదని హామీ ఇచ్చింది కదా. తట్టుకునే స్థితి ఉన్నపుడు జరుగుతున్న దాన్ని చూస్తూ ఉండటానికి మార్గం సుగమం అయినట్లేకదా ! అమ్మ మాట మంత్రంలా పని చేసి కొంతసేపటికి మనశ్శాంతి లభించేది.

ఇలా కొంతకాలం జరిగేటప్పటికి ఇది ఒక అద్భుత సాధనగా మారి నిత్యజీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులకు తట్టుకొని వాటిని సాక్షిగా చూడటానికి మనస్సు అలవాటు పడింది. అంతేకాదు నా ఆధ్యాత్మిక సాధనలో పురోగతికి కూడ బాగా ఉపయోగపడింది. ఎలాగంటే తొలి రోజులలో ధ్యానసమయంలో నాకు వచ్చే ఆలోచనలతో తాదాత్మ్యం చెందుతూ ఉండేవాడిని. జరిగేది జరుగుతుంది చూస్తూ ఉండు అన్న అమ్మ మాట గుర్తుకు వచ్చి వస్తూఉన్నఆలోచనలను సాక్షిగా చూడటం అలవాటయింది.

మరి అమ్మ ఇచ్చిన ఈ మహోపదేశం జీవన్ముక్తికి మార్గమేగా ! అమ్మ మహిమ విలక్షణమైంది కదా ఇంతకంటె గొప్ప మహిమేముంటుంది.

❖❖❖

# అమ్మే గురువు

1974లో హైదరాబాదులో బంజారా హిల్స్‌లో ఉన్న రాజగోపాలాచారి గారింటిలో అమ్మ విడిది చేశారు. రాజగోపాలాచారిగారు అంతర్జాతీయంగా పేరుపొందిన వ్యక్తి. శ్రీ విశ్వజననీ పరిషత్తుకు అధ్యక్షులుగా కూడ ఉన్నారు.

నేను అమ్మనుచూడడానికి స్వామి రామదాసుగారితో కలిసి హైదరాబాదులో రాజగోపాలాచారి గారింటికి వెళ్లాను. అపుడు సమయం సుమారు పగలు 11 గంటలైంది. జనసందోహంతో ఇల్లంతా కోలాహలంగా ఉంది. ఒక పెద్ద హాలులో కూర్చీలో అమ్మ ఆసీనురాలైయున్నది. అమ్మ ఎదురుగా వంద మంది భక్తులు కూర్చొని ఉన్నారు. కొందరు అమ్మ పాదాలకు పూజ చేసుకుంటున్నారు. ప్రక్క గదిలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు ఉపన్యాసం చెబుతున్నారు. నాకు వారి ఉపన్యాసం వినాలని చాలా ఉత్సాహంగా ఉన్నది. ఆ గదిలోకి వెళ్లాలంటే అమ్మ ముందు నుంచే వెళ్ళాలితప్ప వేరే మార్గంలేదు. అమ్మకు కన్పించకుండా వెళ్ళాలనే ఉద్దేశంతో నేను నెమ్మదిగా వంగి వంగి నడుస్తూ అవతలి గదిలోనికి వెళ్లబోతుండగా నన్ను చూచి అమ్మ పిలిచింది. విషయం చెప్పాను. అపుడు అమ్మ " నాన్నా నీకు అర్ధమయ్యేటట్టు నేను చెబుతాను కూర్చో". అన్నది. అమ్మ అలా ఎందుకు అన్నదో కారణం తెలీని నేను అమ్మ దగ్గరే కూర్చున్నాను. కాని ఆ తరువాత ఎన్నో సందర్భాలలో ఎన్నో విషయాలను గురువుగా తెలియచెప్పసాగింది. దైవంగా స్ఫురింపచేసింది. నా సాధనలో ప్రతి దశలోనూ అమ్మ ప్రబోధం నాకు అందుతూనే ఉన్నది. సాధకుడిగా ఒక స్థితికి చేరుకోవడానికి అమ్మ మాటే మంత్రమయి మహోపదేశమయి మార్గనిర్దేశం చేస్తూనే ఉన్నది. సాధకునిగా ఒక స్థితికి చేరుకోవాలనే తపనను అమ్మ ఆనాడే గుర్తించి తానేగురువుననే విషయాన్ని స్వయంగా సూచించింది. నాకు గురువయినా దైవమయినా సర్వస్వమూ అమ్మే !



## అమ్మ రక్షణ వలయంలో మా కుటుంబం

మేము హోల్‌సేల్ ఆయిల్ వ్యాపారం చేసేరోజులలో మా అబ్బాయి కృష్ణబాబు కైకలూరు నుండి బాకీలు వసూలుచేసి 1.75 లక్షలు క్యాష్‌తో స్కూటర్ మీద వస్తూ ఉండగా ఒక గేదె అడ్డువచ్చి స్కూటర్ మీద నుండి పడిపోయాడు. స్పృహకోల్పోయాడు . కొన్ని గజాల దూరంలో క్యాష్ బ్యాగ్ పడిపోయింది. చీకటి పడింది. ఆసమయంలో కైకలూరు నుండి ఏలూరు ఒక వ్యాన్ ప్యాసింజర్స్‌తో వస్తుంది. దానికి లైట్లు లేవు. బ్రేకులు కూడా సరిగాలేనందున . నెమ్మదిగా వస్తున్నాడు. విశేషమేమిటంటే సరిగా మా అబ్బాయిపడిపోయినచోటకు వచ్చి వ్యాన్ ఆగిపోయింది. దిగి చూడగా స్పృహలేని కుర్రవాడు. దూరంగా పడిన సంచి. ఆ సంచిలో మా షాపు అడ్రసుఉన్నది. ఆ అడ్రసు ప్రకారం ఆస్థితిలోని కుర్రవాడిని డబ్బు సంచితో సహా మా షాపుకు తీసుకువచ్చారు. డబ్బు ఇస్తానన్నా ఏమీ తీసుకోలేదు. తలకు బలమైన గాయం, శరీరమంతా రక్తంతో ఉన్నాడు. హాస్పటల్లో చేర్పించాము. డాక్టరు గారు 24 గంటలు గడిస్తే గాని చెప్పలేమన్నారు. నేను నాభార్య అమ్మను ప్రార్థించాము. మా కోడలు సాయినాథుని ప్రార్థించింది. నా భార్యకు తెల్లవారుజామున స్వప్నంలో సాయిబాబా కనిపించి "నీ బిడ్డను రక్షించిది నేనే" నని చెప్పి అంతర్ధానమైనాడు.

మా అబ్బాయి బ్రతికి బయటపడ్డాడు. మా పెద్ద అమ్మాయిగారి కుమారుడు ఫణిబాబు 8 సం॥రాల వయస్సులో నన్ను చూడాలనే కోరికతో ఇంట్లో చెప్పకుండా బయలుదేరాడు ఏలూరు రావటానికి. విజయవాడ రైల్వేస్టేషనుకు సాయంత్రం 6 గంటలకు చేరాడు. ఏ బండి ఎక్కాలో తెలియదు. ఎదురుగా ఉన్న ట్రెయినులో కూర్చున్నాడు. రాత్రికి బాగా ఆకలైంది. భయంవేసింది. ఏడుస్తూట్ర ట్రైయినులో కూర్చొన్నాడు. ప్రక్కనే ఉన్న వ్యక్తి అన్నంతింటావా బాబు అంటూ కడుపునిండా అన్నంపెట్టాడు. అన్నంతిని బాబు నిద్రపోయాడు. నిద్రలేచేటప్పటికి ఉదయం 10 గంటలయినది. కళ్ళుతెరచిచూచాడు. ఏలూరు రైల్వేష్టేషను అనే బోర్డు చూచి దిగాడు. రిక్షాఎక్కి ఇంటికి చేరాడు. ఆ సమయానికి విజయవాడ నుండి వచ్చే ట్రెయిన్ యేమీలేదు. విజయవాడలో క్రింతంరోజు 6 గంటలకు ఎక్కితే ఏలూరు రావటానికి అంత టైము ఎందుకుపడుతుంది? ఆకలవుతుందన్నపుడు అన్నంతింటావా బాబు ? అంటూ అన్నంపెట్టిందెవరు ? నిద్రలేవగానే యేలూరు బోర్డు కనిపించడమేమిటి? ఇంతకంటే ఆశ్చర్యం ఇంకేముంటుంది. అమ్మ రక్షణవలయంలో మాకుంటుంబం ఉంది అనటానికి ఇంతకంటే నిదర్శనమేముంటుంది.

## ఆపద్బాంధవి అమ్మ

మా కనిష్ఠ కుమార్తె వైదేహికి వివాహముహూర్తం ఏలూరులో 24-8-1989 రాత్రికి నిశ్చయం అయింది. తుఫాను కారణంగా చుట్టూ నీరు, ద్వీపంలా తయారైంది ఏలూరు. పెండ్లివారు విజయవాడనుండిరావాలి. వాహనాలరాకపోకలులేవు. రైళ్ళుకూడా రద్దైనవి. పట్టాల మీద నీళ్ళు పారుతున్న కారణంగా రైల్వేవారు ది. 23-8-1989 మధ్యాహ్నం రైల్వే లైను పరిశీలన కొరకు ఒక ప్యాసింజరు రైలును నడుపుటకు నిశ్చయించారు. ఎలాగో పెండ్లివారికి ఆ విషయం తెలిసింది. పెండ్లివారు 10మంది ముఖ్యమైనవారితో పెండ్లికొడుకును వెంటపెట్టుకుని ఏలూరు చేరారు. 24వ తేది యధావిధిగా రాక పోకలు ప్రారంభం అయినవి. మా తాలూకూ భజంత్రీలురాలేదు వివాహంజరగదనే అభిప్రాయంతో,ఎదురుగా ఉన్న కళ్యాణమండపానికి భజంత్రీలువచ్చారుకాని పెండ్లివారు,రాలేకపోయారు, ఆభజంత్రీలు మాకు సహకరించారు. వివాహ సమయానికి తుఫాను ఆగిపోయింది. మహూర్తసమయానికి వివాహం చక్కగా జరిపించింది అమ్మ.

*(మరొక అనుభవం)*

వైదేహి మొదటి కాన్పు చాలా కష్టమైంది. పెద్దఆపరేషను చేసి బిడ్డను తీశారు. రెండవ కాన్పు కూడా ఆపరేషన్ చేయాలని ఆపరేషను చేయకపోతే పెద్ద ప్రాణానికేముప్పు అని ప్రమాదంపొంచిఉందని అన్నారు.

" నీవే తప్ప ఇంతఃపరంబెరుగ " అన్నట్లు ఆర్తితో పూర్తిగా శరణాగతురాలైంది. మా అమ్మాయి. అమ్మ ఫోటో తన తలదగ్గర పెట్టుకుంది ఆపరేషను ధియేటర్‌కు వెళ్ళే సమయంలో. ఆశ్చర్యమేమిటంటే ఆపరేషను ధియేటర్‌లో అప్పటికే అమ్మ కూర్చుని ఉన్నట్లుగా మా అమ్మాయికి దృశ్యమానమైంది. .మా అమ్మాయి ఆనందానికి అంతులేదు, ధైర్యం వచ్చింది కూడా. ఆ తరువాత ఆపరేషను చెయ్యటానికి వచ్చిన డాక్టరుగారిలో అమ్మలీనం అవుతున్నట్లుగా దృశ్యమానమైంది. అంతేకాదు డాక్టరు చేసే ఆపరేషను అమ్మ చేస్తున్నట్లుగా అనుభూతి కలిగిందట.

ఆపరేషను చేసిన డాక్టరు గారు కూడా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ ఈ రోజు నేను చేసిన ఆపరేషను నేను చేసినట్లు అనిపించలేదు. ఎవరో నాలో ఉండి చేస్తున్నట్లు అనిపించింది. ఎంతో కష్టమనుకున్న ఆపరేషను చాలా తేలికగా అయిపోయిందంటూ తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు డాక్టరుగారు. ఇలా అమ్మ రక్షణ వలయంలో నిండిపోయింది మా కుటుంబం.

# అందరికి అమ్మ ఎలా అవుతుంది

5-8-1976 నా భార్యకు చెవి ఆపరేషన్ చేయించే నిమిత్తం మద్రాసు వెళ్తూ జిల్లెళ్ళమూడిలోదిగాం అమ్మఆశీస్సులకోసం. నా భార్య అనుకుందట అమ్మా నీవు అందరికి అమ్మనంటున్నావు అందరికి నీవు ఎలా అమ్మవవుతావు మా అమ్మ జీవించి ఉన్నట్లయితే ఇపుడు నాతో మద్రాసు వచ్చేదిగదా ! అని

ఆ రోజు మేము హైమాలయం ప్రాంగణంలో పండుకున్నాం. నా భార్యకు ఒక కల. ఆ కలలో ఆపరేషన్ థియేటర్‌లోఅమ్మ డాక్టరుగా చెవికి ఆపరేషన్ చేసిందిట. కొంత ధైర్యం వచ్చింది నా భార్యకు.

మదరాసులో హాస్పిటల్‌కు వెళ్లగానే మీరు అప్పాయింటుమెంటు లేకుండా వచ్చారుగనుక మరొక సారి రమ్మన్నారు. ఏమీ తోచలేదు. అమ్మ చేతిమీదుగా యిచ్చిన కుంకుమ పొట్లం విప్పి కొంచెం కుంకుమ నోట్లోవేసుకొని నీవేంచేస్తావో నాకు తెలియదు నన్ను ఈరోజు డాక్టరు గారు చూచేటట్లుగా చెయ్యమని ప్రార్థించింది.

చిత్రమేమిటంటే ఆనెల 21వ తేదిన ఆపరేషన్ చేయించుకోవలసిన వారు అనివార్యకారణముల చేత ఆరోజుకు రాలేకపోతున్నామని ఒక టెలిగ్రాం యిచ్చారుడాక్టరుగారికి. మమ్మల్ని లోపలకు పిలిచి పరీక్షలు నిర్వహించి. ఆ నెల 21వ తేది ఆపరేషన్ చేశారు.

అమ్మ ప్రత్యక్షంగా దగ్గరుండి ఆపరేషను చేసినట్లుగా అనుభూతి కలిగిందట. అంతేకాదు అక్కడఉన్ననర్సులు తన చెయ్యిపట్టుకొని నడిపించేటపుడు (మలమూత్ర విసర్జన నిమిత్తం) అమ్మ చెయ్యిపట్టుకుని నడిపిస్తునట్టు అనుభూతి కలిగేదట. ఇది అమ్మ తనతో మద్రాసు రావడం కాదా ! ఇది అమ్మ మహిమ కాదా! మద్రాసులో మేము దిగిన వారింట్లో 5 రోజులు ఉన్నాం. అక్కడ నా భార్యకు వాంతులు విరేచనాలు. ముక్కు మొఖం తెలియని ఆ యింటి యజమానురాలు నా భార్యకు కన్నతల్లిగా దగ్గర కూర్చొని అన్నం ముద్దలు కలిపిపెట్టింది. వాంతులు, విరేచనాలు అయినపుడు చేయిపట్టుకొని తీసుకువెళ్ళింది. ఇదంతా అమ్మ ఆమె బుద్ధిలో ప్రవేశించి సేవలందించడమేగదా.

# పెండ్లికానిపెండ్లి అమ్మ చేసిన పెండ్లి

మా చిరంజీవి కృష్ణబాబుకు నర్సరావుపేటలో వివాహం నిశ్చయించేటపుడు వివాహం జిల్లెళ్ళమూడి అమ్మ సన్నిధిలో జరగాలి అందుకు మీకు యిష్టమైతే నాకు అభ్యంతరం లేదు అన్నాను. వారు అంగీకరించారు. వారికి మాకోడలు ఆఖరుఅమ్మాయి గనుక వారిలోకొందరికి నర్సరావుపేటలోనే వివాహం జరగాలనికోరిక. మధ్యవర్తుల ద్వారా నన్ను అంగీకరింపచేయ్యటానికి ప్రయత్నించారు. నా మనస్సుకు బాధకలిగింది. నాకు ఒక్కడే అబ్బాయి కనుక అమ్మ సన్నిధిలో వివాహంజరగాలని బలమైనకోరిక. అందువల్ల జిల్లెళ్లమూడిలో నా బాధ్యతమీద వివాహం వైభవంగా జరిపిస్తానని హామీయిచ్చాను. పరిస్థితుల ప్రభావంచేత నాకోరిక నెరవేరలేదు. నన్ను సమాధానపరిచారు చివరకి. పెండ్లికొడుకునుపెండ్లికూతురును అమ్మసన్నిధిలో చేయుడానికిమాత్రం అంగీకరించారు. ఇంటికి తిరిగి వచ్చానేగాని మనసంతా వ్యాకులంగా ఉంది. **"ఎవ్వరిని ద్వేషించవద్దు. ఎవరు ఏపని చేసినా ప్రేరణ వచ్చిన తరువాతే గదా! నీకుయేదైనా ద్వేషంఅంటూఉంటే !ప్రేరణ యిచ్చినవాడిని ద్వేషించమంటుంది"** అమ్మ. నిజమే మరి ! ప్రేరణయిచ్చేవాడేగా నా కోరిక తీర్చవలసింది అనుకుంటూ అమ్మా నాకు ఒక్కగానొక్క కుమారుడు వాడికి నీచేతనే. ఉపనయనం చేయించాలని నీచేతిమీదుగా వివాహంజరిపించాలని కలలు కన్నాను. ఇలా జరిగింది అని అమ్మనే తలుచుకుంటూబాధపడుతూ మళ్లీ ఇలాఅనుకున్నాను. అమ్మ తప్పేముంది అందులో నాకు యిష్టములేదని గట్టిగా అప్పుడే చెప్పి ఉండవచ్చుగదా. తప్పునాదైతే అమ్మ మీద నేను కోపం తెచ్చుకుంటే ఎలా? అని అనుకున్నా మనశ్శాంతి దొరకనందున జిల్లెళ్లమూడివెళ్ళి జరిగినవిషయం అమ్మతోచెప్పి అమ్మఒడిలో తలపెట్టి వెక్కి వెక్కి ఏడ్చాను. ఏడవ వద్దు నాన్నా "మీఅబ్బాయివివాహం నేను చేస్తాను అంటూ నన్ను ఓదార్చింది". నేను అక్కడవివాహంజరిపించటానికి అంగీకరించి వచ్చానమ్మా ! నా మాటపోతుంది. అక్కడ వివాహం జరగకపోతే అన్నాను. లేదునాన్నాబాధపడకు నేను వివాహంచేస్తానుగదా ! అంది. నేను బాధపడకుండా అమ్మ సర్దిచెబుతుందేమోలే అనుకుంటూ అయినా చెయ్యిగలిగింది యేముంది తప్పునాదైతే అనుకుంటూ అమ్మ చేత బొట్టు పెట్టించుకొని తేలిక పడినమనస్సుతో ఇంటికితిరిగివచ్చాను.

రెండురోజులు పోయినతరువాత నాకు యింటివద్ద ఒకఆలోచన వచ్చింది. ఎట్లాగూ పెండ్లికొడుకునుచేయించటానికి జిల్లెళ్ళమూడివెళ్లాలిగదా ఉపనయనమైనా అక్కడచేయించుదామని నాశ్రీమతిని సలహాఅడిదితే అమె సరేనన్నది.

రామకృష్ణఅన్నయ్యకు జెల్లెళ్ళమూడి ఫోనుచేశాను. కావలసిన యేర్పాట్లన్ని నేను చూస్తాను పెండ్లికొడుకునూ పెండ్లికూతురును చేయించటానికి ఎలాగూ వస్తారుగదా ! అప్పుడే ముందు ఉపనయనం చేయించి తరువాత పెండ్లికొడుకును పెండ్లికూతురును అమ్మచేతచేయించుదామని అన్నయ్య సలహా యిచ్చాడు.

ఉపనయన ముహూర్తం ఉదయం 8 గంటలకు. పెండ్లికొడుకు పెండ్లికూతురును చెయ్యటానికి 11 గంటలకు మహూర్తం. రేపు ఉపనయన మనగా క్రితం రోజు మధ్యాహ్నానికి జిల్లెళ్ళమూడి చేరాం. వివాహం నర్సరావుపేటలోనే గదా! అని ముఖ్యమైనవాళ్ళం మేం అయిదారుగురం మాత్రమే వెళ్ళాం.

నర్సరావుపేటవారు మాత్రం మరురోజు ఉదయం 8 గంటలకు వచ్చారు. వారుకూడా అయిదారుగురు ముఖ్యమైనవారుమాత్రమే వచ్చారు.

అమ్మ నన్ను అడిగింది పెండ్లికొడుకునూపెండ్లికూతురును కలిపిచేయలా విడివిడిగా చేయాలా అని. నేను మాత్రం అమ్మతో నీయిష్టం వచ్చినట్లుగా చెయ్యమ్మా అన్నాను. ఉదయమే ఉపనయనంప్రారంభం అయింది. అమ్మ మంత్రోపదేశం చేసింది తరువాత అమ్మాయిని అబ్బాయిని అమ్మ సన్నిధిలో కూర్చొపెట్టారు. బుగ్గకు కాటుక పెట్టారు. అమ్మ ఉభయుల శిరస్సులపై తలంబ్రాలు పోశారు. ఉభయులకు ఒక అరటిపండుఒలిచి తినిపించారు. ఆ సన్నివేశం చూచిననేను వివాహం జరిగినట్లుగానే ఆనందపడ్డాను. అమ్మ ఈ రూపంలో నా కోరిక తీర్చింది. బిడ్డకోరిక తల్లితప్ప ఎవరుతీర్చగలరు.

❀❀❀

## కర్తవ్యబోధ

నాకు ప్రతిరోజు సాయకాలము 6 గంటలకు సంత్సంగానికి వెళ్ళడం అలవాటు. నా శ్రీమతికి సద్గ్రంథపఠనంఅలవాటు. ఒకరోజున ఆమె విద్యాప్రకాశానందగిరిస్వామి వారి "గీతోపన్యాసములు" గ్రంథపఠనంగావిస్తూ ఉండగా ఒకఆలోచన వచ్చి అమ్మ ఫోటో వైపుచూస్తూ " అమ్మా ! వారు రోజూ సత్సంగానికి వెళ్ళిఅనేక విషయాలు తెలుసుకొంటున్నారు నాకు బయటకు వెళ్ళటం కుదరదు. "మరి నాకెవరు చెబుతారమ్మా నీవు తప్ప" అని ఆర్తితో ప్రార్థించింది. వెంటనే తనకు అమ్మమాటలు ఇలావినిపించినై. తనుచదివేపుస్తకంలోనే ఒక పేజీ నంబరు చెప్పి చూడమన్నది. ఆపేజీలో ఇలా ఉంది.

గీత 9/27

" యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషిదదాసియత్

యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్" భ॥గీత 9/27

తా॥ అర్జునా! ఏపని చేయుచున్నావో, దేనిని భుజించుచున్నావో,

దేనిని వ్రేల్చుచున్నావో, దేనిని దానమిచ్చుచున్నావో,

యే తపమొనర్చుచున్నావో వాటినన్నింటిని నాకర్పణ చేయుము'

" *చేసేప్రతిపనీ భగవత్సేవేఅనుకుంటే సంసారం ఆధ్యాత్మికచింతనకడ్డుకాదు*". అన్న వాక్యం గీతాప్రబోధానికి వ్యాఖ్యానమేననిపిస్తుందిగదా ! " నువ్వేంచేసినా నాకర్పణ చేస్తే నాకర్చన కానిది ఏమీలేదు" అని అమ్మ గురువై ప్రబోధించినది.

**" నీకున్నది తృప్తిగా తిని**

**ఇతరులకు ఆదరంగా పెట్టుకో"**

సరిజేసికోమను. అసలు పోవలసింది పెద్దప్రాణి అని మేనకోడలుతో చెప్పిందట. తరువాత తెలిసింది నిజంగా మాయిల్లు విదిక్కులోనే ఉన్నది అని. దానిని పడగొట్టి వాస్తుకు సరిపడేలా ఇల్లుకట్టుకున్నాము.

ఈ సంఘటన ద్వారా అమ్మ నన్ను అనుక్షణం కాపాడుతున్నదన్న భావన స్థిరపడింది. నాకు ఇలా అనేక అనుభవాలను ఇచ్చి అమ్మ సంస్థకు సంబంధించిన కార్యక్రమాలలో పాల్గొని సేవజేసికొనేభాగ్యం కలిగించిందిఅమ్మ.

ఈమధ్య 11-11-06నజరిగిన లలితాకోటినామార్చనలో 4 బస్సులలో భక్తులను జిల్లెళ్ళమూడితీసికొని వెళ్ళాను. కార్యక్రమంఅయిన తరువాత భక్తులనందరను పంపించి నేను జిల్లెళ్ళమూడిలోఉండగా " తిరిగివెళ్ళు తిరిగివెళ్ళు" అనేమాటలువిన్పించినవి. ఈవిషయం వసుంధరక్కయ్యతోచెప్పగా దానిలో ఏదో విశేషం ఉండిఉంటుంది వెంటనే బయలుదేరమన్నది. నేను సూరంపల్లివచ్చాను. అప్పటికే నా బాధ్యతతో నిర్వహించవలసిన ఒక బృహత్తర కార్యక్రమం సిద్ధంగా ఉన్నది. ఆ సమయానికి నేను రాకపోతే పరిస్థితి వేరుగా ఉండేది.

ఇలా అమ్మనన్ను కంటికిరెప్పలాకాపాడుతున్నది. ఇవి మా ప్రత్యక్షానుభవములు. " సంస్థను మీరు చూడండి మీ సమస్తం నేను చూస్తాను" అన్నమాటకు ఇంతకంటె నిదర్శనం ఏంకావాలి?

**" భార్యకు భర్త దేవుడు - భర్తకు భార్య దేవత. "**

**" భావం తెలుసుకొని ప్రవర్తించేది భార్య**

**బాధ్యత తెలుసుకొని ప్రవర్తించేవాడు భర్త ."**

**" ప్రతి స్త్రీలో అమ్మను చూచేవాడికి అందనిదంటూ ఉండదు "**



# అమ్మ మన దగ్గరకు వస్తుందా

2004లో నా భార్యకు పెద్దఆపరేషన్‌చేయించవలసివచ్చింది. హాస్పిటల్‌లో మత్తు మందు ఇచ్చేముందుఅనుకున్నదట. "అమ్మవస్తే బాగుండును" అని. అమ్మతనకు దర్శనమిచ్చి నేనువచ్చాను అనిచెప్పి హాస్పిటల్‌థియేటర్‌లోకి వెళ్ళటం తాను చూచిందట.

ఆపరేషన్‌పూర్తిఅయింది మత్తువదిలితెలివివచ్చింది. తనను రూముకు చేర్చేందుకు స్ట్రెక్చరు మీద పండుకొనబెట్టారు. ఆస్ట్రెక్చరును అమ్మ తన చేత్తో నెట్టడం నేను కళ్ళారాచూచాను అని రూముకుచేరి తెలివిపూర్తిగారాగానే చెప్పింది. తాను స్పృహలోకిరాగానే నాభార్య అన్న మొదటిమాట " ఇప్పటికే ఆలశ్యం అయింది ముందు అమ్మకు టిఫెను పెట్టండి" అని. మాఇంట్లో ఏకాహాలు సప్తాహాలు జరిగినపుడు అనుకోకుండా ఎక్కువమందిభక్తులు వస్తే ఆమెచేతులెత్తి అమ్మకునమస్కరించితే ఎంతమందికైనా ప్రసాదాలు సరిపోయేవి. చేసినపదార్థాలు అమ్మకునివేదన చేసినపుడు వేళ్ళగుర్తులు పడేవి అమ్మ ప్రసాదం స్వీకరించినగుర్తుగా. ఈ సంఘటనలన్నీ అమ్మ మనతోఉండి మనలను అనుగ్రహిస్తూనేఉన్నదనటానికి నిదర్శనాలేకదా !

ఈమధ్యకాలంలో ఒకరోజు నాభార్య వంటయింట్లో ఈరోజు ఎంతమందికి వంట చేయాలి ? అని ఆలోచిస్తున్నపుడు, అమ్మ తనభుజంమీద చెయ్యివేసి "ఎపుడు వంట చేసినా ఒక మనిషికి అదనంగాచెయ్యి" అని చెప్పిందట. రూపం కనిపించలేదుగాని మాట వినిపించిందట. తను ఆప్పటినుండి ఒక మనిషికి అదనంగా వంట చేస్తుంది. అమ్మ యిప్పటికీ తనబిడ్డలకు తన సందేశాన్ని అందిస్తూ ఉన్నదనటానికి ఇది నిదర్శనం కాదా!

## ఇంటి గుమ్మంలో అమ్మ కాపలా

నా శ్రీమతి కుసుమాంబకు ఇంటిపనులుపూర్తిచేసుకొని దేవతార్చన ధ్యానం చేసుకోవడం అలవాటు. ప్రతిరోజు ధ్యానం చేసుకునే సమయంలో ఎవరోఒకరు వచ్చి తలుపుకొడుతూఉండేవారు. అర్చనకు భంగంకలుగుతోందనే ఆలోచనతో అమెఒక రోజు వీధిగుమ్మం వద్ద ఒకకుర్చీవేసి దానిలోఅమ్మ ఫోటో పెట్టి అమ్మా నా పూజా కార్యక్రమాలు పూర్తిఅయ్యేవరకు ఎవరినీ లోపలకు రానివ్వద్దు అని వేడుకుంది. పూజ పూర్తయ్యేవరకు ఎవరూరాలేదు. కాని ఆ ఫోటో అక్కడనుండి తీయడంమర్చిపోయింది. నేను మధ్యాహ్నంభోజనానికి ఇంటికివచ్చినపుడు గుమ్మ వద్ద అమ్మఫోటో చూచాను. విషయంతెలుసుకొని అమ్మను కాపలా పెట్టడమేమిటని మందలించాను. ఆ తరువాత కొద్దిరోజులకు నేను, రామబ్రహ్మంగారు అమ్మవద్దకు వెళ్ళాం. అమ్మదగ్గర కూర్చొనగానే " ఏంచేస్తాం నాన్నా!కొందరిళ్లలో నన్ను కాపలా కూడాపెడుతున్నారు" అని అమ్మ తన సర్వజ్ఞత్వాన్ని తెలియజేసింది.

**అమ్మ దిద్దిన కుంకుమబొట్టు :**

అమ్మ దేహంచాలించినతర్వాతకూడా నాపుట్టినరోజుపండుగకు జిల్లెళ్ళమూడి వెళ్ళి వ్రతంచేసుకోవడం అలవాటు. ఒకరోజురాత్రి షుమారు. గం.10-30 అవుతుంది వసుంధరఅక్కయ్య ఇంటిముందు నేను డాక్టరు వరలక్ష్మి అక్కయ్య, హనుమబాబుఅన్నయ్య, సుగుణ అక్కయ్య అందరంకూర్చుని అమ్మకబుర్లు చెప్పుకుంటున్నాము. నాభార్య లోపలగదిలో నిద్రపోతోంది. మాకబుర్ల మధ్యలో ఆగదిలోనుండి నా భార్య బయటకివచ్చి అమ్మవచ్చింది మీకు కనబడలేదా! అమ్మవచ్చి నాకుబొట్టు కూడాపెట్టింది. అబ్బాయి అప్పారావు రాలేదా అని కూడా అడిగింది. ఇదిగోఅమ్మపెట్టినబొట్టు అంటూ ఇంకా నిద్ర కళ్ళతోమాట్లాడుతూనే ఉంది. అంతకుముందు తను పెట్టుకున్నబొట్టుకంటే ఇంకొకఎర్రనిబొట్టు నాభార్యనుదిటి పై కనబడుతోంది. ఇదిచూచినఅందరం ఆశ్చర్య చకితులమయ్యాం ఆనందపడ్డాం. ఇప్పటికీ అమ్మ మనతోఉంటున్నదీ అన్న ఆలోచనతోపరవశించాము.

# *FootPrints in the Sand*

One night I had a dream, I was walking along the beach with the lord and across the skies flashed scenes from my life. In each scene I noticed two sets of footprints in the sand. One was mine and the one was the Lord's. When the last scene of my life appeared before me, I looked back at the footprints In the sand and to my surprise. I noticed that many times along the path of my life there was only one set of footprints. And I noticed that it was at the lowest and saddest times in my life. I asked the Lord about it. "Lord, you said that once I decided to follow you, you would walk with me all the way. But I notice that during the most troubles sometimes in my life there is only one set of footprints. I don't understand why you left my side when I needed you most". The Lord said : "My precious child, I never left you during your time of trial. Where you see only one set of footprints, I was carrying you."

✿✿✿

# ఇసుకలో పాదముద్రలు

(అమ్మను గురించి మా మనుమరాలు
అనసూయ వెలిబుచ్చిన అభిప్రాయం)

ఒకనాటి రాత్రి స్వప్నంలో సముద్రతీరంవెంట
స్వామిచెంత నా జీవిత గగనతంలోని మెరుపులవంటి
గత మధురస్మృతులతో నడుస్తున్నాను. అపుడు ఆ
ఇసుకలో రెండుజతల పాదముద్రలున్నట్లు నేను గమనించాను.
నా జీవితచరమాంకంలో కష్టాలు నన్ను చుట్టుముట్టినపుడు
చూద్దునుగదా ఒకజత పాదముద్రలు మాత్రమే కన్పించినవి.
ఆశ్చర్యపోయి స్వామితో ఇలాఅన్నాను. " స్వామీ ! ఎప్పుడు నన్ను.
వీడను అని వాగ్దానంజేశావు జీవితమంతా నాతోనే ఉన్నావు. నా
యీకష్టదశలో నీఅడుగుల జాడలు కన్పించడంలేదు. ఈ దీనస్థితిలో
నన్నెందుకు విడిచిపెట్టావు. స్వామిఅన్నారుగదా "నాయనా !
నీవు కష్టదశలో ఉన్నపుడు కూడా నిన్ను నేను విడువలేదు.
నీవుచూచిన ఆ అడుగుల గుర్తులు నీవికావు. నావి ఈ
సమయంలో నిన్ను నేను భూజానికెత్తుకున్నాను"

మనుమరాలు అనసూయ మాటల్లో :
" నాకు జీవితంలో ఏమిజరిగినా
అన్నీ భగవంతునికృప అనిభావించే
స్థిరమైన నమ్మకాన్ని నాకు భగవంతుడు
పై సందేశం ద్వారా ఏర్పరచాడు. నా
ఉద్యోగ విషయంలో అమ్మ
అనుగ్రహం ఎంతైనా ఉంది.

**T. ANASUYA** B.E.,
A.E. (A.P. TRANSCO)
VIJAYAWADA

అమ్మనునమ్మిన మాకుటుంబమునకంతకు
అమ్మ వజ్రకవచమైయున్నది.

అనసూయ తల్లి గర్భంలో ఉండగా
"సీమంతము" అమ్మ చేతులమీదుగా జరిగినది.

అందుకు ఫలితమే ఉన్నత విద్య
అధ్యాత్మక చింతన.



# నేను పూర్ణానంద స్వామి

అమ్మే భువనేశ్వరి అని విశ్వసించి ఆరాధించిన మహర్షి పూర్ణానంద స్వామి వారు. బ్రహ్మీభూతులు కాకముందు శ్రీ శైలంలో వారి ఆశ్రమంలో తపస్సు చేసుకుంటూ ఉండేవారు. ఇప్పటికీ వారి శిష్యులు జిల్లెళ్ళమూడి కార్యక్రమాలలో పాల్గొంటూ ఉంటారు.

శ్రీ శైలంలోని చిన్మయామిషన్ వారు 20-7-91 నుండి 27-7-91 వరకు సాధన శిబిరాన్ని ఏర్పాటు చేశారు.ఆ సందర్భంగా ఏలూరునుండి కొందరు సోదరులతో శ్రీశైలంచేరాను. అక్కడకుసమీపంలోనే సున్నిపెంటలో పూర్ణానందస్వామి వారి ఆశ్రమంఉన్నది. నేను 24-7-91న నా 57వ పుట్టిన రోజుసందర్భంగా స్వామీజీనిదర్శించుకున్నాను. ఏం చేస్తుంటావని అడిగారు వారు. గత 12 సం॥గా లలితాసహస్రనామపారాయణ చేస్తున్నానని ఈ పారాయణచేసుకొనుటలో మార్పులూచేర్పులూఉంటే సూచించవలసినదిగా ప్రార్థించాను. అమ్మవారిని అంతర్దర్శనంచేసుకోవాలని కోరికకూడాఉందని మీ ఆశీర్వాదంకొరకువచ్చానని చెప్పాను. స్వామీజీ ఆనందపడి కొన్ని సూచనలు చేస్తూ " అంతర్దర్శనంకావాలంటే ముందుగా నాడీ శుద్ధి జరగాలనీ" అందుకుగాను కొంత కాలం రాత్రిసమయంలో రాగి చెంబులో ఉంచిననీటిలో తులసీదళములు వేసి సూర్యోదయానికి ముందుగా ఒకగ్లాసునీళ్ళు తాగమన్నారుప్రారంభంలో. తరువాత రెండు గ్లాసులు ఆ తరువాత మూడుగ్లాసులు తాగమనిసలహాఇచ్చారు. దానివలన నాడీమండలం శుద్ధిఅవుతుందని తద్వారా రక్తప్రసరణ, వాయు ప్రసారం బాగాఉండి ధ్యానంబాగాసాగుతుంది అని చెప్పారు. అంతేకాదు సత్వగుణాన్నిచ్చే ఆహారాన్ని ఎక్కువగావాడమన్నారు. రాత్రిసమయంలో ఆవుపాలతో మాత్రమేభోజనం చేసినట్లయితే లోపలఉన్న దుష్టవేడిపోతుందనీ చెప్పారు. మొదటి10 రోజులుమాత్రమేవేడిచేసినట్లుగా అనిపిస్తుంది అన్నారు.

ఒక వేడిపెనంమీద నీళ్ళు చల్లితే ముందు ఆవిరి పైకివచ్చి వేడిపూర్తిగా చల్లారిపోతుంది. అలాగే శరీరంలోనివేడి ముందుగాపైకివచ్చి తరువాత చల్లదనం చేస్తుందనీ ధ్యానస్థితి చాలామారుతుందనీ ఇలా కొంతకాలం ఆహారనియమంతో సత్వగుణాన్ని అభివృద్ధిచేసుకొనమనీ చెప్పారు. పౌర్ణమి రోజున చంద్రునివైపు చూస్తూ ఆచంద్రుని భ్రూమధ్యంలో నిలుపుకొంటూ కొంతకాలం లలితాసహస్రనామ పారాయణచేస్తే భ్రూమధ్యంలో అతి సూక్ష్మమైన రంధ్రం ఏర్పడి ఆ లోపల చంద్రకాంతి

ప్రకాశించడం గమనించగలుగుతాం. ఆ చంద్రకాంతిని అమ్మవారుగా భావనచేస్తూ ఉండాలి. కొంతకాలానికి ఆ లలితాపరమేశ్వరిని నీలో చూచుకొనే స్థితి వస్తుంది.

అప్పుడు ఈ బాహ్యకర్మలయందు ఆసక్తితగ్గి లోపలఆనందం కలుగుతుంది. ఆసమయంవచ్చినపుడు నేనే నీకుకబురుచేస్తాను అని ఆశీర్వదించారు.

25-7-91 ఉదయం నేను ఆశ్రమానికివెళ్ళి స్వామీజీసన్నిధిలో కూర్చున్నాను. అప్పటికే నేను కుండలినీయోగం కొంతకుకొంత సాధనచేస్తున్న వాడినే. అయితే స్వామీజీసన్నిధిలో అప్రయత్నంగా మూలాధారంలో కుండలినీ సంచలనం విశేషంగాకలిగింది.

## ఆశ్రమంలో ఆత్మానుభూతి

26-7-91వ తేదీ గురుపూర్ణిమ. సాయంసమయంలో ఆశ్రమానికి వెళ్ళాను. ఆశ్రమంలో అందరూ దేవతావృక్షంగా భావించే ఆ వృక్షసమీపంలో స్వామీజీ ఆసీనులై ఉన్నారు. వారి శిష్యగణం వారినిపరివేష్టించిఉన్నది. వాతావరణం ప్రశాంతంగా ప్రసన్నంగా ఉన్నది. చిన్న పిల్లలను స్వామీజీ దగ్గరకుతీసుకొని ఆప్యాయంగా తలలు నిమురుతూ ఆనందిస్తున్నారు. కొందరుశిష్యులు స్వామివారిఒడిలో తలపెట్టుకొని ఆనందానుభూతిని పొందుతున్నారు. నేనుకూడా ఒకప్పుడు అమ్మ ఒడిలో తలపెట్టుకొని ఆనందపడిన వాడినే గదా అనుకున్నాను. అదిచూచిన నేను నన్నుకూడా స్వామివారు దగ్గరకు తీసుకుంటారేమోనని ఆశించి ఆశగావారివైపు చూచాను. నన్ను వారు పట్టించుకోలేదు. బాధకల్గి అమ్మ జ్ఞాపకానికివచ్చింది. వెంటనే అమ్మను ఆర్తితో ప్రార్థించాను. అమ్మా ! ఇప్పుడు నీవు భౌతికంగా లేవు. నీ అసలు స్వరూపాన్ని నేను దర్శించలేను. భౌతికంగా నీవుఉంటే నీ ఒడిలో నేనూ సేదదీరేవాడినిగదా ! అని పెల్లుబికిన దుఃఖంతో అమ్మను ప్రార్థించాను. నన్నెలా అనుగ్రహిస్తావోనమ్మా అంటూ దీనంగా అర్థించాను. దయామయి అయిన అమ్మ నామొరలాలకించింది. ఏ మాత్రం ఆలస్యం చెయ్యలేదు. ఒక్క సారిగా నడుము నిక్కబొడుచుకున్నది. దృష్టి భ్రూమధ్యంలోకి వచ్చినది. మూలాధారం నుండి ఆజ్ఞాచక్రంవరకూ ఎడతెగని ధార ఒక సన్ననిదారంలాగా చీమలబారు ప్రాకుతున్నట్లుగా విశేషమైనఅనుభూతి కలిగింది.

ఆర్తితో నేజేసిన ప్రార్థనను ఆలకించి అనుగ్రహించిన అమ్మకు మనసారా నమస్కరించుకొన్నాను. నాడీశుద్ధి అయినదోలేదో తెలియదుగానీ అమ్మ పరిపూర్ణ కరుణ నాపై వర్షించినది. ఆ అనుభూతితో స్వామీజీ వద్ద సెలవు తీసుకొని భోజనశాలలో చిత్రపటరూపంలోఉన్నఅమ్మకు అశ్రుపూరితనయనాలతో కృతజ్ఞతాపూర్వకంగా పూలమాలవేసి బసకుచేరాను.

# నన్ను నేను సాక్షిగా చూసుకున్నాను!

1975వ సంవత్సరంలో అమ్మకు బాగా అనారోగ్యంగా ఉన్నరోజులలో అందరము అర్ధఏకాహములు ఏకాహములు సప్తాహములు అమ్మ ఆరోగ్యంకొరకు చేస్తున్నాము. ఒకసారి ఏలూరులో పత్రి కమలమ్మగారింట్లో ఏకాహం చేస్తున్నాము. అర్ధరాత్రి ఒంటిగంట అయింది. అందరు నిద్రపోతున్నారు. నేను బొప్పూడి రామబ్రహ్మంగారు మాత్రం మేల్కొని ఉన్నాం.

కమలమ్మగారు బాగా నామంచేసేవారు. నామం చేసేటపుడు తాదాప్యం చెందుతూ ఉండేవారు. అపుడు అమె కదలికలు హావభావాలు మారుతూండేవి. అటువంటి సమయాలలో మేమందరము ఆమెను అమ్మగా భావన చేస్తూ ఉండేవాళ్లం.

అమ్మ ఆరోగ్యం గురించి నేను బాధపడటం గమనించిన కమలమ్మగారు అమ్మ బాధపడుచున్నట్లుగా మనకు కనిసిస్తూఉన్నా అమ్మకు భాధ ఉండదు అంటూ ఆమె అరికాలు నా శిరస్సుపై ఉంచారు. వెంటనే నా కళ్ళుమూతలు పడ్డాయి. బాహ్యాస్పృహకోల్పోయాను. నాలో నుండి నేను విడివడి ఆగదిలో ఉన్నరామబ్రహ్మంగారిని కమలమ్మగారిని, ఆగదిలో ఉన్న అందరిని ఆగదిలో భాదపడుతున్న నన్ను నేను సాక్షిగా చూస్తున్నాను. అలా చూస్తున్న సమయంలో నేను పొందిన ఆనందం వర్ణించలేను.

నేను పొందిన ఈ అనుభవాన్ని జ్ఞానస్వరూపులైన సోదరులు వై. హెచ్.రామకృష్ణ గారితో చెప్పగా నీస్థూల శరీరాన్ని చూచింది నీ సూక్ష్మ శరీరమేనని యోగులు ఇలా వారి స్థూల శరీరాలనే గాక తమ గుణాలను కూడా సాక్షిగా చూడగలుగుతారని అటు తరువాత అందరి దేహాలను కూడా చూడగలుగుతారని చెప్పారు.

అర్హతలతో నిమిత్తంలేకుండా నన్ను అనుగ్రహించిన ఈ మహత్తర అనుభవాన్ని అందించి ఆత్మసాక్షాత్కార అనుభవాన్ని పొందటానికి సాధనా మార్గాలలో ఇలా చెయ్యిపట్టుకుని నడిపిస్తుంది అమ్మ.



"హృదివిశ మనసా స్వం చిన్వతో మజ్జతావా
పవన చలన రోధాదాత్మ నిష్ఠో భవత్వం"
(ఆత్మనుగురించి వెదకుటచేతనో తనయందుతాను నిమగ్నమౌటచేతనో ప్రాణవృత్తిని స్థిరపరచుటచేతనో మనసుతోహృదయమునందుప్రవేశించి ఆత్మస్థితుడవు కమ్ము)

ఇలాంటిఅంశాలవెలుగులో నా అన్వేషణముందుకుసాగింది. 'తత్త్వమయి' అయిన 'అమ్మ' నన్ను చేయిపట్టుకుని నడిపించింది. ఆ నడక ఎలా సాగిందో -- తలచుకుంటేనే మనస్సు పులకిస్తుంది.

**అంతటా ఉన్న శక్తే భగవంతుడు.**

**శక్తి అంటే అన్నిటికీ మూలమైనది.**

**రెండు అయినది-రెండు కానికి దైవం.**

**రెండూ ఆ దైవమే అయినా, రెండు అయితే గాని సృష్టి నడవదు.**

## సోహంమంత్రము - కుండలినీయోగసాధన

ఒకసారి అమ్మనడిగాను అమ్మా సోహంమంత్రం చేసుకోమంటున్నారు కొందరు, గృహస్తులు చేసుకోకూడదంటున్నారుకొందరు, చేసుకోమంటావా! అమ్మా !అని అడిగాను. చేసుకోనాన్నా, నేనుచెబుతున్నాగాచేసుకో. అంటూ " ఎప్పుడు ఏదిహాయిగా సాగితే అది చేసుకో అన్నది"

" ఎప్పుడు ఏది హాయిగా సాగితే అది చేసుకో " అన్న అమ్మమాట నాకు ఒక దివ్యోపదేశం అయింది. అమ్మచేత బొట్టుపెట్టించుకొని బయలుదేరాను. అ ప్రయత్నంగా "జయహోమాత శ్రీఅనసూయ రాజరాజేశ్వరి శ్రీపరాత్పరీ" అనే నామం సాగడంమొదలైంది. నాకు ఆశ్చర్యంవేసింది. ఆనందంకలిగింది. అ ప్రయత్నంగా జరుగుతున్న ఆ నామాన్ని సాక్షిగా గమనిస్తున్నాను ఇది నాకు ఒక అద్భుతమైన అనుభవం. అన్యాపదేశంగా అమ్మయిచ్చిన ఉపదేశమిదేనేమో అనుకొని కొన్ని సంవత్సరాలు ఆనామాన్ని ప్రయత్నపూర్వకంగా చేశాను.

అటుతరువాత కొంతకాలానికి శ్వాస సూక్ష్మమై చిన్నదౌతూవచ్చింది. శ్వాస సూక్ష్మంగా హ్రస్వంగా నడుస్తున్నపుడు దానికి అనుగుణంగా అం.ఆ అనే మంత్రం జోడించి ధ్యానం చేసేవాడిని.

ఒక్కొక్కపుడు "సో" అంటూ గాలిపీలుస్తూ "హం" అంటూ గాలిని వదుల్తూ ఉండేవాడిని. తరువాత కొంతకాలానికి వేదాద్రిమహర్షిగారి వద్ద 1986లో కుండలినీ యోగ దీక్ష తీసికొని వారు స్థాపించిన (యస్.కె.వై) సులభతరకుండలనీ యోగసంస్థలో చేరి అరుణ బాబు గారి వద్ద కొంతకాలం సాధనచేసి కుండలినీయోగంలో 1991 జనవరి 1న మాస్టర్ డిగ్రీ పొందాను. మూలాధారం నుండి సహస్రారం వరకు సుషుమ్నానాడి ద్వారా ప్రవహించే ప్రాణశక్తికి కుండలిని అని పేరు.

కుండలినీయోగసాధన ద్వారా ప్రాణశక్తిని షట్చక్రముల ద్వారా సహస్రారమునకుచేర్చి నాడీమండలమంతా ప్రసరింపచేసి ఆ ప్రాణశక్తినే శరీరమంతా నింపుకోగలుగుతుండేవాడిని.

ఇలా సాధన అనేక మలుపులు తిరుగుతూవచ్చింది. ఎపుడు ఏసాధన అవసరమో అమ్మే నా చేయిపట్టుకుని నడిపిస్తూవచ్చింది.

**మలం పోతే మంత్రం గుర్తొస్తుంది**

**మరుపురాకపోవడమే మంత్రసిద్ధి.**

**మంత్రం ఎల్లవేళలా గుర్తురావటం ప్రమాణమేగాని ప్రమాదంకాదు.**

**శ్వాసపైకి పోయినపుడు**

**క్రిందికి వచ్చినప్పుడు**

**నోటితో అక్షరాలుఉచ్చరిస్తే మంత్రధారణ.**

**జరిగే శ్వాసను గమనిస్తే అజపాగాయత్రి.**

# శ్వాసమీద నిఘా

ఒకసారి అమ్మతో సాధనను గురించి మాట్లాడుతున్నపుడు శ్వాసమీద నిఘావెయ్యినాన్నా అంది. ఇది సాక్షిత్వానికి దారితీసి జీవన్ముక్తిని ప్రసాదించే గొప్ప యోగవిద్య. శ్వాసమీదనిఘా అంటే శ్వాసనుగమనించడం. శ్వాసను గమనించడమంటే జరుగుతున్న ఉచ్ఛ్వాసనిశ్వాసాలను(ప్రాణరూపమగువాయువును) గమనించడమే. శ్వాసమీద ధ్యాస అన్నా అదే.

**ప్రాణ స్పందన :**

ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఊపిరితిత్తుల సంకోచవ్యాకోచములవల్ల ఏర్పడుతున్నవి. ఈసంకోచవ్యాకోచాలు ప్రాణశక్తియొక్క లక్షణం. ప్రాణశక్తి కారణంగా ఏర్పడిన సంకోచ వ్యాకోచములకు ప్రాణఆపానములనిపేరు. ఈ ప్రాణ అపానములవల్ల పరిధి నుండి కేంద్రమునకు కేంద్రమునుండి పరిధికి ఆకర్షణ లేర్పడుచున్నవి. పరిధి నుండి కేంద్రమునకు ఏర్పడు ఆకర్షణమునకు ప్రాణమని కేంద్రము నుండి పరిధికి ఏర్పడు ఆకర్షణమునకు ఆపానమని పేరు ఈ ప్రాణఅపానములనే ఉచ్ఛ్వాసనిశ్వాసములని కూడా అంటారు. ఈ రెండింటిని కలిపి ఒక ప్రాణస్పందనమంటారు.

**ప్రాణ శక్తి :**

శ్వాసను గమనించడం ప్రారంభించినపుడు శ్వాసవేగం తగ్గుతుంది. తరువాత ఉచ్ఛ్వాస నిశ్వాసములేకమై ప్రాణశక్తిగా మిగులుతుంది. ఈ ప్రాణశక్తినే జీవచైతన్యశక్తిఅని విశ్వశక్తిఅని విశ్వచైతన్యశక్తిఅని కుండలినీశక్తిఅని పరాశక్తి అనికూడాఅంటారు.

ఈ విశ్వచైతన్యశక్తి విశ్వమంతటా వ్యాపించిఉంది. అనగా జడపదార్థములయందును చెట్లయందును సకల జీవుల యందును గ్రహనక్షత్రముల యందును అణువులు పరమాణువులయందును దేహేంద్రియసంఘాతమునందును అంతటానిండి ఈ మహావిశ్వాన్ని అంతటిని నడిపిస్తున్నది.

ఈ చైతన్యశక్తిని ఇంద్రియములద్వారా బహిర్గతంచేసినపుడు గొప్పభౌతిక ప్రజ్ఞకలిగి ప్రపంచపరమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించుతాడు. లేదా గొప్ప సైంటిష్టుగాను మారవచ్చు. అంతర్ముఖుడై హృదయస్థానమందు ప్రసరింపజేసినపుడు యోగియై ఆత్మజ్ఞానియై ఆత్మానుభవాన్ని పొంది జీవన్ముక్తుడౌతాడు.

శ్వాసనుగమనించడమంటే ప్రాణదేవతనుఉపాశించడమే. ప్రాణదేవతను ఉపాసించడమంటే-పరాశక్తి జగన్మాత అయిన అమ్మను ఉపాసించడమే.

జ్ఞానులు మనస్సునుగమనించడంద్వారా శ్వాసనునియమిస్తారు. యోగులు శ్వాసనునియమించడంద్వారా మనస్సునునిరోధిస్తారు. మనస్సును గమనిస్తే శ్వాసఆగుతుంది. శ్వాసనుగమనిస్తే మనస్సాగుతుంది.

చలించేమనస్సును నిశ్చలపరుచుకోవడమేసాధన. నిరంతరం ఆత్మచింతనచేయలేనివారు ప్రాణచింతనచేస్తారు. సూటిగా మనస్సునునిశ్చల పరుచుకోలేనివారు శ్వాసను గమనించితే మనస్సునుగమనించే స్థితికి వస్తుంది. చివరకు మనస్సునుగమనించేవాడిని గమనించే స్థితి కూడా వస్తుంది. అటు తరువాత ఆ గమనించే గుర్తుగా ఉన్న (ఎరుకలో) ఎవేర్‌నెస్‌లో ఉండిపోతాడు.

## హృదయస్థానం :

చంద్రబింబమునుండి కిరణములు వెలువడునట్లు ప్రాణశక్తి హృదయమనుండి దేహమధ్యభాగమునకు ఊర్ధ్వఅధోభాగములకు వ్యాపించుచూ నాడీ సమూహంలో ప్రవేశింస్తుంది.

పొగవస్తున్న జాడను అనుసరించివెళితే అగ్నికనిపించునట్లు శ్వాసను గమనించుతూ ఉంటే దానిపుట్టుకస్థానమైన హృదయస్థానాన్ని గోచరింపచేస్తుంది.

హృదయస్థానమంటే ప్రారంభదశలో ఆలంబనంకోసం ఎదురురొమ్ముకు కుడివైపున ఉన్నదని చెప్పుకున్నా చివరకు మనశరీరం అంతా నిండిఉన్నదని తెలుస్తుంది. శరీరంఅంతా అణువులనిర్మాణమేగనుక- ధ్యానస్థితిలో మనస్సు సూక్ష్మాతి సూక్ష్మమైన భూమికలలోనికి వెళ్లినపుడు శరీరంఅంతా అణువులు అణువులుగా విడిపోయినట్లు అనుభూతికలుగుతుంది. తరువాత ప్రతి అణువుకు సంకోచ వ్యాకోచములున్నట్లు గమనింస్తాం. అలాగమనిస్తూ గమనిస్తూ ఉండగా తరువాత సంకోచవ్యాకోచముల పరిధి తగ్గిపోయి నిశ్చలత్వంవస్తుంది. అలానిశ్చలత్వానికివచ్చిన మనస్సు ప్రతి అణువుయొక్క కదలికను గమనిస్తుంది. అంతేకాదు కదలికకు కదలికకు మధ్యవచ్చే స్థితిని కూడా గమనిస్తుంది. కదలికకూ కదలికకూమధ్య కాలాన్ని కూడా గమనిస్తుంది. చివరికి ఆ గమనికే తానవుతాడు.

### సాధన :

కొన్ని నిమిషాలు శ్వాసను గమనించితే ఆలోచనలుతగ్గుతాయి. అపుడు సంకల్పాలకు ఉత్పత్తిస్థానమైన హృదయాన్నిగుర్తించి మనస్సును కేంద్రీకరించవచ్చు. అలా కొంతకాలం సాధన చేయుగాచేయుగా హృదయస్థానంలో మనస్సు నియమింపబడి ఆలోచనలుఆగిపోతాయి. తద్వారా విశ్వచైతన్యశక్తిని అధికంగా పొంది శారీరక మానసిక ఆరోగ్యాన్నివిశేషంగా పొందగలుగుతాం.

మనస్సు యొక్కస్వభావం జరిగినవాటినిగురించి జరుగబోయేవాటిని గురించి ఎక్కువగాఆలోచించుతుందితప్ప వర్తమానాన్నిగురించి అంతగా ఆలోచించదు. శ్వాస ఎప్పుడూ వర్తమానంలోనేఉంటుందిగనుక శ్వాసను గమనించుతూఉంటే మనస్సు ఏకాగ్రవస్థకువచ్చి కేవలం వర్తమానాన్నే గమనిస్తుంది. తద్వారా మనస్సు హృదయస్థానమందు నిలకడచెందుతుంది.

**అనుభవం**

అమ్మ చెప్పినట్లు శ్వాసను గమనించడం ప్రారంభించాను. కొంతకాలం అభ్యాసంచేయగా మనస్సునుగమనించే స్థితి కూడా వచ్చింది. అపుడు నాకు వస్తున్నఆలోచనలను గమనించి నన్నునేను సరిదిద్దుకునేవాడిని. ఇది నా సాధనకు బాగా ఉపయోగపడింది. కొంతకాలం అలా సాధన చెయ్యగా చెయ్యగా మనస్సు యొక్క ఉద్వేగంతగ్గి హృదయస్థానంలో నిలకడచెందుతూ ఉండేది.

ఒక్కొక్క సారి రేచకపూరకములతో సంబంధంలేకుండా శ్వాసను గమనిస్తూ ఉన్నపుడు వాయురహితమైన ప్రాణశక్తిగామారి మూలాధారం నుండి సుషమ్ననాడి ద్వారా హృదయస్థానానికి చేరి అక్కడనుండి సహస్రారానికి చేరేది. అలా కొంతకాలం సాధన చేయగా చేయగా మూలాధారంనుండిసహస్రారానికి సహస్రారంనుండి మూలాధారానికి ప్రాణప్రవాహం ధారాళంగాసాగి నాడీమండలం అంతా శోధింపబడింది. ఈనాడీ మండలమందు ప్రధానమైన ఇడా పింగళ సుషుమ్న నాడులు భౌతికములుకావు. కంటికికనిపించవు. శక్తిమయరేఖలు. కేవలం అనుభూతికి సంబంధించినవి.

ఒకరోజు యేలూరులో షిరిడీసాయిమందిరానికి మధ్యాహ్నాహారతి సమయానికి వెళ్లాను. మనస్సంతా సాయినాధునిమూర్తి మీద కేంద్రీకృతమైంది. ఆసమయంలో ఒక దివ్య చైతన్యశక్తి నాశరీరంచుట్టూ వలయాకారంగా సవ్యాపసవ్యంగా ఆపాదమస్తకం పరిభ్రమించి శరీరంలోనికి చొచ్చుకొనిపోయి నాడీమండలమంతా వ్యాపించింది. అపుడు నాదేహమే ఒక శక్తిమయ క్షేత్రంగా అనుభూతికలిగింది. ఆ తరువాత కొంత సమయానికి గాని నేను మామూలు స్థితికి రాలేకపోయాను. ఆ తరువాతరోజులలో మనస్సు హృదయస్థానమందు కేంద్రీకృతంఅయినపుడు శరీరమంతా ప్రాణస్పందనలతో నిండిపోయేది. అటుతరువాత చలనరహిత స్థితిని పొంది శరీరమంతా తేలికగాను ప్రశాంతంగాను ఉంటూ ఉండేది.

స్టేషను దగ్గరపడుతున్నకొద్దీ రైలువేగంతగ్గినట్లు మనస్సు హృదయస్థానానికి చేరువవుతున్నకొద్దీ ఆలోచనలుతగ్గిపోతూఉండేవి. స్టేషను చేరగానే రైలు ఆగినట్లుగా

మనస్సు హృదయస్థానంలోనిలిచిపోగానే ఆలోచనలు కూడా ఆగిపోయేవి. ఆటుతరువాత దేహమేలేనట్లుగా అనుభూతికలుగుతూ ఉండేది. ఆస్థితిలో నేనున్నప్పుడు అప్రయత్నంగా నాప్రమేయం లేకుండానే అన్ని పనులు జరగడం గమనించేవాడిని. ఆస్థితి ఎక్కువ సమయం నిలబడేదికాదు. ఆ సమయంలో కేవలం సాక్షిగామాత్రమే ఉండేవాడిని.

ఒక్కొక్కసారి శరీరంఅంతా ప్రాణస్పందనలతో నిండిపోయి శరీరం అంతా అణువులు అణువులుగా విడిపోయినట్లనుభూతి కలిగేది. ఆ అణువులన్నీ సంకోచవ్యాకోచములతో స్పందిస్తున్నట్లుకూడ అనుభూతికలిగేది. అటుతరువాత ఆ అణువులన్నీ సూక్ష్మమై చుట్టూ ఉన్న స్పేస్‌లో కలిసిపోయేవి. అప్పుడు దేహరహితంగా ఉన్నట్లు అనుభూతి పొందుతుండేవాడిని. శరీరమంటే అణువుల సంయోగమేగదా .

కొన్ని కొన్ని సమయాలలో శరీరంఅంతా స్పందనలతోనిండి ప్రవాహరూపంధరించి వెలుగుగామారి ఆ వెలుగు శరీరమంతావ్యాపించి శరీరం చుట్టూఉన్నవెలుగులో కలిసిపోయేది. అపుడుకూడా దేహమేలేనట్లు ఆ వెలుగేనేనైనట్లు అనుభూతి కలుగుతూ ఉండేది.

జరుగుతున్న శ్వాసయొక్క కదలికలను గమనించుచున్నపుడు ఏదో ఒక దివ్యచైతన్యశక్తి ఊపిరితిత్తుల సంకోచవ్యాకోచముల ద్వారా శ్వాసను నియంత్రిస్తున్నదనీ నేనుకర్తనుకాదని నాకు అనుభవంకలుగుతుండేది. ఈ తత్వరహస్యం అర్థంకావటానికేనేమో అమ్మ శ్వాసమీదనిఘా అనే ఈయోగ విద్యారహస్యాన్ని నాకు చెప్పింది.

ఇప్పటివరకూ ఈ శ్వాసమీదనిఘా అనే యోగవిద్యవల్ల కలిగిన అనుభవాలను తెలుసుకున్నాం. ఇపుడు మానసిక శారీరక ఆరోగ్యములు కూడా ఈ విద్యవల్ల ఎలా కలుగుతాయో వివరంగా తెలుసుకుందాం.

మన దైనందిన కార్యక్రమములకు అవసరమైనంత ప్రాణశక్తిని (విశ్వచైతన్యశక్తిని) మనం పొందని కారణంచేత శారీరక రుగ్నతలు మానసిక ఒత్తిడులు మనకు కలుగుతున్నాయి.

ఎప్పుడైతే విశ్వచైతన్యశక్తిప్రవాహం మనలోకి రావడం తగ్గుతుందో నాడీమండలంలో అడ్డంకులుఏర్పడి ప్రాణప్రవాహం ధారాళంగా సాగదు. మనలోని ఆలోచనలే ప్రాణప్రవాహం మనలోకి రాకుండా అడ్డుకుంటాయి.

ప్రాణప్రవాహం ధారాళంగాసాగినపుడు మెదడులోని ప్రతిపొరకు ప్రాణశక్తి అధికంగా అందుతుంది. అందువల్ల అక్కడికి రక్త ప్రసరణ వాయుప్రసారం పెరుగుతుంది. ఆకారణంగా బుద్ధిమాద్యం తగ్గుతుంది. జ్ఞాపకశక్తిపెరుగుతుంది. మానసికఒత్తిడితగ్గి ప్రశాంతస్థితికలగడమేగాక శారీరకరుగ్మతలనుండి కూడా బయటపడగలుగుతాము.

విశ్వచైతన్యశక్తి ధారాళంగా మనలోకి ప్రసరించాలంటే ధ్యానం ఒక్కటే అందుకు సులువైనమార్గం. అందుకు ఉత్తమమైనసాధన శ్వాసమీదధ్యాస. అదే శ్వాసమీద నిఘాఅనే యోగవిద్య.

శ్వాసమీదనిఘా అనే ఈ యోగవిద్యను నాకేగాక మరికొందరు సోదరులకు కూడా అమ్మ చెప్పింది. నేను వారినీ మరికొంతమంది మహాత్ములను కలిశాను. ఈ యోగవిద్యకు సంబంధిచిన అనేక గ్రంథాలను కూడా పరిశీలించి నా అనుభవాలను సరిచూచుకొని సంతృప్తి చెందాను. అలా పరిశీలించిన గ్రంథాలలో భగవాన్ రమణమహర్షిగారి ఉపదేశామృతం,ఉపదేశసారము. ధ్యానం చేసేదిగాదు జరిగేది అనే గ్రంథం, యోగవాశిష్టంలోని భుషుండోపాఖ్యానం, ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారి మంద్రగీత, శంఖారావం, యోగప్రసంగాలు. శ్రీ విద్యోపాసనకుసంబంధించిన తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు గారి శ్రీచక్ర విలసనము జ్ఞానేశ్వరి భగవత్ గీత, మొదలైన గ్రంథముల సారాంశమే ఈ వ్యాసం.

శ్వాసమీద నిఘా అనే ఈ యోగ విద్యను ఏ సాధన లేకుండా అమ్మ అనుగ్రహంతో అందుకోగలిగిన ధన్యజీవులలో దినకర్ అన్న గారు ఒకరు. వారు సంస్థకుచేసిన విశిష్టసేవలు అమ్మయందుంచిన పరిపూర్ణవిశ్వాసం అందుకుకారణమని నాఅభిప్రాయం.



## శ్వాసమీద నిఘా, దినకర్ గారితో సంభాషణ

సాధకులలో కొందరికి అమ్మ శ్వాసమీద నిఘావెయ్యమనిచెప్పింది అందులో దినకర్ గారు ఒకరు. వారిని నేను కొంతకాలంగా గమనిస్తూ వస్తున్నాను. చాలా విలక్షణంగా కనిపించేవారు. వారితోమాట్లాడుతున్నపుడు, వారుఎక్కడైన ప్రశాంతంగాకూర్చున్నపుడు, నేను వారిశ్వాసను గమనిస్తూ ఉండేవాడిని. వారికి శ్వాసమీద కంట్రోల్ ఉంది అని అనిపించింది. శ్వాసఉందా లేదా అన్నట్లుగా ఉండేది. వారిసాధననుగురించి తెలుసుకుందామని ది. 14-6-06 ఉదయం 7 గంటలకు వారింటికివెళ్ళాను. అన్నయ్యగారు సాదరంగా నన్ను ఆహ్వానించారు.

నేను : అన్నయ్యా అమ్మ నీకు శ్వాసమీద నిఘావెయ్యమని చెప్పింది కదా !

అన్నయ్య : అవును. ముక్కు దగ్గర దృష్టి ఉంచి శ్వాసనుగమనించేవాడిని.

నేను : నేను అరగంటనుండి మీ శ్వాసగతిని గమనిస్తున్నాను. మీకు శ్వాసనిలిచిపోయింది. మీరు మాట్లాడుతున్నపుడు కూడా గమనించాను. అపుడుకూడా శ్వాసఎక్కడో చాలా సూక్ష్మంగా నడుస్తుంది. ఇది చాలాకొద్దిమందిలో మాత్రమే అరుదుగాకనిపిస్తుంది. మీకీ స్థితి ఎంతకాలం నుండి ఉంది . ఎలా వచ్చింది మీ సాధన అనుభవాలను గురించి చెప్పండి.

అన్నయ్య : అదిఅంతా నాకేమీతెలియదుగాని అంతా అమ్మే చూసుకుంటుంది అనుకునే వాడిని. అమ్మను ఆశ్రయించినతరువాత ఒకసారి నా శరీరం నుండి ఏదో బరువును అమ్మతీసేసినట్లనిపించింది. అప్పటినుండి ఒక్క సారి కళ్ళుమూసుకుంటే నాశరీరంనుండి నేను వేరై నట్లుగా అనుభవం కలుగుతుంది. అపుడు మాటలు చేతలు అప్రయత్నంగానే ఉండేవి. నేను యేవోఆలోచించిమాట్లాడేవాడినికాదు.

నేను : వెలుగుకు సంబంధించిన అనుభవాలు మీకేమైనా ఉన్నయ్యా ?

అన్నయ్య : ఉన్నాయి. నేను అమ్మదగ్గరకువచ్చిన కొత్తల్లో నాకంటేముందు ఒక వెలుగు వెళుతూఉండేది. అప్పుడపుడు నా శరీరం కూడా వెలుగుతోనిండి పోయేది. అలా నేను అనేకసార్లుగమనించాను. బాపట్లలో బయలుదేరితే పొన్నూరువరకు ఆవెలుగు నాకంటే ముందు వెళుతూ ఉండేది.

నేను : అన్నయ్యా నీవు ఎంతఅదృష్టవంతుడవు. అహంకారం కరిగిపోయినపుడేగదా! అహంప్రవృత్తిమిగిలేది. చేతులు నీవిగాని చేతలు నీవికాదు. అన్న అమ్మ మాట నీకు అనుభవానికి అందించింది. అదేగదా ! జీవన్ముక్తి అంటే.

దినకర్ అన్నయ్య గారు అమ్మయందు ఉంచిన అచంచలమైన విశ్వాసమేకదా ఈ అనుభవం.

భక్తి బాల్యం లాంటిది

యోగం యవ్వనం లాంటిది

జ్ఞానం వృద్ధాప్యం లాంటిది

భక్తి యోగం జ్ఞానయోగం ఒకదానిని విడిచి ఒకటి ఉండవు.

దైవంలో చూస్తే భక్తి, శ్వాసలో చూస్తే యోగం.

అవయువాలచేత మనస్సు కట్టుబడితే ప్రాణాయామం

మనస్సుచేత అవయువాలు కట్టుబడితే భక్తి

# జ్యోతి దర్శనం

అది 1994వ సంవత్సరం ఒక రోజు తెల్లవారుఝామున నాలుగు గంటలకు ధ్యాన సమయంలో శరీరంఅంతా చైతన్యప్రవాహంతో నిండిపోయింది. ఆప్రవాహం కాంతిప్రవాహంగామారి భ్రూమధ్యస్థానానికి చేరుతూ జ్యోతిరూపాన్ని సంతరించుకున్నది.

(నిర్విషయ జ్ఞానావస్థలో ఆత్మ స్వయంజ్యోతియై ప్రకాశిస్తుంది

(వివేకానంద-రాజయోగంపేజీ 49)

ఆ జ్యోతి అంగుష్ఠప్రమాణంలో దేదీప్యమానంగా ప్రకాశించింది.

కొన్ని క్షణముల తర్వాత ఆ జ్యోతి కరిగిపోతూ కాంతిగామారుతూ శరీరమంతా వ్యాపించింది. అపుడు జ్యోతి కనుమరుగైంది. అలా రెండుమూడు సార్లు శరీరమంతా వ్యాపించిన కాంతి-జ్యోతిగానూ, జ్యోతి-కాంతిగానూ మారుతూ వచ్చింది.

జ్యోతిగాఉన్నప్పుడు ఆ కాంతివేరు. ఆ అనుభూతి వేరు. శరీరమంతా నిండినప్పటి కాంతివేరు. ఆ అనుభూతి వేరు. శరీరమంతా నిండిఉన్నప్పటి కాంతి కన్నా జ్యోతిగాఉన్నప్పటికాంతి ఎన్నోరెట్లు అధికంగాను, విలక్షణంగానూ ఉంది.

**స్థలమేక ముపాశ్రిత్య - చైతన్య జ్యోతిరుజ్జ్వలమ్**

**సర్వం భాసయతే దేహం - భాస్కరోభువనం యథా**

రమణగీత 9/7

రంగస్థలంమీదఉన్న దీపం ఏవిచక్షణాలేకుండా పాత్రలన్నిటినీ చూపిస్తూ తానుమాత్రము సాక్షిగాఉన్నట్లుగా సూర్యుడు తనస్థానంలోనుండి జగత్తును ప్రకాసింపజేస్తున్నట్లుగా స్వయంప్రకాశ స్వరూపమైన ఆత్మజ్యోతి దేహమునందొక స్థానమునందుండి దేహమంతటినీ ప్రకాసింపజేయుచున్నది.

చిల్లులకుండలో పెట్టబడిన దీపం తన ప్రకాశంద్వారా కుండ లోపలి భాగానికీ వెలుగునిస్తుంది రంధ్రముల ద్వారా తన పరిసరాలకూ వెలుగునిస్తుంది. అట్లే ఆత్మజ్యోతిప్రకాశం ఈ దేహమునందలి మనోబుద్ధి ప్రాణములనేగాక ఇంద్రియముల ద్వారా వెలుపలికివచ్చి బయటి విషయసమూహాన్ని కూడా ప్రకాశింపజేస్తుంది.

స్వయంప్రకాశస్వరూపమైన వెలుగే నీ ఆత్మ. అగ్నికివేడిఎట్లా సహజమో ఆత్మకువెలుగూ అంతే. ఆ వెలుగే పరంధామము. మోక్షధామము. అది దైవీశక్తికి నిలయం.

ఈ చరాచరజగత్తంతటికీమూలము, చైతన్యము నాదము, వెలుగు. ఇవి పరమాత్మ యొక్క లక్షణములు.

ఒక రోజు భగవాన్ రమణ మహర్షి యొద్దకు ఒక ఆంగ్లేయభక్తుడు వచ్చి కొంతకాలము సేవచేస్తూ వచ్చాడు. అతనికి భగవానునందు పరిపూర్ణభక్తి విశ్వాసాలున్నాయి.

భగవాన్ అతనిని అనుగ్రహించదలిచాడేమో ఆభక్తునికి ఒక గుండ్రాయి చేతికిచ్చి ప్రతిరోజూ దానిని చూస్తూ ఉండమన్నారు. భగవాన్ నందుండే భక్తి విశ్వాసాలతో ప్రతి రోజూ కొంత సమయం మనస్సును ఏకాగ్రంచేసి చూడటం మొదలుపెట్టాడు. కొద్దిరోజులకు గుండ్రాతి స్థానంలో వెలుగు కనిపించడం ప్రారంభం అయింది. అప్పుడు ఆ భక్తుడు ఈ రాతికేకాదు సమస్తప్రపంచానికీ ఈ వెలుగే మూలవస్తువని తెలుసుకున్నాడు.

ఈ వెలుగే జడములైన ఇంద్రియములద్వారా బయటకు వినిర్గమించి బాహ్యవస్తువులను కూడా ప్రకాశింపజేస్తుంది అని అనుభవపూర్వకంగా తెలుసుకోగలిగాడు.

చిత్తము ఆత్మయందునిలిచినప్పుడు వెలుగుగామారి సాధకునకు మార్గదర్శకంఅవుతుంది. తరువాత జ్యోతిగాదర్శనమవుతుంది. క్రమంగా ఆ జ్యోతిని సమీపించి జ్యోతిలోలీనమై జ్యోతిస్వరూపమే తానవుతాడు.

జ్యోతిస్వరూపములైన సూర్యచంద్ర నక్షత్రాదులకు వెలుగునిచ్చేది కూడా ఈ పరంజ్యోతియే. సకలజీవులలో చిత్కళారూపంలో ఉండి ఈ సృష్టినంతా నడిపించేదీ ఆ పరంజ్యోతియే.

అర్హతలంటూ ఆలోచిస్తే 7వ మైలురాయి దాటి ఎవ్వరూరాలేరు అనేది అమ్మ అర్హతలతో పనిలేకుండా అమ్మ నాకిచ్చిన ఈ అనుభవం అందుకు ప్రత్యక్షనిదర్శనమేకదా!

❀❀❀

## అంతా అదే

· అమ్మ తన బిడ్డలకు అఖండ జ్ఞానాన్ని అందించాలనుకుందేమో - ఈ "కనిపించేదరంతా అదే" అన్నది. అంటే! కనిపించేదంతా పరమాత్మ స్వరూపమేనని.

ఒక్కటే ఇన్నిఅయిందిగనుక అన్నింటిలోఉన్నదిఒకటేనని తెలుసుకోవడానికి చేసే ప్రయత్నమే సాధన అన్నది. " **అనేకం ఒకటిగా తోచడం ఆత్మసాక్షాత్కారం** " అని కూడా వివరించింది.

అమ్మచెప్పినమాటనే గీత, భాగవతం, ఉపనిషత్తులు కూడా చెబుతున్నాయి.

**"మత్తఃపరంతరం నాన్యత్కించి దస్తి ధనంజయ**
**మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణిగణాయివ"**

తా॥నాకంటే అన్యమైనది కించిత్తు కూడాలేదు అన్నాడు కృష్ణపరమాత్మభ॥గీత. 7:7లో

**"హరిమయము విశ్వమంతయు**
**హరివిశ్వమయుండు సందియము పనిలేదా**
**హరిమయముగాని ద్రవ్యము పరమాణువులేదు.**

(భాగవతం)

**" సర్వం ఖల్విదం బ్రహ్మ"** అన్నాయి ఉపనిషత్తులు.

సాధన దశలో అన్నింటిలో భగవంతుడున్నాడని, సిద్ధదశలో అన్నింటిగా ఉన్నాడని శాస్త్రవచనం. ఈ విషయం స్పష్టంగా అర్థంకావటానికి - ఎందరి దగ్గరకో వెళ్ళాను. ఎందరినో అడిగాను - సందేహం నివృత్తికాలా! సందేహం సందేహంగానే మిగిలిపోయింది.

5-4-1974 శ్రీశ్రీశ్రీ అవధూతేంద్రసరస్వతిస్వామివారితో కలసి జిల్లెళ్ళమూడి వెళ్ళాను. నా సందేహాన్ని తీర్చవలసినదిగా అమ్మను కోరారు స్వామీజీ.

సాక్షాత్తు జగజ్జనని అయిన అమ్మ గురువుగా నా సందేహాలను తీరుస్తున్న దనుకున్నపుడు నా ఆనందానికి అవధులు లేవు. హృదయం ద్రవించింది. పరవశిం పోయాను. ఒక్కసారి అమ్మ కరుణారస దృష్టిని నామీద సారించింది !

అంతా అదేనని అనుకోవడమా ! అనిపించడమా ! అని అడిగాను.

అమ్మ తన సహజవాత్సల్యంతో - - " **అనిపిస్తుంది నాన్నా! ముందు అనుకో తరువాత అనిపిస్తుంది"** అంటూ వసుంధర అక్కయ్యతో ఒక బంగారు గాజును తెప్పించి నాకు చూపించుతూ . . . . .

అమ్మ - ఇది ఏమిటి నాన్నా ?
నేను - గాజు.
అమ్మ - గాజుకాదు బంగారంకదా ?
నేను - ఔను
అమ్మ - బంగారంకాదు మట్టికదా ?
నేను - అవును.
అమ్మ - మీరు ఇంతవరకువచ్చి ఆగుతారు.
మట్టికూడాకాదు. అదేఅనిపిస్తుంది. అంటూ సంభాషణ ముగించారు.

మీరు మట్టివరకు వచ్చి ఆగుతారు నాకు మట్టికూడా కాదు అదే అనిపిస్తుందన్న మాట నన్ను జిజ్ఞాసువుగా మార్చింది.

మట్టిఅనేది పంచభూతాలలోఒకటి. ఈ సృష్టిఅంతా పంచభూతాత్మకమే గదా! ఈ సృష్టి ఎక్కడనుండివచ్చింది - ఈ సృష్టికి కర్త ఎవరు? ఈ సృష్టియొక్క నిజరూపమేమిటి? ఇంతకి నేనెవరు? నా నిజరూపం ఏమిటి . . . అన్న ఆలోచనలు అనేక గ్రంథాలు అధ్యయనంచెయ్యటానికి దారితీశాయి.

ఈశ్వరునియొక్క సమగ్రరూపం తెలియాలంటే ముందుగా ఆత్మానాత్మవివేకం కావాలి. ఈ విషయాన్ని కృష్ణ పరమాత్మ - అపరా ప్రకృతి (జడం) పరా ప్రకృతి - (చైతన్యం లేక చేతనా ప్రకృతి) అనే పేర్లతో వివరించారు. - భ॥గీ. 7:4, 7:5లో

అపరా ప్రకృతిని గురించి చెబుతూ -

**"భూమిరాపో౽ నలోవాయుః ఖం మనో బుద్ధిరేవచ**
**అహంకారమితీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" 7/4**

**"అపరేయమిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,**
**జీవభూతాం మహాబాహో!యయేదం ధార్యతే జగత్"7/5**

నేనే పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారం - అనే ఈ అష్ట ప్రకృతులుగా రూపొందాను - ఇది నాజడ ప్రకృతి.(అపరాప్రకృతి) దీనికన్నా వేరైన జీవచైతన్యమే పరాప్రకృతిఅని తెలుసుకో.(చేతన)

ఈ అష్టప్రకృతులే సృష్టిగా ఏర్పడినవి. ఇవి విడిపోయి ఎక్కడ్కెడో ఎడమెడంగా ముక్కలయి వేరువేరుగా లేవు - సర్వత్రా వ్యాపించి అవ్యక్తంగా అచేతనంగా ఉన్నాయి. వాటిని చైతన్యవంతంచెయ్యటానికి పరమాత్మయే జీవచైతన్యంగా (చేతనగా) అష్ట ప్రకృతులలో ప్రవేశించాడు. ఈ జీవచైతన్యమే పరాప్రకృతి. అనగా జడ చైతన్యములు రెండూ పరమాత్మయొక్క అపరా, పరా ప్రకృతులే. ఈ రెండింటి కలయికయే ఈ జగన్నాటకమంతా.

బాహ్య ప్రపంచం - దాన్నిచూచే అంతఃకరణస్వరూపమైన - మనో బుద్ధి అహంకారాలు, వాటిని కదిలించే జీవచైతన్యం అన్నీ పరమాత్మ ప్రకృతే అయినపుడు ఆయన కాని దేమున్నది. మనకు అర్థంకావటానికి అచేతనంగా ఉన్న అపరాప్రకృతి ఒకటి ఉన్నట్లు - దానిని చైతన్యవంతంచెయ్యటానికి పరాప్రకృతి రూపమైన జీవచైతన్యం అందులో ప్రవేశించినట్లు చెప్పారేగాని నిజానికి ఇవన్నీ ఒకే చైతన్యంలోని భాగాలేగదా !

ఇదే విషయాన్ని భగవద్గీత - 7/7లో **"మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణిగణాయివ"** అని గీ 7:7 లో పరమాత్మ చెప్పారు. ఈ సృష్టి అంతటా దండలోని దారంవలె సూత్రాత్మగా ఉన్నది నేనే నని తాత్పర్యం.

దీనికి ఊర్ణనాభిని ఉదాహరణగా తీసుకొంటే - ఊర్ణనాభి అనగా సాలిపురుగు. దానినుండి - దారం వస్తుంది. ఆ దారంతో గూడు కడుతుంది. ఆ గూడుకు ముడిపదార్థమూ - కర్త - తానే అయింది. అలాగే పరమాత్మ ఈ సృష్టికి మూలకారణముగాను, కర్తగాను తానే పడుగుపేకలవలె ఉన్నాడు.

పరమాత్మ అంతటా నిండిఉన్నా మనకెందుకు గోచరించడం లేదు ? దండకు ఆధారం దారం. ఆ దారం కంటికి కనిపించదు. అలాగే నామ రూపాత్మకమైన జగత్తుకు ఆధారమైన ఆత్మ కంటికి కనిపించదు. ఆత్మ అంతటా వ్యాపించి ఉంది. తెలియబడడం అంటూ వస్తే శక్తి రూపంగా తెలియబడుతుంది.

పదార్థంలో శక్తి ఉండడం అన్నది వ్యవహారిక దశలో అర్థమయ్యే సత్యం. పదార్థంగా ఉన్నదికూడా శక్తేనని అనుభవంగా తెలియడం పారమార్థిక సత్యం. ఇపుడు నాకు అర్థమైంది. మీరు మట్టివరకు వచ్చి ఆగుతారు నాకు అంతా అదే అని అనిపిస్తుంది అన్న అమ్మ మాటలోని అంతరార్థం.

**"మనది వస్తుదృష్టి అమ్మది తత్వ దృష్టి."**

దీనినే అమ్మ మనకు సులభంగా అర్థం అయ్యేందుకు ఒక చెట్టును ఉదాహరణంగా తీసుకొని - మాను, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూవులు, పిందెలు వేరు వేరుగా కనిపిస్తున్నా - దేనిగుణం, దేనిరూపం, దానిదే, అలాగే ఈ చరాచర జగత్తంతా రూపాలు, నామాలు, గుణాలు భిన్నభిన్నంగా ఉన్నా ఉన్నదంతా ఒక్కటేనన్నది. అంతేకాదు - **"కనిపించడం రెండుగా ఉన్నా - అనిపించడం ఒకటిగా ఉంటుంది".** అని చెబుతూ - అంతా అదే అన్నమాటలో వేదాంత సర్వస్వాన్ని అందించింది అమ్మ.

# అమ్మ కోరిక

తేదీ. 4-9-1980

కోరికలే లేని అమ్మ ఒకరోజు తన కోర్కెను వెలిబుచ్చింది. అమ్మ "నా ఒక్క కోరిక" అన్నది. ఏమిటా అన్నట్లు చూశాం అందరం.

"అన్నపూర్ణాలయం వ్యక్తి మీద ఆధారపడి ఉండకూడదు. అంటే నా మీదే ఆధారపడి ఉండకూడదు. వ్యక్తి ఉన్నా లేకపోయినా అన్నపూర్ణాలయం గంట ఎప్పుడూ మ్రోగుతూ ఉండాలి. అందరికీ హితవుగా భోజనం పెట్టాలి. చేసింది శుచిగా, శుభ్రంగా చేయాలి. ఒక్కరోజు తింటే బాగానే వుంటుంది. ఆ భోజనం మీదే ఆధారపడ్డవాళ్ళు ఎంతో మంది ఉన్నారు. వాళ్ళు నిత్యం ఆ భోజనమే చేయాలి అంటూ అన్నపూర్ణాలయం సమర్థవంతంగా జరుపబడాలి" అని చెప్పింది.

అమ్మకు ఆరోగ్యం బాగాలేదు. బాగా నీరసంగా ఉండి కూడా "పిల్లలకు, అందరికీ బాగా పెట్టుకోవాలి అనే ఉంటుంది" అని తన ఆవేదనను వ్యక్తం చేసింది.

("శ్రీవారి చరణ సన్నిధి" 429వ పేజీలోని సేకరణ)

# అమృత సందేశం

మిమ్మల్ని వదిలి నేను మాత్రం ఎక్కడకు పోతానురా ?

నేను మీతోనే ఉంటాను, మీకు కనపడకపోవచ్చు గానీ,

ఎప్పుడులాగే మిమ్మల్ని నేను చూసుకోనూ ? బిడ్డల యోగక్షేమాలు చూసుకోవడం తల్లి ధర్మం.

అన్నపూర్ణాలయం, విద్యాలయాలు, వైద్యాలయాలు, దేవాలయాలు . . .

అన్నింటినీ యధావిధిగా కొనసాగించండి.

ఎట్లా నడపడం ? - అని భయపడవద్దు. ఇప్పుడు మాత్రం ఇదంతా (ఈ సంస్థను నడపడం) మీరు చేస్తున్నారా ? మీ ద్వారా జరుగుతున్నది, మీరు నిమిత్త మాత్రులు. ఇప్పుడు ఏ శక్తి జరుపుతున్నదో ఇక ముందు కూడా అదే శక్తి జరుపుకుంటుంది.

ఈ సంస్థ ముందు ముందు మహోజ్జ్వలంగా ఉంటుంది.

సాధకులకు, యోగులకు, తపస్వికులకు ఈ నేల నిలయమవుతుంది.

యాత్రికులకు జిల్లెళ్ళమూడి మహాక్షేత్రం అవుతుంది.

నేను కనపడను - అని దుఃఖపడకండి.

అవసరమయినప్పుడల్లా కనిపిస్తాను.

(11-6-1985 రాత రామకృష్ణతో చెప్పిన మాటలు)

లోకాసమస్తా సుఖినోభవంతు

-: జయహో మాతా :-

- o -



రచయిత
త్రిలోక అప్పారావు

జననం : 14-7-1935, గుంటూరు

జననీజనకులు : లక్ష్మీనరసమ్మ, పున్నయ్యగార్లు.

విద్యాభ్యాసం : 8 వ తరగతి, హిందూకాలేజీ హైస్కూలు, గుంటూరు.

వివాహం : 12-06-1955, కుసుమాంబతో.

సంతానం : ఒక కుమారుడు, నలుగురు కుమార్తెలు.

మంత్రోపదేశం : బ్రహ్మీభూత సేగు కృష్ణదాసు,మళయాళ స్వామివారి శిష్యులు (శ్రీరామ మంత్రము).

శిక్షణ,గురువులు : అవధూతేంద్ర సరస్వతి స్వామి, లక్ష్మణయతీంద్రులు, శారదాప్రియానంద,
వాసుదేవానందగిరి,శ్రీ వేదాద్రిమహర్షిగార్లు (ఎస్.కె.వై.)

వృత్తి : 1990 వరకు వ్యాపారము.

ప్రవృత్తి : సాధుసేవ, సత్సంగ నిర్వహణ, ఆధ్యాత్మికచింతన, కుండలినీ యోగసాధన,
భగవద్గీత, లలితాసహస్రనామ ప్రవచనాలు, యోగ శిక్షణా తరగతుల నిర్వహణ.

అమ్మదర్శనం : 1957, పరిపూర్ణ శరణాగతి 1971.
మాతృశ్రీ అధ్యయన పరిషత్ ఏలూరు శాఖ కార్యదర్శిగా అమ్మచే నియామకం.
జిల్లెళ్ళమూడి ఓరియంటల్ కాలేజీ ఉపాధ్యక్షులుగా 1973-75,1982-84.
సహకార్యదర్శిగా 1985-89.

ఇతర రచనలు : అమ్మనోటి ఆణిముత్యాలు.